# అతిమానస ఉషోదయము










శ్రీ అరవింద సొసైటి
తెనాలి

# అతిమానస
# ఉషోదయము





శ్రీ అరవింద సొసైటి
తెనాలి

ప్రథమ ముద్రణ: ఆగస్టు 1973

ప్రతులు :
500

వెల :
రు 2-50





ప్రకాశకులు :
శ్రీ అరవింద సొసైటీ, తెనాలి

ప్రాప్తిస్థానము :
1. శ్రీ అరవింద సొసైటీ – తెనాలి, గుంటూరు జిల్లా.
2. శబ్ద, శ్రీ అరవిందాశ్రమము, పుదుచ్చేరి – 2.

ముద్రణ :
ఎ. ఎస్. ఆర్. పవర్ ప్రెస్, తెనాలి.



*Lord, Thou hast willed, and I execute.*
*A new light breaks upon the earth,*
*A new world is born.*
*The things that were promised are fulfilled.*

**—THE MOTHER**

ఈశ్వరా ! నీవు సంకల్పించగా నేను నిర్వహించుచున్నాను.
నూతన తేజ మొకటి భువిపై నవతరించుచున్నది,
నూతన లోక మొకటి భువియం దావిర్భవించుచున్నది.
నాటి నీ వాగ్దానములు నేడు కదా ఫలించుచున్నవి !

—మాతృశ్రీ

# మా మాట

శ్రీ మాతారవిందుల ప్రవచనాలను అనువదించి వ్యాఖ్యానరూపమున విశదీకరించిన అజ్ఞాత భక్తునకు నమస్కృతులు.

ఈ రచనమునందు ఎడనెడ పేర్కొనబడిన 'మిత్రునికి' కై మోడ్పులు. ఈ రచనలను సేకరించి ఈ రూపమున ప్రకటించుటకు వీరే కారకులు.

ఈ ప్రవచనములకు మూలములు శ్రీ అరవిందాశ్రమం నుండి వెలువడుచున్న 'ది బుల్లెటిన్', 'ది మదర్ ఇండియా', 'ఆల్ ఇండియా మాగజిన్' వారి సౌజన్యముతో గ్రహింపబడినవి.

కేవలం తెలుగు తెలిసిన వారికే ఈ రచన ఉద్దిష్టము. చంద్రునికొక నూలుపోగన్నట్లు శ్రీ మాతారవిందుల మహాశయ సిద్ధికి ఇది ఒక చిఱు కానుక.

దీనికి తమ అమూల్యాభిప్రాయముల నొసంగిన గుంటూరు వాసి పూజ్యశ్రీ ప్రొఫెసరు వై. యస్. ఆర్. చంద్రన్ గారికిన్నీ, ఆశ్రమమంతేవాసి పూజ్యశ్రీ పాంచాళవరపు కామేశ్వరరావు గారికిన్నీ మా హృదయపూర్వక నమస్కారములు.

దీని ముద్రణకు తోడ్పడిన మిత్రులకు, ఎ. ఎస్. ఆర్. పవర్ ప్రెస్, తెనాలి వారికి మా కృతజ్ఞతలు.

శ్రీ అరవిందాశ్రమం కాపీరైటు డిపార్టుమెంటు వారు ఈ గ్రంథమును ప్రచురించుటకు దయతో అనుమతి నొసంగిరి. వారికి మా వినయపూర్వక వందనములు.

శ్రీమాత పాదారవిందములకు ప్రణామములతో,

శ్రీ అరవింద సొసైటి

15-8-1973 తెనాలి

# అమూల్యాభిప్రాయము

'అతిమానస ఉషోదయము' అను ఈ గ్రంథము వ్యవహారిక భాషలో వ్రాయబడినది. శ్రీ మాతారవిందులు తమ ప్రార్థనలలో, ఇష్టాగోష్ఠి సంభాషణలలో వ్యక్తము చేసిన లోతైన భావములకు సంబంధించిన రచన ఇది. రచయిత తాను చేసిన వ్యాఖ్యానములను శ్రీ అరవిందులవారి విజ్ఞాన జలధిలో మునకలు వేసిన శ్రీ కె. డి. సేత్న మొదలైనవారి గ్రంథముల నుండి ఉటంకించి బలపరచెను. స్వసంవేదనము, ఆత్మాభివర్ణన మనోజ్ఞములు. ప్రత్యేకించి ఒక కథలో ఒకామెను తన ఆత్మ తన బాల్యరూపంలో కనుపించి, రాబోవు ఆపదలనుండి ఎలా హెచ్చరించి, సంరక్షిస్తూ వచ్చిందో హృద్యముగా వర్ణింపబడింది.

ఇందలి భాష శాస్త్ర పద్ధతిలో నడిచింది; అందుచే సావధానంగా చదవాలి. అతిమానసావతారమైన పరమ గురువు బోధనలను పొందుపరచి తెనాలి శ్రీ అరవిందసొసైటీ వారు ఇంత చక్కని గ్రంథము ప్రకటించినందులకు అభినందనీయులు. రచయిత ప్రచ్ఛన్నుడుగా తనను తాను అభినందించుకున్నాడు; తాను లోక ప్రచురణమునకు గాక నిస్వార్థసేవకే అంకితమైనాడు.

ప్రొఫెసరు వై. యస్. ఆర్. చంద్రన్.

5—8—73

గుంటూరు.

# *PREFACE*



The book 'Atimanasa Ushodayamu' is written in the spoken tongue and deals with the profound thoughts expressed by the Mother and Sri Aurobindo in prayers, conversations and discourses. The author supports his interpretations by quoting from those who are soaked in Sri Aurobindonian lore such as Sri K.D. Sethna and others. He has correctly brought out the meaning of Self-awareness and the description of the Soul. The particular translation of the story where soul figures as a small child warning and protecting the mortal, is very impressively written.

The language adopts the scriptural phrasing, calling for a concentrated reading. The Aurobindo Society, Tenali, deserves congratulations for bringing out this handy publication containing the teachings of the Great Master, an Incarnation of the Supermind. The author remaining incognito pays a tribute to himself making it obvious that he is after service and not publicity.

5-8-73

**Prof. Y. S. R. Chandran, M.A., LLB.**
*Former Principal & Hony. (U. G. C.)*
*Professor of English,*
HINDU COLLEGE, GUNTUR

# అభివందనములు

ఈ నూతన గ్రంథము, 'అతిమానస ఉషోదయము' చదవగా విన్నాను. అంతకు పూర్వమే నాలో ఉన్న ఆధ్యాత్మిక భావములు నూతనముగా ఉద్భవించినట్లయినది.

శ్రీ అరవిందులు శ్రీ తల్లిగారు ఎన్నో గ్రంథములు ఆంగ్ల భాషలో రచించినారు. జీవితమంతా యోగమే అని నిరూపించిరి. అదే పరిశుద్ధమైన వాఙ్మయములో కర్మ వీరతను పురికొల్పుచు చక్కని భాషలో మనకందించిన ఈ రచయిత అభినందనీయుడు.

ఈ గ్రంథము ఆంధ్రమహాజనులకు విలువలేని బహూమతి అని ఘంటాపథముగా చెప్పగలను. దీనిని చదువు వారికి విజ్ఞానప్రాప్తి, పరిపూర్ణ పంసిద్ధి, శ్రీ మాతారవిందుల అనుగ్రహముచే కలుగుగాక ! ప్రతి ఆంధ్రుని చేతియందు సదా నుండదగిన గ్రంథము.

పాంచాళవరపు కామేశ్వరరావు.

2-8-73

శ్రీ అరవిందాశ్రమము



మాహేశ్వరీం, మహాకాళీం
వాణీం, శ్రీం, జ్ఞానదాయినీం
అరవిందాశ్రమసంవాసాం
వందేఽహం త్వాం జగన్మాతః

—శ్రీ అరవింద సొసైటి ,తెనాలి

*Arise, O Souls, arise ! Strength has come, darkness has passed away, the Light is arriving !*

*'Create the divine race'.* (*Rigveda*)

# వి షయ సూ చి క

## SRI AUROBINDO ASHRAM

COPYRIGHT DEPARTMENT

*Dear Sir,*

The Copyright Department of Sri Aurobindo Ashram gives permission to "Sri Aurobindo Society Centre", Tenali (A. P.) to publish the Telugu book "Atimānasa Ushodayamu". We request you to give detailed reference notes of the passages translated.

August 2, 1973

*Yours sincerely,*
**Andre Morisset.**

# శ్రీ మాతారవిందుల సందేశములు

"శ్రీ అరవిందుని సందేశం భవిష్యత్తుపై ప్రసరించుచున్న అజరామర భానుప్రకాశం".

మాతృశ్రీ ఈ వచనము ఇప్పుడు మనము చదువనున్న మహిత సందేశముల స్వభావమును తెలియచేయును. పైగా ఈ సందేశాలు రిక్తవాక్యాలు కావు. మంత్రశక్తి విలసితాలు. వాటిని ఆ దృష్టితో చదివినపుడు మనలో జాగృతిని రేకెత్తించగలవు. శ్రీ అరవిందుని విజ్ఞాన సాగరానికి చక్కని మార్గాలు - మరొక దృక్కోణము నుండి చూచినపుడు మాతారవిందుల మల్లెపందిరిపై విరిసిన సుందర సుమాలుగా గోచరించును.

మాతృశ్రీ పృధివిపై అతిమానసావతరణమును — ఏ భౌతిక విజ్ఞానికి అందని అతిమానసావతరణమును — మున్ముందుగా ఒక సందేశముద్వారానే ప్రపంచానికి ప్రకటించారు. కావున ఈ సందేశములు ఎంత అమూల్యాలో ఊహించుకోగలము.

## మాతృశ్రీ సందేశ కిరణాలు

అహితము, అదివ్యమునగు శక్తులవల్ల ఉపద్రవ పూర్వకమై తర్జన భర్జనలకు గురియైన ప్రపంచము తన ఆధ్యాత్మిక జీవితముకొరకు పోరాడుతోంది.

నీ దివ్య మహిమ భువిపై అభివ్యక్తమయేందుకు ధైర్యసాహసములతో కూడిన యోధవర్యులము కాగోరుతున్న మా ఆకాంక్షను పూరింపుము ప్రభూ !

1941 —మాతృశ్రీ

ప్రతి ప్రతిద్వంద్విపై విజేతవై వెలుగొందు, ఓ ప్రభూ ! నీ మహిమ విస్తరిల్లు గాక !

కష్టములను తట్టుకొని నీ విజయ పరిణామములో పాల్గొనే శక్తి సామర్థ్యములను మా కిత్తువు గాక !

1942 —మాతృశ్రీ

ప్రధానము, నిర్నిబంధమునైన ఎన్నికను (Choice) చేయవలసిన ఘడియ ఆసన్నమైనది.

కపటమును నిరాకరించి, నీ సత్యమునందు వెలువడి తలయెత్తగల బలమును మాకు ప్రసాదించుము. ప్రభూ ! అట్లు పరిశుద్ధులమై, నీవు చేకూర్చుచున్న విజయమునకు యోగ్యుల మగుదుము గాక !

1943 —మాతృశ్రీ

ఈశ్వరా ! ఆయా పూర్వ మౌఢ్యాలలో తాను తిరిగి పడిపోకుండా తనను వారించమని ప్రపంచము నిన్ను దీనముగా యాచించుతోంది.

ఒకపరి గుర్తించిన తప్పులను తిరిగి చేయకుండునట్లు అనుగ్రహించుము, తండ్రీ !

ప్రపంచము తాను ఎలుగెత్తి కీర్తించిన ఉన్నతాదర్శములకు సరియగు, సరళమగు ప్రతిబింబాలుగా తానుచేయు క్రియా కలాపములు ఒప్పారేలాగునకూడ అనుగ్రహించు ప్రభూ !

1944 —మాతృశ్రీ

తమ అంతర్దేశీయ వ్యవహారాలలోకూడ తాము అవశ్యము సత్యము పాటించి తీరవలసిన అగత్యముందని మానవలోకమునకు ఎప్పుడు అవగాహన కలుగుతుందో, అప్పుడే పృథివీ లోకము సుస్థిర, సజీవ శాంతిని అనుభవించగలదు. అనుభవించును.

హే ప్రభో ! ఈ పరిపూర్ణ సత్యనిష్ఠకొరకే మా ఆకాంక్ష.

1945 —మాతృశ్రీ

ప్రభూ ! మేము యోగ్యమని కోరునది నీ శాంతినిగాని, వ్యర్థమగు శాంత్యాభాసమునుగాదు; నీ స్వేచ్ఛనుగాని, స్వేచ్ఛాభాసమును గాదు. ఏలన, తమోమయ, హింసా దౌర్జన్యాలు, అసత్య కాపట్యాలు ఇంకనూ పృథివిని శాసించుతూన్నవి. నీ శాంతి స్వేచ్ఛా సమైక్యాలే ఈ అసురశక్తులపై తమ ఆధిపత్యమును స్థాపించగలవు.

నీ విజయము కొరకు ఎంతో వీరోచితముగా పోరాడి, కష్టములనుభవించిన ధీరవరులు ఈ లోకమున ఆ విజయము సిద్ధింప, దాని విశుద్ధ, సత్ఫలితములను కళ్ళారాగాంచే మహాభాగ్యమును ప్రసాదింపుము !

1946 —మాతృశ్రీ

ప్రతి విషయము క్షీణించి, క్షీణించి మరింత అధోగతికి పోతూ ఉన్నట్లు కన్పించినపుడు— సరిగా అట్టి సమయమునందే— విశ్వాస బలము యొక్క పరమప్రేరణ నాశ్రయించి, భగవదనుగ్రహము మనలను ఎపుడూ భంగపుచ్చదని తెలుసుకుని నిలబడాలి !

1947 —మాతృశ్రీ

ముందుకు, ఎప్పుడునూ ముందుకే !
సొరంగము చివర వెలుగు ఉన్నది,
యుద్ధాంతమున విజయమున్నది.

1948 —మాతృశ్రీ

వ్యాఖ్య:— సొరంగమువలె అంధకారముగా నున్న ఇప్పటి ప్రపంచంలో పోరాడుతూముందుకు సాగినపుడు, సొరంగము యొక్క చివర వెలుగును కాంచినట్లు దివ్యదీప్తిని కాంచగలము.

## అమెరికాఖండమునకు సందేశము

మీరు పాశ్చాత్యులని, ఇతరులు ప్రాచ్యులని భావించడం ఇక విరమించండి. మానవులందరిదీ ఒకే దివ్యమూలము. ఆ మూలము యొక్క ఏకత్వమును అభివ్యక్తము చేయడానికేవారు ఉద్దేశింపబడినారు.

4—8—49 —మాతృశ్రీ

చెప్పకుము, చేయుము.
ప్రకటింపకుము. సాధింపుము.

1950 —మాతృశ్రీ

నా మనస్సు సూటిగా నడిచినపుడు, నే (నితరులకు) మంచిగా కనిపించ నవసరములేదు.

కనుపించడంలో ఏమున్నది ? కావడంలోనే విశేషమున్నది.

29—3—1950 —మాతృశ్రీ

చిత్తశుద్ధి! సదా చిత్తశుద్ధి! అధికాధిక చిత్తశుద్ధి! ఇదే కావలసినది.

తన తలపులయందుగాని, భావముల యందుగాని, సంస్పర్శల యందుగాని, క్రియలయందుగాని తన సత్తయొక్క కేంద్ర సత్యమును తప్ప మరిదేనిని ప్రకటించరాదని ఒకని చిత్తశుద్ధి అతనిని నిర్బంధించును.

4-4-1950 — మాతృశ్రీ

విషాద, నిరాశారూపమైన అసురునే ఈ రాత్రికి (విజయదశమీ రాత్రి) మనము వధించనున్నాము. అలా ఉద్యమించినపుడు, ఈ రుగ్మతను వదిలించుకోవాలని ఎవరు నిజముగా సంకల్పించుకున్నారో, వారు దానిని జయించడానికి అవసరమగు సాయమును స్వీకరింతురు.

20-10-1950 — మాతృశ్రీ

మాటలవైపుకు మొగ్గకుము. క్రియకు కడంగుము.
లక్ష్యమును ప్రకటించు కొనకుము. లక్ష్యమును సాధింపుము.

1950 — మాతృశ్రీ

ప్రభూ! నీదగు పరివర్తన కార్యమును నిర్వహించడానికే మేమీ భూతలముపై నున్నాము. అదే మా ఏకైక అనుష్ఠానముకూడ అగునట్లు అనుగ్రహింపుము; మా క్రియాకలాపమంతయు ఈ ఏకైకగమ్య ప్రాప్తికే తోడ్పడుగాక!

గమనిక : ఇక్కడ సంబోధించినది కూడ శ్రీ అరవిందునే.

1951 — మాతృశ్రీ

(1) ఓ పరమేశ్వరా! మా విశ్వాస బలమును పరీక్షింప దలచు కున్నావు. మా చిత్తశుద్ధిని నీ గీటురాయిమీద ఒరపిడిబెట్టి చూడదలంచు కున్నావు. నీ దయవలన, పూర్వాధికబలముతో, పూర్వాధిక నైర్మల్య ముతో, ఈ అగ్నిపరీక్షనుండి మేము విజయవంతముగా వెలువడుదుము గాక!

(2) తన పూర్ణయోగమనే మహాసాహసయాత్రలో శ్రీ అరవిం దుని అనుసరించదలచినవాడు ఎప్పుడూ యోధుడై ఉండవలసినదే; ఇక భౌతికముగా ఆయన మనలను విడిచి వెళ్ళిన ఇప్పుడో, అతడు వీరుడు కూడానై ఉండాలి.

24-11-1952 — మాతృశ్రీ

ప్రభూ! మాకు (ఈ సాధన సత్యమును) నీవు చెప్పే ఉంచావు: "నిస్పృహ జెందకుము, స్థైర్యము వహింపుము. సమస్తము నష్టపోయి నట్లు కన్పించినపుడే, సమస్తము సమకూరినట్లు తలంపుము!"

1953 —మాతృశ్రీ

(1) నా ప్రభూ! ఈ నూతన సంవత్సరానికి మా కందరకు నీవు అనుగ్రహించి ఇచ్చిన సలహా రత్నమిది:

"దేనిని గురించీ ప్రగల్భములు పలుకవద్దు. నీ చేతలే నీ సత్తను ప్రకటించుగాక!"

నా ప్రభూ! ఈ సంవత్సరానికి అందరికీ ఇదే నీ ఉపదేశము: దేనిని గురించీ, ఎప్పుడూ ఆత్మస్తుతికి పూనుకొనకుము. నీ కృత్యము లనే నీ ప్రశంస చేయనిమ్ము!

(2) మృత్యువునకు నీవు భయపడినపుడు, మృత్యువు నిన్ను ఓడించివేయనే వేసింది.

21-2-1954 —మాతృశ్రీ

ఎట్టి మానవేచ్ఛా కూడ చిట్టచివరకు భగవదిచ్ఛకు పైచేయిగా నుండజాలదు. (అందుచేత) బుద్ధిపూర్వకముగా, నిర్ద్వంద్వముగా మనము భగవత్పక్షము అవలంబింతుమేని, అప్పుడు పర్యవసానమున మనకు విజయము లభించడం తథ్యం.

1955 —మాతృశ్రీ

విజయ మెంత మహత్తరమో, దానిలో ఆడంబరము అంత తక్కువ. నూతన ప్రపంచము యొక్క అభివ్యక్తి చాటింపు ద్వారా ఘోషింపబడదు.

1956 —మాతృశ్రీ

"పృధివిపై అతిమానసాభివ్యక్తి ఇపుడు ఒక వాగ్దానరూపములో మాత్రమే లేదు. అది ఇక్కడ ఇపుడు సజీవసత్యమై, పరమయథార్థమై నెలకొని తనపని ప్రారంభించింది.

ఎంతటి అంధుడైనా, ఎంతటి జడుడైనా, ఎంతటి పరమ విముఖుడైనా దీనిని గుర్తింపక తప్పని దినము వచ్చితీరును."

ఓ ప్రకృతి దేవీ ! ఓ పృధివీమాతా (Material Mother) ! 'నేను మీకు చేయూతనిత్తును' అని ఆశ్వాసమిచ్చిన నీవు మాకిపుడు ఎంత తోడ్పడుతున్నావో ! ఆ తోడ్పాటు వైభవానికి అంతమేలేదు !

1958 —మాతృశ్రీ

గమనిక : ప్రగతిని పట్టి వెనుకకు లాగుతున్న భౌతికతత్వమును మాతృశ్రీ ప్రార్థించగా, ఆ తత్వము దారియిచ్చి తోడ్పడుచున్నది.

[సత్య] జ్ఞానము శ్రేష్ఠము,
[సత్య] జీవనము శ్రేష్ఠతరము,
సత్యమగుట : అదే పరిపూర్ణము.

1960 —మాతృశ్రీ

1. సమ్మోదమయమగు ఈ నూతన ప్రపంచము మన ద్వారము దగ్గర వేచియున్నది; మనము పిలిచినదే తడవుగా దిగివచ్చుటకు ఎదురు చూస్తోంది !

2. ఈ మార్గము ననుసరించడానికి మొక్కవోని సాహసముతో నీవు ముందడుగు వేయాలి ! భయమని చెప్పబడే ఈ నీచ, క్షుద్ర, దుర్బల, వికృత వృత్తికి లోబడి వెనుదిరిగి చూచుకొని విచారించకుము.

అప్రతిహత ధైర్యము, అకలంక చిత్తశుద్ధి, అశేష ఆత్మ నివేదనము ఇవి ఎంత అవసరమంటే, అవి తగిన మాత్రలో నున్నపుడు నీవు లాభనష్టాలు బేరీజు వేసుకుని, బేరసారాలకు దిగవు; ప్రతిఫలము నాశించి దానము చేయ నొల్లవు; రక్షింపబడాలనే ఉద్దేశ్యముతో ఆత్మ సమర్పణ గావించుకోవు; నీ విశ్వాస దార్ఢ్యానికి నిదర్శనముల నపేక్షింపవు. మార్గమున పురోగమించడానికి ఈ దైవసంపత్తి తప్పని సరిగా అవసరము. ఇదే నిన్ను ప్రమాదములనుండి కాపాడగలదు.

29-3-1961 —మాతృశ్రీ

1) మనము సంసిద్ధి కొరకు తహతహలాడుతున్నమాట నిజమే, కాని ఆ సంసిద్ధి మానవ సంసిద్ధికాదు. మానవ సంసిద్ధి అహంకార సంసిద్ధి మాత్రమే. ఇక ఈ అహంకార సంసిద్ధి దైవ సంసిద్ధికి ప్రతిబంధకము :

## ఒక ప్రార్థన

2) అపార కృతజ్ఞతా భావములో, నిర్విరామ పూజావిధానములో నాసత్తా సమస్తమూ నీముందు సాష్టాంగముగా ప్రణమిల్లుతోంది. ఇక ఆపూజావిధానము, భారతదేశము యొక్క సుగంధ ద్రవ్యములతో సిద్ధము చేయబడిన అగరువత్తుల విశుద్ధ ధూపమువలే నా మనో హృదయముల నుండి సదా నీవైపుకే ఉద్గమించుతోంది.

1962 —మాతృశ్రీ

(1) భగవన్మహూర్తము కొరకు సంసిద్ధుల మగుదముగాక :

(2) ఈ ప్రపంచము దయనీయమగు దౌర్భాగ్యాలతో నిండి జాలి గొల్పుతోంది. కాని, మలిన వ్యవహారము విడనాడ జాలనంతటి క్షుద్ర, దుర్బలాత్ములే అందరిలోనూ మిక్కిలి జాలిపడదగినవారు.

18–9–1963 —మాతృశ్రీ

నీవు సిద్ధముగా నున్నావా ?

1964 —మాతృశ్రీ

(1) సత్యాగమమునకు స్వాగతనమస్కారము !

(2) సత్యప్రయోజనములకొరకు, సత్యవిజయముకొరకు భారత దేశము ఇపుడు పోరాడుతోంది. తిరిగి భారత పాకిస్తానులు ఏకమయేవరకు అలాపోరాడ వలసిందే. ఏలనంటే, ఆ ఏకతయే వాటి మూలసత్తలోని ముఖ్యసత్యము.

16–9–1965 —మాతృశ్రీ

సత్యమును సేవింతుము గాక !

(శ్రీఅరవింద అంతర్జాతీయ కేంద్రమునకు చెందిన ప్రగతిసదనము (Home of Progress) నకు మాతృశ్రీ సందేశము).

1966 మాతృశ్రీ

మానవుని యందలి ఆకాంక్ష బీజము ఆధ్యాత్మికతా జలముతో పోషింపబడితే, మానవుడు పెరిగి పెరిగి భగవద్భావములో పర్యవసించును.

24–4–1966 —మాతృశ్రీ

ఓ మానవులూ ! దేశవాసులూ ! ఖండవాసులూ ! మీకేది కావాలి? —సత్యమా, లేక సర్వనాశనమా ? ఏదో ఒకటి ఎన్నుకొని తీరాలి ! (అట్టి సమయ మిది).

1967 —మాతృశ్రీ

ప రి శీ ల న :—

ఇలా మాతృశ్రీ సందేశములు ఒకచోచేర్చి పరిశీలించడం మనకు ఎంతో ఎక్కువ అర్థమును స్ఫురింపచేస్తుంది. 62–67 సందేశములలోని క్రమమును గ్రహింతుము గాక ! 65–లో సంఘటించే భగవన్మా

హూర్తమును గురించి 63 లోనే హెచ్చరించారు. ఆ మహాతల్లి హెచ్చరించిన విధముగానే 65 లో సత్యావతరణము సంభవించింది. అప్పుడు దానికి స్వాగతము పలికారు. దివ్యశక్తుల అవతరణ విషయంలో భవిష్యద్వాణి శ్రీమాత ప్రత్యేకత అనుకుంటాను.

సిద్ధముగా నుండుమని హెచ్చరించి, మరొకసారి 1964 లో సిద్ధముగా నున్నావా ?—అని జ్ఞాపకము చేసిన పిమ్మట కూడ మానవులు ఆ ముహూర్తమునకు ఆయత్తము కాకపోవడమునే 67 సందేశము భయంకరంగా స్పష్టపరుస్తోంది !

1950, 51, 54—సందేశాలు క్రియకు ఎలా ప్రాధాన్య మిస్తున్నాయో పరికించండి. 56 లోని సందేశము కూడ దీనికి సంబంధించిన మౌనప్రక్రియనే వక్కాణిస్తోంది.

53 : అహం పోయినపుడు అంతా పోయినట్లు భయం కలుగుతుంది. కాని అహం పోయినపుడే మనకు అంతా లభిస్తుంది.

59 : అవచేతనము కంటే కూడ క్రిందనున్న నిశ్చేతనము (Inconscience) లో కూడ చైతన్య శక్తులు నిండి ఘూర్ణిల్లుతున్నాయి. ఆ నిశ్చేతనా కారాగారంలో నిశ్చేతనము యొక్క కఠినాతికఠినమగు ఆవరణమును ఛేదించితే అందులో దాగిఉన్న శక్తిచైతన్యాలు వెలువడి వెల్లువలై ప్రవహిస్తాయి. ఆ ఆవరణ ఛేదనమే శ్రీమాత గావించారు.

55 : మనము మరేమీ చేయలేకపోతే, కనీసము భగవత్పక్షమును ఎందుకు చేరకూడదు. అదే ఆ మహాతల్లి కోరేది. భగవంతుడు మనకు జయము సాధించిపెడతాడు అపుడు.

ప్రపంచమొక మహా పరివర్తనానికి సిద్ధపడుతోంది. నీ సహాయ మందిస్తావా ?

1-1-1970 —మాతృశ్రీ

వ్యాఖ్య :- భగవదిచ్ఛ చేత ఒక మహాపరివర్తనము సన్నిహితమై ఉంది. అజ్ఞానులమైన మనకీ రహస్యం తెలియదు. అమ్మ అనురాగముతో అందులో పాల్గొని జీవితాశయమగు ఆత్మ స్వారాజ్యమును సాధించుకొమ్మని మనలను ఆహ్వానిస్తున్నది.

సత్యమును సాధించడం మిగుల కష్టతరము, ఆయాన బహుళము. నిజమగు యోధుడే ఈ విజయమును సాధించగలడు. అట్టి యోధుడు శత్రువులకు గానీ, మరణానికిగానీ – దేనికీ భయపడడు. ఏలనంటే ప్రతి వ్యక్తి సహకరించినా, విరోధించినా; శరీరమున్నా, ఊడినా సమరము కొనసాగుతూనే ఉండి, పరమ విజయమునందు పర్యవసించడం తథ్యం.

21–2–1970 —మాతృశ్రీ

వ్యాఖ్య :- స్వారాజ్యము కావాలనే సహజాకాంక్ష బలపడినకొలదీ మనము ప్రాణాలకు తెగించి అయినా పోరాడుతాము. ధ్యేయము స్వారాజ్యము కావాలి, మరణము పట్ల నిర్భయము కావాలి. ఇవి రెండూ నిజమగు యోధ లక్షణాలు. ఇవి నిజానికి ఆత్మ లక్షణాలు. కావున ఆత్మస్ఫూర్తిగల యోధుడే నిజమగు యోధుడు. ఆత్మ సాక్షాత్కారం లేకపోయినా, కనీసం ఆత్మ స్ఫూర్తిగలవానికే మరణమంటే భయముండదు. అనిత్యముపై నిత్యమునకు విజయము తథ్యమనే దృఢ విశ్వాసము కూడ అతనికే ఉంటుంది. ఆత్మ మెలుకువ కలిగిన పిమ్మటే, మానవుడు నిర్భయమును ప్రసాదించమని భగవంతుని ప్రార్థిస్తాడు. ఆత్మ స్పర్శ లేనివానికి సత్యజయమునందు అన్నీ ఒడుదొడుకులే. కావుననే సత్యజయము మిక్కిలి కష్టమంటున్నారు అమ్మ.

## సత్యరాజ్యము

సత్యము ప్రపంచమును పాలించే శుభముహూర్తము అరు దెంచుతోంది.

దాని ఆగమనమును త్వరపరిచే కృషికి నీవు పూనుకుంటావా ?

రాయగడ కేంద్రము వారికి —మాతృశ్రీ

భగవత్సంపర్కముచేత లభించిన స్వేచ్ఛయే నిజమైన స్వేచ్ఛ. ఇక అహంను పూర్తిగా అదుపులో పెట్టుకొన్నప్పుడే భగవంతునితో సమైక్యము మనకు సాధ్యపడుతుంది.

(అందుకొరకు) అంతరమున నివసించుతూ బాహ్య పరిస్థితులకు చలింపకుము.

మనము ఎలా వుండాలని భగవంతుడు కోరుతున్నాడో, అలా ఉంటూ తత్స్వరూపముగా రూపొందటమే మన జీవితానికి అతి ముఖ్య తాత్పర్యము కావాలి.

26-7-1971 —మాతృశ్రీ

శ్రీ అరవిందచేతనకు ఉన్మీలితుడవై, అది నీ జీవిత పరివర్తనము సాధించటానికి అవకాశమిమ్ము.

26-9-1971 —మాతృశ్రీ

శ్రీ అరవిందుడు సదా ఇచట సన్నిహితుడయ్యే ఉన్నాడు.

విశుద్ధ చిత్తుడవు విశ్వాసపూర్ణుడవు కమ్ము. ఇదియే ప్రథమ నిబంధన.

29-9-1971 —మాతృశ్రీ

ఒకే ఒకటి ముఖ్యము, అది భగవదుపలబ్ధి. అది ఏదైనాకానివ్వండి భగవదుపలబ్ధికి తోడ్పడినపుడే, అది వ్యక్తికిగానీ, విశ్వానికిగానీ ఉపకరించినదని చెప్పనగును.

—మాతృశ్రీ

## మాతృశ్రీ అంతరంగిక సందేశము
## 10—4—72

అనేక శతాబ్దములనుండి మానవాళి ఇప్పటి ఈ సమయముకొరకు ఎదురుచూస్తూ వచ్చింది. కాని ఇది కష్టసమయము. (అయితేనేమి?) విశ్రాంతి భోగముల నిమిత్తమే మనము భువిపై నున్నామని నేనెప్పుడు చెప్పడంలేదు. ఈ సమయము అందుకొరకు కానేకాదు. మనమిక్కడున్నామంటే....అది నూతన సృష్టికి మార్గము వేయడానికే.

శరీర మిపుడు సంకట స్థితిలోఉంది. అందుచేత కార్యనిరతను కాలేక పోతున్నాను. అది విచారకరము! అయితే దానికి కారణము నా వార్ధక్యము కాదు. నేను ముదుసలిని కాదు, కానేకాదు. మీలోపెక్కు మందికంటె నేను మిక్కిలి చిన్నదాననే. నేను ప్రస్తుతము నిష్క్రియనుగా ఉన్నానంటే, దానికి కారణం—పరివర్తన సన్నాహానికే శరీర మిపుడు అంకితమైఉంది. అయినప్పటికీ మనమిక్కడ కృషిచేయడానికే ఉన్నామనే చేతన స్పష్టముగానే ఉంది.

....విశ్రాంతి భోగముల మాట తరువాత, ప్రస్తుతానికి ఇక్కడ చేయవలసిన పని చేద్దాము! అందుచేత మీకీ విషయము తెలియజేయడానికి

పిలిచాను; మీరు చేయగలిగినపనిని చేపట్టండి, చేయగలిగినంత చేయండి.నా సహాయము మీతోనే ఉంటుంది; హృదయ పూర్వకమగు కృషి ఎట్టిదైనా, దానికి గరిష్ఠ ప్రమాణములో సహాయము అందుతుంది. దీనిని నేను వక్కాణించి చెప్పుతున్నాను.

ఇది వీరులమై విజృంభించవలసిన క్షణము. ఇది సామ్యార్థనా ములోని వీరత్వము కాదు, భగవంతునితో సంపూర్ణసమైక్యానికి కావలసిన సాహస మిది. త్రికరణశుద్ధిగా అట్టి వీరకృత్యానికి దీక్షవహించిన వారందరికి సదా భగవత్సహాయము వెన్నంటే ఉంటుంది. దాని స్వభా వమే అది.

ఈ అపూర్వ క్షణమున మీరిక్కడ, అనగా పృథివిపై ఎందు కున్నారు ? మీరీక్షణమును కావాలని ఎన్నుకున్నారు : ఆ విషయము మీరు మర్చిపోయారు. కాని అది నాకు తెలుసు. అవును, మీ కోరిక ననుసరించే మీరిక్కడున్నారు. మంచిది, ఇప్పుడిక అగ్రశ్రేణిలో నిలిచి పరిశ్రమకు పూనుకోవడం అవసరము, కృషిచేయడం అవసరము, క్షుద్రత లన్నింటిని జయించవ మవసరము,పరిమితులన్నిటిని పారద్రోలడ మవసరము. అన్నింటిని మించి — "నీ కాలము చెల్లిపోయింది! " అని అహంకారానికి నిర్దాక్షిణ్యముగా చెప్పండి. అహం రహితమైన క్రొత్త జాతిని మనము కోరుతున్నాము. అవును, అదే మనము కోరేది- అహంస్థానములో దివ్యచేతనను, ఈ దివ్యచేతన మానవజాతి ఆత్మావికా సము సాధించడానికి, అతిమానవుని ప్రసవించడానికి అవకాశమిచ్చి దోహదము చేస్తుంది.

విధివివశనై నేనిక్కడున్నానని మీరనుకుంటే, అది పొరపాటే అవుతుంది. నేను విధివివశను కాను. పరివర్తన నిమిత్తముగావించే

ప్రప్రథమ ప్రయత్నాలకు నాశరీర మంకితమై ఉన్నది గావుననే, నేనిక్కడున్నాను. శ్రీ అరవిందుడు నన్నలా చేయమన్నారు. అవును, అలాగే చేస్తున్నాను.

అలా కోరను .... .... నా కొరకు దానిని మరొకరుచేసిపెట్టాలని నేను కోరను. కారణం, అది మిక్కిలి ప్రియమైన విషయమేమీకాదు. అయినప్పటికి దానిని నేను ఇచ్చా పూర్వకముగానే నిర్వహించు తున్నాను. అది ఫలించినపుడు, ప్రతి ఒకరు దానినుంచి లాభము పొందగలుగు తారనే నేను నిర్వహించుతున్నాను. నేను అపేక్షించేది ఒక్కటే : అహంకారానికి చెవి ఒగ్గకు. అంతమాత్రమే.

ఏదైనా చెప్పగోరుతున్నారా ?

మీ హృదయాంతరాళములో శుద్ధమగు 'అవును' ఉదయించిఉంటే, దానితోనే మీరు నన్ను పూర్తిగా సంతృప్తి పరుస్తారు. నాకు మాటలు అవసరములేదు. మీ హృదయాల యొక్క విశుద్ధ సహయోగమే నాకు కావాలి : ఇదే చివరిమాట.

వివరణ : 7—వ పరిచ్ఛేదములో అది మిక్కిలి ప్రియమైన విషయముకాదు అంటే ?

శ్రీ అరవిందుడు దిలీప్ కుమార్ రాయ్‌తో ఇలా ఉద్ఘాటించి చెప్పారు.

"ఈ అతి మానస పరివర్తనము నేను సాధించవలసి కార్యము. ఎవరైనా దీనిలో తలదూర్చితే అది వారికి ప్రాణసంకటమే సుమా!"

ఈ హెచ్చరికను ఇంత తీవ్రముగా చేయక 'అదేమీ ప్రియమైన విషయము కాదు' అని అమ్మ మృదువుగా తెలిపారు.

అది శ్రీ అరవిందుని కార్యము కాబట్టే, మాతృశ్రీ 6-వ పరిచ్ఛేదములో "శ్రీ అరవిందుడు నన్నలా చేయమన్నారు. అవును అలాగే చేస్తున్నాను" అని చెప్పడం జరిగింది.

పరమ చేతనగాక మరొక చేతనలేదు.
పరమ సంకల్పముగాక మరొక సంకల్పములేదు;
పరమ జీవనముగాక మరొక జీవనములేదు.
పరమ వ్యక్తిత్వముగాక మరొక వ్యక్తిత్వములేదు.
అది ఏకమూ, అనేకమూనైన వ్యక్తిత్వము.

21-2-1968 —మాతృశ్రీ

ఈ సందేశము కార్డుమీద ఉన్నది. ఆకార్డుమీదే రెండవ వైపున ఏదోనిగూఢతను తెలుపుతూ, మురిపము గొలుపు అమ్మ చిత్రమున్నది. ఇది అమ్మ 90వ జన్మదిన సందేశము.

ఈ సందేశము సక్రియ సాక్షాత్కారానికి పరాకాష్ఠ. ఆత్మ ఏకమని గాంచడం నిష్క్రియసాక్షాత్కారానికి పరాకాష్ఠకాగా, దాని నాధారము చేసుకుని, ఆత్మయందేగాక, ప్రకృతి యందుకూడ పరమేశ్వరునితో తాదాత్మ్యమం చెందడమును పైసందేశము చెప్పును. కచ్చితముగా చెప్పాలంటే, దీనిని తాదాత్మ్యమనిగాక, సాధర్మ్యమనాలి. ఇక్కడ ఆత్మముక్తము గావడమేగాక, ప్రకృతికూడ ముక్తమై పరాప్రకృతి

యగును. అహంనశించి, ఉన్నవి భగవచ్చేతనాదులు మాత్రమేనని గోచరించును. అపుడు వ్యవహారము కూడ భగవంతునిదే, అదే భాగవత జీవితము లేక దివ్య జీవితము.

"నిత్యత్వ పథములో మరొక ముందడుగు"

15-8-72 — మ్యాతశ్రీ

పరిశీలన : ఇది ఫోల్డరులో శ్రీ అరవిందుని ఛాయాచిత్రానికి ఎదురుగా అమర్చిన చిన్ని సందేశము, చిన్నదియగు పెద్దసందేశము; ఫొటోకు ఎదురుగా ఉన్నదే—దాని ఆంతర్యమేమిటి? ఈ ముందడగు శ్రీ అరవిందుడేనని. శ్రీ అరవిందుని రూపములో ప్రపంచము వేసిన ముందడుగు. శ్రీ అరవిందుడు అతి మనస్సు (ఋతచేతన) యొక్క అపూర్వావతారము. ఆయనతో, ఆయనగా అతి మనస్సు భువిపై అవతరించింది. మున్నులేని దివ్యచేతన ఇక్కడ దిగి పనిచేస్తోంది. మును పటి కంటె ప్రపంచము ముందుకు వెళ్ళింది. అదే ముందడుగు.

ఇంతకు మించిన విశాలార్థము :

సందేశములో 'శ్రీ అరవిందుడు ముందడుగు' అనే అర్థము మాత్రమే ఉన్నదిగాని, ఆ ముందడుగు అతి మనస్సు మాత్రమే అనిలేదు. అంటే, ఎప్పటికప్పుడు పరిణామక్రమము శ్రీ అరవిందుని రూపములో ముందడగు వేస్తోంది. తరుణము వచ్చినపుడు శ్రీ అరవిందుడు వస్తు

న్నారు. పరిణామము ఒకడుగు ముందుకు వెళ్ళుతోంది. ఉదాహర ణకు ద్రవ్యము (Matter) నుండి ప్రాణము, ప్రాణము నుండి మనస్సు కూడ ఆయన అవతరించడంచేతనే సంభవించాయి అనుకోవాలి. శ్రీమాత చెప్పను కూడు చెప్పిఉంచారు : "పృథివీ చరిత్ర పురిటి నాటినుంచి ఈ రూపముతోనో, అరూపముతోనో; ఈపేరుతోనో ఆపేరుతోనోమహత్తర మగు పృథివీ పరివర్తనముల నన్నింటిని శ్రీ అరవిందుడు అధిష్ఠించి నడు పుచునే వచ్చుచున్నారు." దీనిని బట్టి ఆయన ముందుకూడ నడుప బోతున్నారు.అందుచేత అతి మనస్సు తర్వాత వచ్చే ముందడగులు కూడ ఆయనేనని అమ్మ సందేశములోని అంతరార్థము. పూర్ణార్థము.

శ్రీ అరవిందుని సందేశము భవిష్యత్తుపై ప్రసరించుచున్న అజ రామర భానుప్రకాశము.

15-8-72 — మాత్రశ్రీ

ఇది కార్డుమీద ముద్రించబడి మనకు అందిన సందేశము-రెండవ వైపున ఫ్రెంచి అనువాదముతోపాటు. ఇది మనకు చక్కగా అవగాహన గావడానికి అమ్మ ఉద్ఘాటించిన ఈ క్రింది వాక్యము అనుసంధేయము : "శ్రీ అరవిందుడు చరిత్ర తరువుపై పుష్పించిన చరమ కుసుమమని కొందరు చరిత్రకారులందురు. అది సత్యదూరము. కారణము అతడు గతముయొక్క పర్యవసానము కాదు. గతము నుంచి ఆయన పుట్టలేదు. ఆయన వర్తమానమునకు చెందిన మహోన్నతుడని మరికొందరందురు. అదికూడ అజ్ఞానముచేతనే. వారి నిజతత్త్వమును పరికింప, వారు భవి ష్యత్తునకు చెందినవారు. వారికీ, గతవర్తమానములలోని వారికీ పోలికయే లేదు." (సరిగా ఈ మాటలను గాదుగాని, ఈ అర్థమును చెప్పారు తల్లిగారు). శ్రీ అరవిందుడు కూడ స్వీయకృతియగు సావిత్రిని

గురించి, "ఇది భవిష్య ద్విషయకము. అందుచేత గతాను గతికులకు ఇది అందదు, ఇప్పటి వారికి కూడ ఇది మసకమసకగా ఉంటుంది" అని వాఖ్యానించారు.

పైగా ఎవరి సందేశము భగవదిచ్ఛతో శ్రుతికలిసి ఉంటుందో, అది భవిష్యత్తునకు కూడ అనువర్తించుతుంది. దాని ప్రభావము భావిపై కూడ ప్రసరించుతుంది. సత్యము సత్యమునకు విరుద్ధము కాదుగావున, ఆ సత్యము భవిష్యత్సత్యముతో కూడ చేయికలిపి పనిచేస్తుంది.

"ఈ శతజయంతి సందర్భాన శ్రీ అరవిందునికి మన మర్పించగల ఉత్తమ శ్రద్ధాంజలి ఏది ? పురోగతి కొరకు పరితపించుతూ, దివ్య ప్రభావానికి మన సమస్త సత్తను ఉన్ముఖము గావించాలి ? అదే మన శ్రేష్ఠ శ్రద్ధాంజలి. ఏలన, ఆ ప్రభావమును అందించు దూతయే శ్రీ అరవిందుడు".

—మాతృశ్రీ

## అమ్మ పిలుపు

మానవుడు భగవంతుని యొక్క యథార్థ సేవకుడుగా ఉండగలడని మనము ప్రపంచమునకు చూపగోరుతున్నాము.

సంపూర్ణ చిత్తశుద్ధితో ఎవరీ విషయమున సహకరింప గోరుతున్నారో చూడాలి !

25–12–1972 —మాతృశ్రీ

వ్యాఖ్య : 'మనము చూపగోరుచున్నాము'—అని అమ్మ అన్నారు. ఈ ఆశయము 'మనకు' ప్రత్యేకమా ? అవును. ఎందుచేత ? ఈ సృష్టి అర్థరహితముకాదు. తన స్వభావానికి విపరీతముగా, విరుద్ధముగా కన్పించే ఇహలోక పరిస్థితులలో భగవంతుడు తన సచ్చిదానంద స్వభావమును వ్యక్తము జేయదలంచుకున్నాడు. ఇది శ్రీ అరవింద దర్శనములోని ప్రథమ ప్రధానాంశము. ఈ ఆశయము ఇతర దర్శనాలకు లేదు. ఇక, ఎలా వ్యక్తిము జేయదలంచుకున్నాడు ? మానవుని ఉపకరణము చేసి పోవడంద్వారా మానవుడు ఉపకరణము లేక సేవకుడు ఎలాకాగండు? భగవచ్ఛక్తికి ఉన్మీలనముద్వారా, అంటే, భగవంతునిశక్తి అవతరించి పనిచేయడానికి ద్వారము తెరవడంద్వారా. ఇదిగో ! ఈ అవతరణ శ్రీ అరవిందయోగములోని ప్రత్యేక ప్రధానాంశము. ఈ రెండు అపూర్వ అంశాలద్వారా భగవంతునికి సేవకులుగా ఉండడం 'మనకు' విశిష్టము, మనకు ప్రత్యేకము.

'సేవకుడు కావడం' అనకుండా 'సేవకుడుగా ఉండడం' అనడంలో విశేషం ? సేవకుడుకావడం తాత్కాలికముగా మోక్షముకొరకు. అదికాదు మనము చేయవలసినది. సేవకుడుగా ఉండిపోవడమే. అందుకే భగవంతుడు మనలను సృజించాడు. నిజానికి 'యథార్థ సేవకుడు' మోక్షానికి మించిన ఆనందము ననుభవిస్తాడు. ఎలా ? అతడు నిష్క్రియ ముక్తుడు మాత్రమేగాక కర్మ ముక్తుడుకూడాను.

''ఎవరు సహకరింపగోరుతున్నారో ! '' ఇది అమ్మ తన బిడ్డలకు చేసిన సవాలు. మనతల్లి అన్నముపెట్టి ఎవరుముందు తింటారో ! అని ఎలా పందెముపెడుతుందో అలాగే మనకు ఆనందభోజనము పెట్టదలంచి, మాతృశ్రీ ఇలాంటి సవాలు చేస్తున్నారు.

ఆత్మ యందు తానుపొందే వికాసమే వ్యక్తి ఇతరులకివ్వగలిగిన ఉత్తమ సాహాయ్యము. ఏలన, అపుడు చుట్టునూ ఉన్న ఇతరులకు సాయపడేవస్తు విశేషమేదో తననుంచి సహజముగా బైటికి ప్రసరిస్తుంది.

—మాతృశ్రీ

## విశ్వచేతన-భగవచ్ఛేతన

సమస్త ప్రపంచము ఒకేసారి నీ ఎరుకలో నిలిచినపుడు, (అపుడే) నీకు భగవంతుని ఎరుక ప్రాప్తించును.

1-1-1973 — మాతృశ్రీ

వ్యాఖ్య :- ఒకొకప్పుడు వ్యక్తిచేతన నుండి సరాసరి అతీత చేతనకు దూసుకుపోవడం కద్దు. మనశ్చేతననుండి పరమార్థము పొందడానికి ప్రయత్నించినపుడు ఇట్టిదే జరుగును. కాని అక్కడి అతీత పరమార్థము సాధారణముగా నిష్క్రియమై ఉంటుంది. (అది) కావున అతీతము కావచ్చును గాని. భగవంతుడు కాదు. (పూర్ణ పురుషుడగు భగవంతుడు నిష్క్రియ సక్రియాలు రెండింటికి సమైక్య స్థానము. ప్రపంచ చేతనలో ప్రవేశించి, మన వైయక్తిక సత్త ప్రపంచ సమ్మిత మైనపుడు, అతీతమును పొందడం సులభమేగాక, ఆ అతీతము పాక్షికము గాక పూర్ణ పరదైవతగును.

పై సందేశములో ఒక హెచ్చరిక కూడ ధ్వనించుతోంది. పెక్కుమంది సాధువులు ఏదో తాము ఊహించుకున్న దానిని అతీతమనుకుంటున్నారు. వారికిది సవాలు. ప్రపంచ చేతన నీకు ప్రాప్తించిందా? కాకపోతే,

నీ ఊహ ఊహామాత్రమే! ఏలనంటే, కొంతవరకైనా విస్తృతి నందక పోతే, మనశ్చేతన పరచేతనను భరించలేదు. (పరచేతనలో లయము జెందడం వేరే విషయము).

పైగా, ఆశ్రమ వాసులు దివ్యకార్యానికి ఉపకరణము కాదలంచు కున్నారుగదా! అయినపుడు చేతనా విస్తృతి ఆవశ్యకము. ఏలనంటే–

"సహకారము లేనపుడు సముచిత ప్రేరణ కూడ కార్యకారి కాజాలదు. పైనుంచి వచ్చే దివ్యక్రియ విస్తృత పరిధిలో వ్యవహరిస్తుంది. అది అన్ని కర్మ విభాగాలను ఆలింగనము చేసుకునే సమస్వరమగు (Harmonious) క్రియాసమస్తము.అందుచేత కర్మరంగములోఅడ్డుగోడలు కట్టి, కర్మను విభజించి విచ్ఛిన్నము చేస్తే, అట్టి కర్మ ఎప్పుడునూ ఆధ్యాత్మిక సంకల్పానికి అనుగుణముగా నుండదు.

"కావున దీనిని గుర్తుంచుకొనుము: సహకారము లేనపుడు సముచిత క్రియ లేదు."

ఇది ఆశ్రమ కర్మకు సంబంధించి అమ్మ 1–12–1967న చెప్పిన మాట. చేతన విస్తరించితేనేగాని, సహకారము సంభవించదు. సహకారము లేనపుడు అవిభాజ్యమగు దివ్యక్రియకు ఉపకరణము కాజాలము.

1973 డైరీలో జనవరి 18వ తేదీన ఉన్న శ్రీ అరవిందుని అనుభవ వాక్యము.

"విశ్వ చేతనలో ప్రవేశించి, సమస్త విశ్వసత్తతో మనము ఏకము కాగలిగినట్లే ప్రపంచమును అతిశయించిన చేతనలో ప్రవేశించి

సమస్త విశ్వసత్తకు అతీతులము కాగలము''. ఈ మహనీయ వాక్యమును అమ్మ 1973 నకు ఇచ్చిన పై సందేశముతో జతపరచి చూచుకోవాలి।

మాతృశ్రీ ఏది చెప్పినా అనుభవముతోనే చెప్తుతారు. ఇక చూడండి: వారు ఏమి చేస్తున్నా సమస్త ప్రపంచము యొక్క ఎరుక వారికి అదేసమయములో ఉంటుంది అన్నమాట। అంటే మనలను ప్రతి క్షణము గమనిస్తూనే ఉన్నారన్నమాట।

అట్టి దివ్యమాతకు వినమ్ర ప్రణామాలు.

— : —

# విద్యార్థులకు హితవచనాలు

మాతృశ్రీ బాలబాలికలకు ఇచ్చిన ప్రాముఖ్యం ఆశ్రమంలో మరెవ్వరికి ఇవ్వరు. వారు ఇంకను మలచదగిన స్థితిలోనుండుటే దీనికి కారణం. ఆశ్రమంలోనే "పరిసరము, ప్రభావము, ఆదర్శము, ఇట్టివి మీకు ఇతరత్రాలభించవు. వీటి సహాయమున అతిమానసచేతనను జాగృత మొనరించుకొనుడు" అని అమ్మవారికి ఉద్బోధించుతున్నారు. ఆ ఉద్బోధనలలో కొన్ని మచ్చుతునకలు.

## స్వ ధ ర్మ ము

ఇతరులు ఏమి చేస్తున్నారో పట్టించుకుని బాధపడకు. ఈ మాటను ఎన్నిసార్లు చెప్పినా మళ్లీ చెప్పవలసే ఉంటుంది. వంకపెట్టకు, విమర్శించకు, పోల్చిచూడకు. ఒక ప్రత్యేక ప్రయోజనార్థము నీకీ జన్మ ప్రదత్తమయ్యింది. నీ శరీరమును వీలైనంత పరిపూర్ణమగు ఉపకరణము గావించడం, అది భగవంతుని ఎరుకను వీలైనంత ఎక్కువగా కలిగి వికసించడం—ఇదే ప్రయోజనము. పరమాత్మ నీ నుండి దేని నపేక్షించు తున్నాడో, మనః ప్రాణశరీరములందు దానికి ఉపయుక్తమగు తత్వము లేక పదార్థము ఒకపరిమితిలో నీకు ఇవ్వబడినది. అలాగే నీజీవిత పరిస్థితులు అన్నీ ఆ భగవదుద్దేశానికి అనురూపముగానే చేయబడినాయి. అందుచేత ''నాజీవితము భయంకరము!'' అని వాపోకు. ఏలన ప్రతివాడు

తన సమగ్రవికాసానికి అనుగుణమైన జీవితమునే పొంది ఉన్నాడు. ఆ సమగ్రవికాసానికి తోడ్పడే అనుభవాలే అతనికి కలుగుతున్నాయి. చివరకు అతనికి దాపురించే కడగండ్లు కూడ అతని సమగ్రసిద్ధికి అనుగుణమైనవే !

"............ నేనిలా ఉన్నానుగదా! మరొక విధముగా ఎలా ఉండగలను!" అని నీరసపడకు. ఏలనగా, అది నీ నిజరూపముకాదు. నీవు అలా ఎందుకున్నావంటే, సరిగా తద్విపరీతముగా రూపొందడానికే. నీకడగండ్లన్నీ ఎందుకు ప్రాప్తించాయి? అవి ఆవరించి మరుగుపరచిన సత్యములోనికి వాటిని ఎలా రూపాంతరము చెందించాలో నీవు నేర్చుకు నేందుకే !

—మాతృశ్రీ.

వ్యాఖ్య: మన జీవితము యొక్క ప్రత్యేకత. ఆజీవితములోని అనుభవాలు, ఆ జీవితమును ఆవరించిన పరిస్థితులు. అవికడగండ్లైనా, కఠోర బాధలైనా సరే అన్నీ మన సమగ్రవికాసానికే ! చూడండి దైవ విధానము ఎంత అద్భుతమో! అందులో ఏవస్తువూ వ్యత్యస్తము గాలేదు. ప్రతిదీ ఉండవలసినట్లే, ఉండవలసినచోటనే ఉంది ! ఇది జనని సమ్యగ్ దృష్టికి స్పష్టం కాని మనము మన జీవితమును, కష్టాలను నిందించుకుంటూ నీరు కారిపోతాము !

రెండవ విషయం : అసలు కడగండ్లు నిజముకావు. అయితే ఎందుకు కన్పించి, బాధించుతున్నాయి ? బాధించకపోతే, వాటిని ఛేదించి లోనున్న సత్యమును కనుగొనటానికి ప్రయత్నించుము. ఉదాహరణకు, అనారోగ్యము సత్యము కాదు. దాని వెనుక ఉన్న ఆరోగ్యమే సత్యము. అనారోగ్యము ఆగంతుకము అనారోగ్యము అంకుశముకాగా,

తీవ్రప్రయత్నముగావించి, లోనికిదిగి గంభీరతరమైన ఆరోగ్యశక్తులను కనుగొంటాము.

మరణముకూడ అనారోగ్యము యొక్క పర్యసానము మాత్రమే గాక, దానియొక్క మహోగ్రరూపముకూడ—ఒక విధముగా చూచి నపుడు. ఈ మరణ రోగమును రూపుమాపడానికే, మానవుడు అనాదిగా అమరమగు ఆత్మాన్వేషణము గావించుతున్నాడు. ఇట్టి అన్వేషణ ఫలితముగా శరీరమునుకూడ అమరము చేయవచ్చును—ఇది శ్రీఅరవిందుని అపూర్వదర్శనము.

## అపూర్వావకాశము

భువిపై తాను జీవించియున్నంతకాలము. శ్రీఅరవిందుడు తన సమస్త సమయమును ఒకే లక్ష్యము కొరకు ధారపోశాడు: తాను అతిమానసమని పిలిచిన చేతనను తనలో ప్రతిష్ఠించడానికి, తనను ఆశ్రయించిన వారికి తత్సాక్షాత్కార సాధనలో సాయపడడానికి ఆమహామహుడు ఆహుతి అయినాడు.

మీరు పిన్నవయస్సులోనే ఆశ్రమానికి వచ్చారు. అది మీకు లభించిన మహత్తరమగు విశేషాధికారము. ఇంకా నమ్య(plastic) స్థితిలోనే ఉన్నారు గాన, నూతనాదర్శపు మూసలో రూపొందే సత్తమీలోగలదు. అలా మీరు నూతన జాతికి ప్రతినిధులు కాగలరు. ఇక్కడ ఆశ్రమములో మీకు అత్యంతానుకూలమగు పరిస్థితులు గలవు; పరిసరము, ప్రభావము, బోధన, ఆదర్శము–ఇట్టివి మీకు ఇతరత్ర లభించవు. వీటి సహాయమున

అతిమానసచేతనను జాగృత మొనరించుకొని, తద్ధర్మము ననుసరించి అభివృద్ధి నందగలరు.

ఇక, ఇప్పుడు అంతా మీ సంకల్పబలము మీదను, చిత్తశుద్ధి మీదను ఆధారపడి ఉండును. సామాన్య మానవ జాతిలో ఒకరుగా ఉండడానికి మీరు ఇచ్ఛించకపోతే, వికాసము జెందిన జంతువులుగా మాత్రమే మీరు కొనసాగదలంచకపోతే, శ్రీఅరవిందుని అతిమానసాదర్శమును సాధించి, నూతన జాతిలో దీపింప దలంచితే, భువిపై ఒక వినూతన సమున్నత జీవితమును గడుపగోరితే, మీ ధ్యేయమును సాధించడానికి కావలసిన సహాయమంతా మీ కిక్కడ అందును. ఆశ్రమవాసము యొక్క పూర్ణప్రయోజనమును పొంది, చివరకు ప్రపంచానికి సజీవ నిదర్శనములుగా వెలుగొందగలరు.

—మాతృశ్రీ

వ్యాఖ్య: పరిసరము = ఆధ్యాత్మిక పరిసరము, లౌకిక పరిసరముకాదు. ఆశ్రమములో అదృశ్యమగు ఆధ్యాత్మిక భావాలు నిండి ఉంటాయి,—ప్రభావము = సాధకులపైన సరాసరి జనని ప్రభావము—బోధన = విద్యాలయములోను, అన్యత్రకూడ శ్రీఅరవిందుని అపూర్వ తత్వబోధన—ఆదర్శము = అద్దము, ఆ బోధనను స్వీయజీవితములో, అద్దములోవలే, అభివ్యక్తము చేసే విశిష్ట వ్యక్తులు. ఇంతేకాదు, జాగృతికి, వికాసానికి కావలసిన సామగ్రి అంతా ఈ ఆశ్రమములో ఉంది ; —అని శ్రీజనని అసందిగ్ధముగా వక్కాణించారు. కాని మనలో ఎంతమంది ఈ అవకాశమును అనుకొన్నంతగా వినియోగించుకుంటున్నారు ?

పై సందేశములో వయస్సు ప్రస్తావన వచ్చింది కదా ? దానిని గురించి ఈ క్రింది సూక్తిని వినండి, కాదు సూక్తులను పరిశీలించండి :

సుఖమయము, ఫలప్రదము అయిన జీవితమునకు ముఖ్యమైనవి ఏవి యన—చిత్తశుద్ధి, వినమ్రత, పట్టుదల మరియు ప్రగతి కొరకు తీరని తృష్ణ. అన్నింటిపైన ప్రగతికి అవధులు లేని అవకాశ మున్నదని మనకు నమ్మకము కలగాలి ! ప్రగతే యౌవనము. నూరోపడిలో కూడ యువకుడై ఉండగలడు.

14–1–72 —మాతృశ్రీ

ప్రవర్ధమానమైన పరిపూర్ణతా దిశగా పురోగమించే కళా కౌశలమును శరీరము అలవరచుకొన్నప్పుడు, మరణవిధిని జయించే మార్గములో మానవుడు బహుదూరము పురోగమించిన వాడగును.

16–1–72 —మాతృశ్రీ

చేతనాభివృద్ధియే జీవిత ప్రధాన గమ్యమని తలంచినపుడు, అనేక కష్టములకు పరిష్కారము లభించును.

వార్ధక్యమును నివారించడానికి ఉత్తమమార్గము పురోగతిని జీవిత గమ్యము గావించుకోవడమే.

18–1–72 —మాతృశ్రీ.

## సంతోష రహస్యము

స్వీకరించడంలో ఉన్న సంతోషంకంటె ఇవ్వడంలో ఉన్న సంతోషం ఎంతోఎక్కువ :— ఇదే సాధకుడు యోగమార్గములో నేర్చు

కునే ప్రథమ పాఠము. పిమ్మట క్రమముగా ఆత్మ విస్మరణము (అహంభావమును విస్మరించడం) అవ్యయ శాంతికి నిధానమని అతడు గ్రహించగలడు. తర్వాత ఈ ఆత్మవిస్మరణమునందే అతడు పరమాత్మనుకనుగొని, పరమాత్మయే సదాప్రవర్ధమానమగు ఆనందానుభూతికి మూలమని కనుగొనును.

"మానవులీ రహస్యము నెరిగి, దానిపట్ల వారికి నమ్మకము కుదురుకుంటే, ప్రతివాడు యోగము సాధింపగోరును" అని ఒకనాడు శ్రీ అరవిందుడు నాతో అన్నారు.

9-2-72 —మాతృశ్రీ.

—›: O :‹—

# ప్రత్యేక వ్యక్తులకు

ప్రత్యేక వ్యక్తుల సమస్యలను అవలీలగా, అనన్య సాధారణంగా అమ్మ పరిష్కరించిన అద్భుత సందర్భా లెన్నో ఉన్నాయి. ఉదాహరణకు — గుణానంద సోదరుడు ఆశ్రమం విడిచి, ఎక్కడికో వెళ్ళి తపస్సు చేసుకోవాలనుకున్నాడు. అప్పుడు అమ్మ ఆయనకు 'నేను ఇక్కడనే ఉన్నాను' అనే సారగర్భితమైన సందేశ మిచ్చారు. అప్పుడు ఆయన చింతలు తొలగిపోయి ప్రగతిని సాధించుకొన్నారు. ఇత్యాది వ్యక్తిగత సందేశాలు ఈ ప్రకరణంలో మనకు పొడగట్ట గలవు.

## అమ్మ ఒక బిడ్డకు చెప్పిన ప్రార్థన

"నేను నీవాడను. నా అభిలాష–నిన్ను తెలిసికోవాలని. తెలిసి కొన్నపుడు నేను చేసేదంతా నీవునాకు నిర్దేశించినదే కాగలదు."

—మాతృశ్రీ

వ్యాఖ్య : ఇది చిన్న బిడ్డకు చెప్పిన చక్కని ప్రార్థన. చిన్న బిడ్డకు తల్లి పట్ల 'నేను నీవాడను'–అను స్ఫూర్తి ఎక్కువ సహజముగా ఉంటుంది. అంటే, మన ప్రార్థన మనకు సహజసిద్ధమైన దానితో ప్రారంభించి, దానిపెంపుకొరకు ప్రవర్తించాలి. మనకు అమ్మను గురించి ఎంతవిన్నా, ఇంకా వినాలని అని

పించుతుంది. ఈ అభిలాషనే ప్రార్థనయొక్క మధ్యభాగము వ్యక్తము జేస్తున్నది. ఎందుకు నిన్ను తెలుసుకోవాలి ? ఏలనంటే, నిన్ను తెలుసుకున్నపుడే, నీ యిచ్ఛ మాకు తెలుస్తుంది. నీయిచ్ఛను ఎరిగినపుడే దైవకార్యము నిజముగా ఆచరించి, దివ్య జీవనానికి సోపానాలు వేసుకోగలుగు తాము.

అయితే నీ యిచ్ఛను, నిన్ను ఎలా తెలుసుకోవాలి ? 1. అంత శ్చేతనలోని అనుభవము ద్వారా, మనసు నీరవముగా, నిర్మలముగా వికసించి, తెరచుకున్నప్పుడు అనుభవము అంకురింప నారంభించుతుంది. 2. అమ్మ స్వయముగా చెప్పిన మాటలద్వారా, వెల్లడించిన తన అనుభవాలద్వారా.

## జతీంద్రనాథుని నిష్క్రమణము

జతీంద్రనాథుని ప్రస్థానము ఇక్కడి వారందరికి ఒక బాధాకరమైన ప్రభూత నష్టము.

ఆయన ఆత్మనివేదనలో పరిపూర్ణుడు,చిత్తశుద్ధితో పనిచేయువాడు, ఆధార పడదగిన వ్యక్తి. ఇదే అసాధారణ గుణవిశేషము.

ఆయన సౌరతేజములో ప్రవేశించి, అక్కడ సచేతన విశ్రాంతి గైకొనుచున్నాడు. అట్టి విశ్రాంతికి ఆయనకు నిజముగా అధికారము కలదు.

ఆయన అన్ని విధాల క్షేమముగా ఉన్నాడు, మీరు నిశ్చింతగా నుండుడు. అతడే కార్యభారము వహించెనో, ఆ కార్యము కొనసాగగల విధానమును ఇపుడు మనము చూచుకొన వలసి ఉన్నది. ఈ విషయమున మీరేదేని యోగ్యసమాచారము నివ్వగలిగినచో, అది తప్పక మనకు దారి చూపును.

5-7-1965 — మాతృశ్రీ

వ్యాఖ్య :- యతీంద్రనాధుని విశిష్ట లక్షణం : ఒక పని ఆయనకు అప్ప గించితే, ఆయన దానిని హృదయపూర్వకంగా నిర్వహించ గలడని, దానిని గురించి ఇక చింత అవసరము లేదని నమ్మి నిదురపోవచ్చు. అలాంటి వారే అమ్మ కార్యానికి కావాలి. అందుచేతనే ఆయన మరణం తీరని నష్టము కలిగించినదని అమ్మ చింతించారు. ఆ నష్టం మిక్కిలి బాధాకరము కూడ. కారణం, ఆయన ఆత్మనివేదనము పరిపూర్ణమైనది. ఆయన పరిపూర్ణముగా తల్లికి, తల్లి కార్యానికి తనను తాను సమర్పించుకున్నాడు.

ఆత్మనివేదనము అంతరాత్మకు సంబంధించిన విషయము. ఇక కర్మ యందలి చిత్తశుద్ధి హృదయానికి సంబంధించిన వృత్తి. అంటే ఆత్మయందు నివేదనము, ప్రకృతి యందు విశుద్ధి ఆయనయందు గలవు. అందుచేతనే ఆత్మనివేదనమును, చిత్తశుద్ధిని విడిగా పేర్కొన్నది అమ్మ.

ఒక విభాగమునకు ఆధ్వర్యము వహించి నడిపించగల సామర్థ్యము ఆయనలో ఉన్నది. అందుచేతనే ఆయన ప్రస్థానము అంతటి నష్టముగా భావించబడింది. అయితే ఆత్మనివేదనము, ప్రకృతి విశుద్ధిగల వారికి

అమ్మ శక్తిని స్వీకరించగలగడం ద్వారా త్వరగా సామర్థ్యము కూడ పెంపొందుతుంది.

గీతలోనూ, ఉపనిషత్తులలోనూ యోగులై మరణించిన వారికి, 1 శుక్ల మార్గము, 2 కృష్ణమార్గము చెప్పబడినాయి. శుక్ల మార్గము ప్రశస్తము; అది పునరావృత్తిరహితము. శుక్ల మార్గములోని మజిలీలు : 1 అగ్ని, 2 జ్యోతి, 3 దినము, 4 శుక్ల పక్షము, 5 ఉత్తరాయణము మున్నగునవి. ఉపనిషత్తులలో సూర్యుడు కూడ ఒక మజిలీ అని తెలియజేయబడినది. ఈయీ స్థానాల్లో కొంత కొంతకాలముండి చివరకు పరబ్రహ్మతో ఐక్యము జెందుదురని చెప్పబడింది. వారు భూమికి తిరిగిరారు.

యతీంద్రనాథుడు సౌరతేజములో ప్రవేశించి విశ్రాంతి గొంటున్నాడు అని అమ్మ చెప్పారు; సౌరతేజమంటే సూర్యసంబంధమైన లోక మనుకోవచ్చునేమో? కాని 'విశ్రాంతి' అనేపదము అమ్మ ఉపయోగించింది గాన, విశ్రాంతి తర్వాత తిరిగి రాగలడనే భావము అందులో ద్యోతక మవుతోంది. కనుక శుక్ల మార్గములోని సూర్యుడు వేరు, అమ్మచెప్పిన సౌరతేజము వేరు అనికూడ అనిపించుతోంది. శ్రీమాతారవిందుల ననుసరించి, సామాన్యముగా జీవాత్మ లందరు ప్రాణమయ మనోమయ లోకాలలో కొంత కొంత తడవుండి, ఆ రెండుదేహాలను ఆయా లోకాలలో విడిచిన పిమ్మట, అంతరాత్మ లోకానికి వెళ్ళి, అక్కడ విశ్రాంతి గొని తిరిగి జన్మించుతారు.

కావున యతీంద్రనాథుని సౌరతేజము ఈ ప్రస్థానము చరమ భాగములో ఒక విశిష్టదశ అయినా కావాలి, లేదా అదే అంతరాత్మలోక మయినా కావాలి.

ఇక 'సచేతన విశ్రాంతి' అన్నారు, అమ్మ. మనము నిత్యమూ నిద్రలో విశ్రాంతి తీసుకొంటూనే ఉన్నాము. గాఢనిద్రలో మనకు ఎరుకలేదు. అందుచేత అది సచేతన విశ్రాంతి గాదు. కాని అమ్మకో? అమ్మకు ఆదశలోకూడ ఎరుకఉంటుంది. అదిగో, అట్టిసచేతన విశ్రాంతినే ఆ యతీంద్రనాథుడు ఇపుడు గైకొనుచున్నాడు! అది విశిష్టయోగులకే సాధ్యము. ఇలా 'యతీంద్ర నాథుడు' అనే నామధేయము కూడ, ఆయనపట్ల సార్థకమయింది!

ఒకమాట: ఆయన జీవించి ఉన్నసమయములో, ఆయనలో పెద్దయోగి లక్షణములు కన్పించకపోవచ్చు. కేవలము అమ్మ అనుగ్రహముచేత అట్టిది ప్రాప్తించి ఉంటుంది. మనము సర్వాత్మను ఆ అమ్మకు అర్పించుకుని కర్మచేస్తే, మనయోగక్షేమాల సంగతి ఆమెయే చూచుకుంటుంది. ఇది గీతా ప్రతిజ్ఞకూడ (9 వ అధ్యాయం). గీతలోని 'యోగక్షేమాలు' లోని యోగానికి ఈ యోగపరమైన అర్థమునుకూడ చెప్పుకొనవచ్చు.

## బాపనమ్మ కిచ్చిన సందేశము

దానికింకా సమయము రాలేదు.

ఆశీస్సులు.

5-12-65 —మాతృశ్రీ.

వ్యాఖ్య: మనము సామాన్యముగా 'కాలము' కర్మ కలిసిరావాలి, అని అంటాముగాదూ! అంటే కర్మ వెంటనే ఫలితము నివ్వదు, దానికి తగిన కాలము రావాలి.

'యోగ సమన్వయము' అను ఉద్గ్రంథ ప్రారంభములో శ్రీ అరవిందుడు 'నాలుగు సాధనములు' (Four Aids) అను శీర్షికక్రింద వాటిని ఇలాపేర్కొన్నారు : 1 శాస్త్రము, 2 ఉత్సాహము, 3గురువు, 4 కాలము. మొదటి మూడు ముమ్మరముగా ఉన్నప్పటికి, నాల్గవది యగు కాలముకూడ అనుకూలించాలి. అపుడే మనకు లక్ష్యప్రాప్తి— అని తెలిపారు.

మనము చేయవలసిన కార్యముండి, దానిని తప్పించుకొందామని జన్మ రాహిత్యమునకు సాధనచేస్తే, కాలము దాని కనుమతించదు. జన్మ రాహిత్యానికైనా ఒక కాలముంది— అని శ్రీ తల్లిగారే ఒకసారి ఉద్ఘాటించారు. ఒకవేళ నిర్విశేష తత్వములో లీనమైనా, మళ్ళీ వెలికివచ్చి ఆకార్యము చేయవలసియే ఉంటుంది !

పై సందేశములో 'ఇంకా సమయంరాలేదు' అన్నారు గాని, అసలు 'నీకిక్కడ తావులేదు' అని చెప్పలేదు. అందుకే ఆశీస్సులు కూడ జోడించారు.

కొన్ని భగవన్ముహూర్తములు (The Hours of God)ఉంటాయి. ఇపుడు అలాంటి ఒక మహత్తర ముహూర్తము కొనసాగుతోంది. దీని కొరకు ఆశ్రమవాసులందరూ ఎన్నో శతాబ్దాలనుంచి ఎదురుచూచారట. అంటే అతిమానస అవతరణము జరగడానికి ఈ కాలము కలిసి రావాలి అన్నమాట.

## నారాయణస్వామి (బేకరి) కిచ్చిన సందేశము.

నిన్నుగురించీ, నీ ఆరోగ్యమును గురించీ చింతన తగ్గించుకో. అప్పుడు నిశ్చయముగా నీవు బలమును పుంజుకుంటావు. ఒకవేళ, నీలో

ఏదో వ్యాధి ఉన్నదని గట్టిగా వేధించుచూ ఉన్న పక్షములో, ఆసుపత్రికి వెళ్ళు. అప్పుడు వైద్యులు దానిని తప్పక గుర్తించగలరు.

—మాతృశ్రీ.

వ్యాఖ్య :— స్వవిషయాలనే ఎక్కువగా తలపోస్తున్నకొలదీ, 'స్వ' ఆవరణ ఏర్పడి, విశ్వశక్తులు మనలోనికి చొరకుండా అడ్డుపెట్టుతుంది. ఇక మనలను గురించి చింతించడం తగ్గించి, విశాల జీవితమును గడపడం నేర్చుకొంటే, విశ్వశక్తులే అనారోగ్య కారణాలను రూపుమాపి, బలాధికములను పెంపొందించుతాయి.

అవచేతనా ప్రభావముచేత అప్పటికీ ఏదైనా వ్యాధి అంకురించితే అంకురించవచ్చు. విశ్వశక్తులకు పూర్తిగా ఉన్మీలితులము కాగలిగితే, ఆ అంకురమును అవే తుదముట్టించుతాయి. పూర్తిగా అలా చేయగలిగినంత నైపుణ్యము మనకు లభించక పూర్వము, వైద్యసహాయము పొందుతూనే, ఆ సమయములో కూడ వ్యాధిని గురించి వీలైనంత తక్కువ చింతించాలి. వ్యాధిని మరచి పోయేందుకే తేలికరకం పుస్తకాలవీ చదువుతారు రోగులు.

ఈ సూత్రము ఆరోగ్యానికి మాత్రమే వర్తించదు, ఆధ్యాత్మిక పథములో పయనిస్తున్నపుడు, మన సమస్త జీవితానికి గూడ అనువర్తించుతుంది. అందుచేతనే — నీ యోగక్షేమాలు నేను చూస్తాను. వాటిని గురించి నీవు పట్టించుకోవలసిన పనిలేదు — అని అర్జునునికి శ్రీకృష్ణుని ఉపదేశము.

"రాష్ట్రాల కర్మాగారము శ్రీ తల్లి గారి అభిమాన విశేషానికి పాత్రమైన విభాగమైనందుకు, ఆ విభాగములో విద్యాధికులు, అయినా సాధనా పరులు అయిన వారు ఉండి, వారితో మీరు కలసి పనిచేస్తున్నందుకు అభినందనలు". 6-11-1972

## నీ ఎదుటనే

నే నిక్కడే ఉన్నాను : పనిచేయుము, తినుము, ఉల్లాసముగా నుండుము.

1966 గుణానంద సోదరునకు —మాతృశ్రీ

పరిశీలన :- ఇక్కడ ఒక మహత్తర విషయము మనకు వ్యక్తమౌతోంది. మహాత్ములు తమ మహత్త్వమును గురించి సహజముగా చెప్పుకోరు. చెప్పుకోవలసిన అవసరం వారికి ఉండదు. అహంభావము మాత్రమే అలా చెప్పుకుంటుంది. అల్పమగు అహం వారి మహత్తులో కరగిపోయిందిగాన, గొప్ప చెప్పు కోవాలనే ప్రేరణ వారిలో ఉండదు. కాని భక్తుల హితము కొరకు అపుడపుడు మహాత్ముల నోటినుండి కూడ వారి మహత్తుకు సంబంధించి మాటలు వెలువడడం కద్దు. అలాంటిదే ఇక్కడ జరిగింది.

గుణానందుడు భగవంతుని చూడాలనే తపస్సు ప్రారంభించాడు. అపివిని అమ్మ- నేనిక్కడే ఉన్నాను - అని ఉద్ఘాటించారు. దీని భావ మేమిటి? నీవు చూడదలంచిన భగవంతుడనగు నేను ఇక్కడే ఉన్నాను;

చిన్న మెలికి ద్వారానే కావచ్చు, అమ్మ ఈ రహస్యమును తమ సందేశము ద్వారా ఆవిష్కరించారు.

రాకెట్టులో ఎగిరిపోయి చంద్రునిపై పాదము పెట్టడం మహాద్భుతము. బాహ్య ప్రపంచానికి, అనంత చంద్ర శకలాలను తన గర్భములో దాల్చిన దేవి ఎంత అద్భుతము. ఆ దేవిని మనముందే గాంచడం మరెంత అద్భుతము! ఆ దేవితోపాటు పుట్టడం ఎంత అదృష్టం. కాదు ఎంత అనుగ్రహం !

ఇలాంటి చంద్రులెందరో అమ్మలో ఉన్నారని మనకేమి తెలుసు? "ఓ చంద్రశేఖర్! ఇలాంటి చంద్రులెందరిని, ఇలాంటి సముద్రాలెన్నింటిని నాలోనే చూస్తున్నానో, నీకేమి తెలుసు!" అని వేలూరి చంద్రశేఖరం గారితో శ్రీ అరవిందులన్నారు ఒకానొక సందర్భములో. శ్రీమాతారవిందులు అనన్యులు గనుక, శ్రీ మాత చేతనలో శ్రీ మాత విశ్వచేతనలో-కూడ అనంత సంఖ్యాకమగు చంద్రసూర్య గోళాలున్నాయి.

అట్టి అమ్మను చూచామునరే, అమ్మ అట్టిదనికూడ విశ్వసించుతున్నాము, కించిదనుభవపూర్వకముగా. కాని ఈ అనుభవమును పెంపొందించుకొంటూ, అమ్మ విశ్వచేతనను ఎలాగాంచాలి ?

"పనిచేయుము" – పనిద్వారా నాతో సంబంధము నేర్పరచుకొనుము. శక్తి రూపమగు అమ్మతో క్రియద్వారానే సంబంధము కల్పించుకోవడం సులభము. "నాపని చేయుము. అపుడు నేను నాశక్తిని సరాసరిగా కూడ నీకు ఇస్తాను. అపుడు సంబంధము మరింత సులభము." అనికూడ అమ్మ చెప్పిన దానిలోని అంతరార్థముగా మనము స్వీకరించాలి. పని యందలి ఏకాగ్రతనే తపస్సుగా భావించుకో –'అనేదికూడ సందేశ

ములో ఇమిడి ఉంది: ఏలన తపస్సునకు బదులుగా పనిచేయమంటున్నారుగాన.

"తినుము"—పనిచేయడానికి తినాలి, పైగా యోగానికి యుక్తాహార విహారమే తోడ్పడును గాని, అనశనం (ఉపవాసము) గాదు. అంతేగాక, పూర్ణయోగములో శరీర వికాసము కూడ భాగమే గాన, శరీర ధర్మమగు ఆహారమును పాక్షిక యోగానికి బలిపెట్టరాదు. ఇక 'తినుము' లోని మూడవ అర్థము: నాతో సంపర్కము గలిగి పనిచేయుటలోని ఆనందమును తినుము, భుజింపుము. నాల్గవ అర్థము : అన్నములోనున్న రుచిని మాత్రమే గాక, అన్నములోని 'రసమును' భుజింపుము. ఈ రస వివేచన శ్రీ అరవిందుడే చేశారు ఒకసారి. రసము బ్రహ్మానందము, అన్ని పదార్థాలలోను సమముగా ఉంటుంది. కాగా, రుచి ప్రతి కూరలో వేరువేరుగా ఉంటుంది. ఈ సత్యమును సూచన ప్రాయముగా గ్రహించి, సత్యమని తెలుసుకోవడం మనకు కూడ అసాధ్యము కాదు.

"ఉల్లాసముగా నుండుము"—నీవు కోరిన భగవంతుడు ఇక్కడే ఉన్నాడు, దిగులెందుకు? ఆ భగవంతుడు నిన్ను నడుపుతున్నాడు, దిగులెందుకు? కర్మద్వారా ఆ భగవంతునితో నీకు సంపర్కము కలిగించుచున్నాడు, దిగులెందుకు? దిగులు భూమిని దాటిపోవడమే గాదు, ఉల్లాస భూమికలో అడుగిడుము. కాదు ఉల్లాసము నీలో విజృంభించడానికి దారి ఇమ్ము: ఉల్లాసముగా నుండుము—అని అమ్మ తెలుపుతున్నారు, నలుపు దిగులును తెలుపు వెలుగును చేస్తున్నారు.

"ఉల్లాసమునకు దారి ఇమ్ము"—అని పైన చెప్పుకున్నామే :— అంటే? ఇప్పటి ఆగష్టు 72 బుల్లెటిన్‌లోని అమ్మ ఈ వాక్యమును చూడండి :

"భగవంతుడే సమస్తము చేయుచున్నాడనే అనుభవము నీకుంటే అప్పుడు చలించని విశ్వాసముతో నీ విటులు చెప్పుదువు, (అవచేతన చేయు ఆసురిక ప్రేరణల నుద్దేశించి)—'నీ వాదనలకు విలువేలేదు. భగవంతునితో సచేతనముగా సంపర్కము కలిగియుండుటలోని హర్షము, నిర్భరహర్షము. సమస్తమును అతిశయించును—సృష్టిని అతిశయించును. జీవనమును అతిశయించును, సౌఖ్యమును అతిశయించును, విజయమును అతిశయించును —అది ఇది అననేల : సర్వమును అతిశయించును !'

కర్మ ద్వారా కలిగిన సంపర్కములో నీవు సహజముగా ఉల్లసింతువు. అందుచేత 'ఉల్లాసముగా నుండుము' అని అమ్మ చెప్పారు. పైగా దిగులు మూసిన ద్వారమైతే, అమ్మ శక్తికి సంతోషము తెరచిన ద్వారము !

## పవిత్రగారి పర్యవసానము

ఆనాటి రాత్రి నాకు కలిగిన అనుభవము మిక్కిలి ఆసక్తికరము. దానితో పోల్చదగిన దేదీ నా జీవితములో ఘటించలేదు. ఆ గతించిన దినానికి క్రిందటి రాత్రి 8 గంటలకు ఈ సంఘటన జరిగింది.

అతడు ఉపసంహరించుకుంటూ ఉన్నట్లు—ఒక అసాధారణ రీతిలో ఉపసంహరించుకుంటూ ఉన్నట్లు – నాకు తట్టింది. అతడు వెలికివచ్చి, కూడుకుని, తనకు తాను నాలోనికి గుమ్మరించుకుంటున్నాడు. ఏకాగ్రము గావించబడిన పరిపూర్ణ సంకల్ప బలముతో ఆయన ఎరుకతోనే కావాలని వెలికి వస్తున్నాడు. అతడట్లు గంటలకొలదీ నిబ్బరముగా, నిర్విరామ

ముగా తన ప్రయత్నమును కొనసాగించాడు. ఆ ప్రయత్నము సమాప్త మైనపుడు, గడియారము చూద్దునుగదా, తెల్లవారుజామున 2 గంట లయింది.

ఆ యోగ విధానము నందు క్షణ మాత్రము కూడ శిథిలతగాని, అంతరాయముగాని, విరామముగాని కన్పించలేదు. అది పొడవునా ఒకే సుస్థిర, సంతత ప్రవాహము; దానికి తెంపులేదు, దాని బలములో తగ్గుదల లేదు. అది ఒక అక్షీణ, సాంద్ర ధారా విశేషము. కావుననే ఆయన పూర్తిగా వాలోనికి సంక్రమించేవరకు ఆ ప్రక్రియ ప్రవర్తించింది. ఆ సమయములో శరీరము లోని తనసత్తను చివరి బిందువు వరకు పంపు చేస్తూ, ఖాళీచేస్తున్నట్లు కన్పించింది. అందుచేతనే అది అద్భుతమని చెప్పుతున్నాను - అట్టి అనుభూతి నాకు మున్నెన్నడూ కలుగలేదు : శరీరములో ఇక ఏమీ మిగలనెల్లే-అనేటంత వరకూ ఆ ప్రవాహ మాగలేదు. ఆ స్థితి వచ్చేంతవరకు శరీరమును అలాగే ఉండనిచ్చాను. అయితే డాక్టర్లు అంతకుముందే, ఎంతోముందే శరీరము మరణించినదని ప్రకటించారు.

అతడు జీవించి ఉన్నప్పటి తన స్థితినిబట్టి చూస్తే, అతడు అలా చేయగలడని నేనెన్నడూ అనుకోలేదు, చేయలేడు కూడ. తన ఏ పూర్వ జీవితములోని సామర్థ్యమో పనిచేసి, దానిని సాధించి ఉండాలి. ఎంతో మంది ఆ పరిణామమును సాధించలేరు; యోగులలో సర్వశ్రేష్ఠుడు కూడ దానియందు కృతార్థుడు కావడం కష్టమే.

ఇప్పుడు అతడు ఇక్కడ (నాలో) లోపల ఉన్నాడు; మిక్కిలి మెలకువతో మీరందరూ ఇక్కడ గావించే కార్యకలాపమును తిలకించు

తున్నాడు, వినోదముగా. నాలో నిశ్శేషముగా కలిసి నివసించుతున్నాడే గాని, లయించి తన వ్యక్తిత్వమును కోల్పోలేదు. అది భద్రముగానే ఉన్నది. 'అమృత' విషయము వేరు. ఆయన మీలో ఒకడై, మీమధ్య, నా వెలుపల చరించుచున్నాడు. అయితే, విశ్రాంతిని, ప్రశాంతిని కోరి నపుడు అపుడపుడు అతడు సహజముగానే ఇక్కడ (నాలోనికి) వచ్చి బసచేస్తున్నాడు. అదివేరు. పవిత్ర సాధించిన కఠినమగు మహా కార్యము మరువరాని కథావిశేషము.

25–5–69 — మాతృశ్రీ

— :X: —

# సాధనా కిరణములు

'సావిత్రి'ని శ్రద్ధాభక్తులతో అధ్యయనం చేసినవాడు వేరే గురువును వెదుక్కోవలసిన అవసరం లేదు. అది అట్టి అనన్య మహిమోపేతం. దానినుంచి మార్గము తెలియటమే గాక శక్తిస్పందన లుకూడ చదువరులకు లభించగలవు. ఇలాంటి మహిమయే సాధన విషయమున యీ అధ్యాయంలోని సాధనా సందేశములలో మనం పొందగలం. మన సాధనలోని చిక్కులను ఏవిధంగా విడదీస్తాయో మనం గుర్తించగలం, అంతేగాదు సాధకుల చిక్కులను విడదీస్తూ నూతన ప్రకాశం వారికి కల్గించుతూ శ్రీఅరవిందుడు మంత్రశక్తిని ఇమిడ్చి వ్రాసిన అసంఖ్యాకమగు లేఖలను చదివేందుకు ఈ సందేశములు మనల ప్రేరేపించ గలవు కూడా.

## 1 వృథా పోదు

ఏ ప్రయత్నముకూడ వృథాపోదు. మనము గుర్తించ లేనప్పటికి దానికి సర్వదా ఫలితము ఉండితీరును.

7–12–69

—మాతృశ్రీ

అర్థవివరణము:– మనము దైవము వైపుకు ఒకడుగు ముందుకు వేస్తే దైవము మనవైపుకు పదడుగులు వేస్తాడు. కాని వెంటనే అది తెలియక పోవచ్చును.

## 2 శుద్ధి సాధన

ప్రశ్న:– స్వయం శుద్ధిని ఎలా సాధించు కోవాలి?

సమాధానము:– కొన్నివస్తువులు మనలో సమతా రాహిత్యమును కలిగించును. వాటిని మనము ఆమోదింపము. కాని వాటిని త్రోసిపుచ్చడానికి బదులు, మనలో ఒక భాగముగా భావించి, వాటిని నివేదించాలి. అయితే ఆపని వాటి కిష్టముండదు. కాని వాటిని ఒప్పించే మార్గమున్నది. వాటి అనంగీకార భావమును ఎంత తగ్గించగలమో, వాటి ప్రతిరోధము అంత తగ్గును. ఇక అనంగీకార భావమును సమ్యగ్ జ్ఞాన చేతన చేత తొలగించుకొనవచ్చును.... ఈ ప్రక్రియ చాల సులభతరము. క్రిందికిలాగు ప్రవృత్తుల నన్నిటిని మానవుడు ఈ ఊర్ధ్వతర సమ్యక్చేతనతో జోడించనగును.

4–1–70 —మాతృశ్రీ

వ్యాఖ్య:– మానసిక చేతనతో అపరవృత్తులను నెట్టివేయాలంటే, వాటితో పెనుగులాడాలి. మానసిక చేతనకు అవి లొంగవు. కనుక, ఊర్ధ్వ విశాల చేతనతో వాటికి సంపర్కము కల్పించితే, దానిలో సహజముగా ఉండే సుఖశాంతులను అవికూడ చవిచూస్తాయిగాన, వాటి అనంగీకారము క్రమముగా తరిగిపోతుంది.

## 3 పరమేశ్వరుని వలన

మానవు లందరు పరమేశ్వరుని స్వేచ్ఛను స్పృశించినపుడే, వారు

అపేక్షించు స్వేచ్ఛ అభివ్యక్తము కాగలదు. ఆ పరమేశ్వరుని ఎరుక లోనికి తెచ్చుకొన్నప్పుడే, మానవులమధ్య సమత ప్రకటమగును. తమను ఆ పరమేశ్వరుని యందుండి సమముగా వెలువడిన అంశములని అతని ఏకతయందు ఏకమై యున్నారని మానవులందరు అనుభవమున గ్రహించి నపుడే, మానవుల మధ్య భ్రాతృత్వము పరిఢవిల్లును.

22-3-70 — మాతృశ్రీ

వ్యాఖ్య:- స్వేచ్ఛ, సమత, భ్రాతృత్వము, ప్రపంచగతిని మార్చివేసిన ఫ్రెంచి విప్లవముయొక్క లక్ష్యత్రయము. అప్పటిలో వాటి వెనుక ఆధ్యాత్మిక చింతనలేదు. కాని అవికూడ పరమేశ్వరుని వలననే, పరమేశ్వరునియందే సిద్ధించవలసి ఉన్నదని అమ్మ ఉద్ఘాటించుచున్నారు.

2వ సందేశానికి దీనికి పోలిక ఉన్నది. అక్కడ విశాలచేతనతో సంపర్కము కార్యకారి. ఇక్కడ పరమేశ్వర చేతనతో.

## 4 అధికారము

భగవంతుని అనుభవము ఉంటేనేతప్ప, ఎవరూ భగవంతుని గురించి భాషించ గూడదు. ముందు భగవంతుని తెలిసికొనుము. అప్పుడే అతనిని గురించి భాషింప నీ కధికారముండును.

14-6-70 — మాతృశ్రీ

వ్యాఖ్య:- "నిన్ను అనుసరించి అమ్మ నడువవలసిన పనిలేదు. ఆమె చేతన పై చేతన.ఆమెనే నీవనుసరించాలి!" అనిశ్రీఅరవిందుడు ఎదురు తిరిగిన శిష్యులను హెచ్చరించడానికి కారణ మిదే.

## 5 విశేషాధికారము

జీవితములో విశేష ప్రతిపత్తి ఎవరిది? పరమేశ్వరుడు తన ప్రేమకు ఎవరిని ఏకైక పాత్రులను గావించుకుంటాడో వారిది; వారికే సత్యప్రేమయొక్క, దివ్యప్రేమయొక్క హర్షానందములు ప్రత్యేకించబడి యుండును.

23_10_70 — మాతృశ్రీ

వ్యాఖ్య:– కోటీశ్వరుని పుత్రునికి అతని సంపత్తియందు ప్రత్యేకాధికారముంటుంది, కాని అతని ధన సంపత్తియందు మాత్రమే. కాని భగవంతునిచే ఎన్నుకొనబడిన వారికి భగవత్సంపత్తియందు అధికారము. ఈ అధికారమే అనుపమాధికారమని అమ్మ అవధరించుతున్నారు.

## 6 కర్మ ఉత్తమము

భగవదర్పితముగా చేసే కర్మ యందే చేతన ఉత్తమ వికాసమునందును, అలసత్వము అకర్మ తమస్సులోనికి పర్యవసించును, ఈతమస్సే చేతన యందలి పతనమూ, పురోగతి ప్రకాశములకు విరుద్ధమూ.

అహమును జయించి, భగవంతునియందే జీవించడం— ఇదే మన ఆదర్శము. ఇదే సత్యచేతన సంపాదించడానికి మిక్కిలి దగ్గరి దారి.

24_4_71 —మాతృశ్రీ

వ్యాఖ్య :– స్వార్థపరమగు కర్మలో అహంఉండి చేతనను మూసివేస్తుంది. భగవత్పరమగు కర్మలో కూడ అహం ఒక దశ వరకు

ఉంటుంది గాని, అది భగవంతునికి (అంతశ్చేతనకు) అడకువగా అవిరుద్ధముగా ఉంటుంది. అందుచేత మూసి వేయదు. పైగా కర్మ తమస్సును హరించుతుందిగాన, చేతనా వికాసము కూడ ప్రాప్తించుతుంది. ఉత్తమం ఎందుచేతనంటే, దీనిలో భక్తి జ్ఞానాలు కలిసి ఉంటాయి.

## 7 నిజమగు ఆకాంక్ష

నిజమగు ఆకాంక్ష మనోవృత్తికాదు, అంతరాత్మవృత్తి. నిజమగు ప్రేమో ? వివిధ చేతనలను స్వయముగా భగవంతునితో ఏకము గావ డానికి అనుమతించే బలమునిచ్చే దివ్యశక్తి అది.

22–5–71 —మాతృశ్రీ

వ్యాఖ్య : అంతరాత్మకు, అది భగవదంశముగాన, భగవంతునియందు దివ్య ప్రేమగలదు. ఆ ప్రేమ భగవంతునివైపులాగే ఒక బలీయమగుశక్తి. ఈ శక్తిని ఆశ్రయించే మనః ప్రాణదేహ చేతనలు పరమాత్మతో ఏకము కాగలవు. కాని ఆశక్తి అను మతించి ఉద్ధరించడానికి కొన్ని షరతులు గలవు. అందు చేతనే 'అనుమతించే' అని సందేశములో ఉన్నది.

## 8 జీవితాశయము

అంతరాత్మ సంపూర్ణను పొందడానికే నీవిక్కడున్నావు. అందుకే జీవించుతున్నావు. పట్టుదలతో ఆకాంక్షించుతూ, మనోమౌనమునకు ప్రయత్నింపుము. ఆకాంక్ష హృదయమునుండి ఉద్గమించాలి.

11–6–71 —మాతృశ్రీ

వ్యాఖ్య :— మనస్సు పనిచేస్తున్నపుడు 'నేను' కూడ మనస్సులోనే ఉంటుంది, అంతరాత్మను స్పృశింపదు. ఒకవేళ అప్పుడుకూడ స్పర్శ ఉన్నా, ఆ పొగల మధ్య అక్కడినుంచి వెలువడే ఆకాంక్ష ఉజ్వలముగా విజృంభించదు. అందుచేత ఒక దశ వరకు మనోమౌనము అవసరము. ఇక మనఃసత్త పూర్తిగా అంతరాత్మకు విధేయమైనపుడు మనోవ్యాపారము అభివ్యంజకము (కనబరచునది) గానే ఉంటుంది. కాని, ఆవరణాత్మకముగా ఉండదు. అపుడు మనసులో కల్లోలముండక క్రమము మాత్రమే ఉంటుంది.

## 9 భవిష్యత్సందేశము

మనకు ప్రాప్తించవలసిన భవిష్యత్ సౌందర్యమును సందేశము ద్వారా అందించేందుకే శ్రీ అరవిందుడు అరుదెంచెను.

ఏ మహావైభవము దెసకు ప్రపంచము పయనించుతున్నదో, అది ఆశా మాత్రమే గాక, తథ్యమని మనకు బోధించేందుకే ఆయన ఆగమనము.

ప్రపంచము దుఃఖమయమగు ఒకానొక దుర్ఘటన కాదు. అది ఒక అద్భుతము. ఆ అద్భుతమునే అది క్రమముగా ప్రకటించుకుంటున్నది.

ప్రపంచానికి భవిష్యత్ సౌందర్యముయొక్క నిశ్చయ భావమవసరము. శ్రీ అరవిందుడు ఆనిశ్చయమునే ప్రసాదించెను.

27-11-71 మాతృశ్రీ

వ్యాఖ్య :– సృష్టికి ఒక అర్థమున్నదని, ఇక్కడ మన మనుగడ వ్యర్థము కాదని, ఆ అర్థము అతిమానస వికాసమని, అది పరిణామ క్రమములో తథ్యమని, తథ్యము మాత్రమే గాక, ఆ శుభ సమయము ఆసన్నమయినదని – ఇట్టి భవిష్యత్తును ఇలా అభివర్ణించిన వ్యక్తి శ్రీఅరవిందుడే. ఆ నిశ్చయమును ఆయన ప్రసాదించబట్టే దాని కొరకు మన మిపుడు సచేతనముగా ఇచ్ఛాపూర్వకముగా ఉద్యమించ గలుగు తున్నాము.

## 10 ఇక్కడెందుకున్నాము ?

ఇతరత్రాకంటె ఇక్కడ గుణవత్తరముగా కృషి గావించి, అతిమానస భవిష్యత్తునకు ఆయత్తమయ్యేందుకే మన మిక్కడున్నాము.

దీని నెప్పుడును విస్మరించగూడదు. మన ఆశయసిద్ధికి అందరి శుభేచ్ఛను ఇప్పట్టున నేను అర్థించుతున్నాను.

వ్యాఖ్య : ఇది ఆశ్రమస్థుల నుద్దేశించి పలికినమాట.

## 11 మౌన విధానము

ప్రశ్న : మనస్సు నెలా నిశ్చలము చేయాలి ?

సమాధానము : మనోవ్యాపారముచేత మనోవ్యాపారమును అరికట్టలేవు నీవు ! ఈ విషయమున, ఊర్ధ్వతర, అంతరతర స్తరముల నుండి మాత్రమే నీవు మౌనమును అందుకోగలవు.

19–12–71

—మాతృశ్రీ.

వ్యాఖ్య : 8_ని చూడనగును. అంతరాత్మ నుండి భగవదాకాంక్ష, ఊర్ధ్వాత్మనుండి శాంతి, మనోమయునికి లభించగలవు.

## 12 తేల్చివేసే ఘడియ

పృథివీ చరిత్రయందు మనమిపుడు ఒక నిర్ణయాత్మకమగు ఘడియ యందున్నాము. ఈ ఘడియ అతి మానవుని ఆగమమునకు సిద్ధపడు తున్నది. కావున ఈ సన్నాహములో పాత జీవితవిధానము తన విలు వను కోల్పోతున్నది.*

అది ఎన్ని నూతన విధులను అపేక్షించినా, ఈ భవిష్యన్మార్గము లోనికే వ్యక్తి తన్ను తాను విసిరివేసికోవాలి ! వెనుక సహనీయమైన నీచత్వములు ఇప్పుడెంతమాత్రము సహనీయము గావు.

ఇపుడు ఆవిర్భవించ వలసి ఉన్న మహాతత్వమును స్వీకరిం చేందుకు వ్యక్తి స్వయం విస్తృతిని సాధించుకోవాలి.

_12_1971

వ్యాఖ్య : ఈ ఘడియ మనకొరకు వేచిఉండదు. అందుచేతనే జాగు చేయక 'తన్నుతాను విసిరివేసుకోవాలి' అని చెప్పుతున్నారు. ఒక పైస దగ్గర, ఒకమాటదగ్గర, ఒకొకప్పుడు వ్యక్తమయ్యే నీచత్వములకు ఇపుడు చోటులేదు. మనము విశాలతను వికసింప జేసికొని మహాతత్వమును స్వీకరింప వలసిన ఘడియ ఇది.

## 13 అంతరాత్మ ప్రభావము

మానవుడు అంతరాత్మ ప్రభావమునకు లోనైనపుడే, భగవంతుడు మానవునిలో వ్యక్తమగును. అలా లోనైన మానవుడు తన అతి మాన వతకు మెట్లు వేసికొనగలడు.

అంతరాత్మ అమరము. దాని ద్వారానే అమరత్వం భువిపై అభి వ్యక్తము కాగలదు.

కావున, అంతరాత్మను కనుగొని, దానితో అనుసంధించుకొని, అహంకార స్థానమును దాని నాక్రమించ నివ్వడమే ఇపుడు చేయవలసిన ముఖ్యకార్యము. అపుడు అహంకారము విధిగా రూపాంతరము చెంద వలసి ఉంటుంది; లేదా రూపుమాసిపోవలసి వుంటుంది.

8-2-72 —మాతృశ్రీ.

వ్యాఖ్య : అమరత్వ కీలకము మనలోనే ఉన్నది. దానిని పనిచేయ నివ్వాలి. అలా చేయనిచ్చినపుడు అంతరాత్మ ఉన్న తాత్మ సాహాయ్యముగొని సమస్త సత్తను అజరామరము చేయగలదు. ఇది శ్రీ అరవిందుని అపూర్వ దర్శనము.

(చూ. 8, 9).

## 14 క్రమ శిక్షణ

మానవుడుగా జీవించడానికి క్రమశిక్షణ ఆవశ్యకము. అది లేనపుడు మానవుడు మహిషమే అవుతాడు. ఉన్నత సత్యజీవితము

నాకాంక్షించి పరివర్తన కవసరమగు క్రమశిక్షణ నామోదించినపుడే, మానవుడు మనిషి కానారంభించును. అంతఃప్రకృతిని, దాని కామనలను శాసించడముతో వ్యక్తి తన క్రమశిక్షణ ప్రయత్నమును ప్రారంభించాలి.

9-3-72 —మాతృశ్రీ.

వ్యాఖ్య : క్రమశిక్షణ బయటనుంచి విధించేది కారాదు. అది పరివర్తన ధర్మము సూచించేదై ఉండాలి. ఈ ధర్మము మనఃశాంతిని, విముక్తిని, ఆకాంక్షను,ఉన్మీలనమును, సమర్పణను సూచించుతుంది. ఇక్కడ అనుశాసనము అంటే అంతఃప్రకృతియొక్క అనుశాసనమనే ముఖ్యార్థము.

## 15 అతి మానస ప్రభావము.

అతిమానసము అవతరించి నపుడు ప్రపంచములో ఎట్టి మార్పు గలుగునో చవిచూపించడానికే ఇలా జరుగుతోంది. నిజముగా తటస్థముగా ఉన్న విషయాలు ఏదో ఒక పక్షమును అవలంబిస్తున్నాయి. ఒకచిన్న తప్పు పరిణామములో అతివిషమము అవుతోంది; ఇంచుక చిత్తశుద్ధి, ఇంచుక యథార్థాకాంక్ష తమ ఫలితాలలో అద్భుతావహములవుతున్నాయి. ఇట్టి విలువలు మానవులలో తీక్ష్ణములై కూర్చున్నాయి. భౌతిక దృష్టితో చూచినా, మిక్కిలి చిన్నదోషము—చాల చాలా చిన్నది కూడ—విపరీత పర్యవసానము కల్గించుతున్నది. ఇక ఆకాంక్షలో అణుమాత్రం చిత్తశుద్ధి ఉన్నా, దాని ఫలితాలు ఆశ్చర్యకరము లౌతున్నాయి. విలువలు తీక్ష్ణమై, స్పష్టములవుతున్నాయి.

6-5-72 —మాతృశ్రీ.

వ్యాఖ్య :— 12, 13లో చెప్పిన అపూర్వమగు ఘడియ ఎలా ఉంటుందో ఇక్కడ మనకు అంచనా ఏర్పడుతోంది. ఇలాంటి ఘడియ కొరకే మనలో ఎంతోమంది శతాబ్దాలుగా ఎదురుచూచి ఉంటారు. అలాఅని అమ్మ ఒకసారి చెప్పారుకూడ. అయి నపుడు ఆలాభమును పొందడానికి మనము ఎంత సర్వాత్మనా కృషిచేయాలో ఊహించుకోగలము !

## 16 అనన్యాశ్రయము

భౌతిక చేతన తాను మున్ముందు తెలిసికొనవలసిన ముఖ్య విషయము; మన కవసరమైన సాయము పొందడానికి కేవలము భగవం తునే ఆశ్రయించడంలేదు మనము. ఇదే మనము జీవితములో ఎదుర్కొనే కష్టము లన్నింటికి కారణము.

వ్యాఖ్య : కేవలాశ్రయమును క్రమముగా అభ్యసించాలి.

## 17 స్థిర సంకల్పము

తన ప్రకృతిలో లేని దానిని ప్రాప్తించేందుకు, ఇంకను తెలియని దానిని తెలిసికొనేందుకు, ఇప్పటికీ చేయలేని దానిని చేసేందుకు స్థిరమగు సంకల్పముండాలి వ్యక్తికి.

స్వార్థ పరమగు కోరికలు లేనపుడు ఆవిర్భవించే శాంతి తేజములలో వ్యక్తి ఒకరీతిగా ముందుకు సాగిపోవాలి.

వ్యాఖ్య : లేని దానిని సాధించడానికే యోగము. ఆ దృష్టి ఉన్నపుడే, ఆత్మ భూమికలోనికి అడుగుపెట్టి పరివర్తనము చెందగలము. ఇది ఒకనాటితో జరిగేదికాదు. గనుక స్థిర సంకల్ప మవసరము.

## 18 మృత్యువిధి

ప్రవర్ధమాన పరిపూర్ణతను లక్షించి సర్వదా పురోగమించే కళా కౌశలమును శరీరములు చిక్కబట్టుకున్నపుడు, మృత్యువిధి జయింప బడ డానికి తగిన మార్గములో ఉండును.

వ్యాఖ్య : మృత్యువిధి, అనగా మృత్యువు అనివార్యము, ధ్రువము— అనే విధికూడ జయించగోరడంలేదు, జయింప బడగోరుతోంది ; కారణం, దాని జయము భగవదుద్దిష్టమైన మానవుని, భవితవ్యములో అంతర్భాగము. శరీర పురోగమన మంటే శరీర చేతనావికాసము. ఇది భగవదర్పిత కర్మ ద్వారా జరగాలి. (చూ. 6).

## 19 ప్రధాన గమ్యము.

చేతనా వికాసమే జీవిత ప్రధాన గమ్యమని తలంతుమేని, అనేక కష్టములు స్వయముగా పరిష్కరింపబడును.

వ్యాఖ్య :- 16— లోని జీవిత గమ్యానికి ఇచ్చటి జీవిత గమ్యం ప్రధాన సాధనము. చేతనా వికాసానికే గాని, ధన సంపాదనకు ఆరాట

పడకుము. ఇతరులపై ఆధిక్యమును కోరకుము. అందుచేత అనేక కష్టములు అసలే అంతరిస్తాయి.

## 20 మానవుల అజ్ఞానము

మానవ చేతన ఎంత మలినమైపోయిందంటే, సర్వేశ్వరునికి హృదయపూర్వకమగు సమర్పణచేత లభించే ప్రకాశమయ ఆనందమును విడిచి, అహంకారదైన్యమును, దాని అజ్ఞానమునే మానవులు వరించుచున్నారు! వారి అంధత్వము ఎంత ఇనుమడించిందంటే, అట్టి అనుభవమునకు చేయవలసిన ప్రయత్నమునుగూడ వారు తిరస్కరించుచున్నారు! తమ అహంభావదైన్యమునకు తలవంచడమే వారికిష్టముకాని, దానినుండి విముక్తి పొంద అవసరమగు ప్రయత్నమును చేయనొల్లరు!

వ్యాఖ్య: చేతన దూషితమై, అజ్ఞానము దట్టమైనపుడు, అన్ని విలువలు తారుమారవుతాయి. క్షుద్రమగు అహంకార సుఖమే పరమార్థముగా గోచరిస్తుంది. అందుచేత పరమార్థానికి ప్రయత్నించరు. పైగా, తమస్సులో ఉండడంచేత ఆ ప్రయత్నముకూడ చేయనొల్లరు.

## 21 విస్పృహోయులము కాము

మన మిప్పుడు కేవలము మన స్వీయ సాధన సంపత్తిమీదనే ఆధారపడి ఉన్న యుగములో లేము. (మనమట్లు వదిలివేయబడలేదు). మనకు ప్రబోధము కలిగించడానికి పరమాత్మ తన ప్రకృష్ట చేతనను

పంపించి ఉన్నాడు. సమర్థులైన వారందరు దానినుంచి అపూర్వలాభమును పొందాలి :

వ్యాఖ్య : (చూ.12,15) అందుచేతనే ఈ రోజులలో పుట్టాలని ఎప్పటి నుంచో కోరుతూవచ్చాము. 'సమర్థులైన' అంటే, మనస్సును ప్రశాంతపరచి ముందు ఆ చేతనను గుర్తించాలి. తర్వాత అంతరాత్మ, ఊర్ధ్వాత్మల సాయముతో తత్సహాయమును స్వీక రించాలి.

## 22 మానవుని అశక్తత

మానవుడేదిచేసినా, దానివెనుక అతని అశక్తత (Incapacity) అంటిపెట్టుకునే ఉంటుంది. భగవంతుని ఎరిగినవాడూ, అతని చేతిలో అనురూపమైన ఉపకరణమైనవాడూ మాత్రమే తప్పునుంచి తప్పించుకో గలడు. భగవదాదేశమును అనుసరించి మాత్రమే కర్మచేస్తూ, తన స్వీయ ప్రవృత్తిని ఆ ఆదేశమునకు కలపకుండా జాగ్రత్తపడినపుడే అది సాధ్యమవుతుంది.

వ్యాఖ్య :- అంటే భగవంతుడు మనను నడిపించునపుడు, అలా నడి పించడానికి మనము అవకాశమిచ్చినపుడు మాత్రమే మనము తప్పులు చేయము. ఏలన అపుడు అశక్తతకు అక్కడ తావు లేదు.

## 23 ప్రవృత్తి మార్పు

ఈ భౌతిక భూమికయందు పురోగమించడానికి మన జీవనములో,

మన కర్మలో ఎట్టి మార్పు జరిగితీరాలి? మనం ఆక్రమించవలసిన స్థానమున కనుగుణముగా మన ప్రవృత్తిని తీర్చి దిద్దుకోవాలి.

మన అంతఃసత్త పట్ల మనము ఎంతెంత సచేతనులమగుదుమో అంతంత సరియగు సాధనములు మనకు ప్రాప్తించుతాయి.

వ్యాఖ్య :- మనం అపేక్షించే ఉద్యోగము ననుసరించి మన చదువు నిర్ణయించబడాలి. అలాగే ఏ లక్ష్యమును అపేక్షించుతామో, దాని కనుగుణముగా ఉపకరణ భూతమగు మనస్స్వభావమును (ప్రవృత్తిని) ఏర్పరచుకోవాలి. స్వభావము అంతఃసత్తకు సంబంధించినది. కావున అంతఃసత్తజ్ఞానము స్పష్టపడిన కొలదీ స్వభావజ్ఞానము కూడ స్పష్టపడును.

## 24 శరీర పరిశ్రమ

భవిష్యదర్థము జీవించగోరు వారికి ఆహారము వలె శరీర పరిశ్రమ కూడ అపరిహార్యము. ఏలన, పనిలేనితిండి సమతాలోపమును కలిగించును.

వ్యాఖ్య :- ఏ బంగారు భవిష్యత్తును గురించి మనము కలలు గంటున్నామో, ఆ భవిష్యత్తు రూపొందడానికి నడుము కట్టినవారే తదర్థము జీవించగోరువారు. ఇట్టి భవిష్యజ్జీవితము సమతా విలసితమై ఉంటుంది గాన, అట్టి సమతలో అంతర్భాగమైన శరీర పరిశ్రమకూడ అవసరము.

## 25 అవచేతన: విశ్వాసము

పాంచభౌతిక శరీరము యొక్క మరణమును కళ్లారాగాంచడంచేత అవచేతన అపజయవాది అయి కూర్చుంది. "ఎంత పురోగతి సాధించినా, ఎట్టి ప్రయత్నమొనరించినా శరీరము అలాగే అంత మొందింది; ఇక ముందుకూడ మరణమే దానికి పర్యవసానము కాగలదు"— అనే గట్టి నమ్మకము అవచేతనకు ఏర్పడి పోయింది.

కావున ఇపుడు జరుగుతున్న కార్యము, విశ్వాసమును, పరివర్తనము నిశ్చయమనే భావమును అవచేతనలో చొప్పించడానికి ప్రయత్నించడమే. ఇక ఈ ప్రయత్నమంటే అనుక్షణ సమరము.

వ్యాఖ్య :— శ్రీఅరవిందుడు అట్టి పరిణామమును ప్రకటించారు. ఇది అవచేతనలో విశ్వాసము రేకెత్తించే ప్రథమాంశము. తర్వాత వారూ, శ్రీ తల్లిగారూ తమలో సాధించి మనకు చవి చూపించినారు: ఇది ద్వితీయాంశము. చివరకు ఇపుడు అతిమానసశక్తి ఉద్ధృత ప్రభావముచేత తీవ్రతరఫలితాలు కలుగుతున్నాయి : ఇది తృతీయాంశము. ఘోరమైన ప్రతిఘటన ఇంకా ఎదురౌతూ ఉన్నా ఈ మహాశక్తి ముందు అది ఎంతో కాలము నిలబడలేదు.

## 26 సేవ కొరకు

సుఖము కొరకు జీవించబోకు, భగవత్ సేవకొరకు జీవించు. అపుడు నీ అనుభవానికి వచ్చు సుఖము నీ ఆశావధులను అతిశయించి ఉంటుంది.

వ్యాఖ్య : సుఖమును సరాసరి అపేక్షించినంతకాలము, ఆ అపేక్ష-అపేక్షా వృత్తే-మనలను సంకుచిత పరుస్తుంది. కనుక అప్పటి సుఖముకూడ సంకుచితముగానూ, నీచముగానూ ఉంటుంది. కాని సర్వాత్మగా భగవంతుని సేవిస్తూ ఉన్నపుడు, భగవంతుడే మన కేంద్రమై, అహం అంతరించడముచేత, భగవంతునితో భేదాభేద భావమును పొంది, భగవత్తత్వమునకు సహజమగు, ఊహాతీతమైన విశాల సుఖమును అనుభవిస్తాము. అంటే, మనకొరకు మనము జీవించితే సుఖపడలేము. భగవంతుని కొరకు జీవించితే అపారమైన సుఖానుభవము స్వయముగానే కలుగుతుంది.

## 27 నూతన ప్రపంచము

అనృతమునకు చేస్తూ వచ్చినపాతదాస్యమును తన్నివేసి, సత్యాధారముపై ఒక నూతన జగత్తు ఆవిర్భవింప గోరుతున్నది.

అన్ని దేశములలోనూ ఈ విషయమును గ్రహించిన, కనీసము స్పృశించిన విశిష్ట మానవులున్నారు. "మీరు చేయి కలుపుదురా ?" అని అట్టి మానవులకే మనము చేయు విజ్ఞప్తి.

వ్యాఖ్య : అలా గ్రహించడం కూడ ఈశ్వరానుగ్రహముచేతనే. అట్టి అనుగ్రహము పొంది, గ్రహించిన వారిని ఈశ్వరుడు మళ్లీ-మీరు సహకరింతురా? —అని అడుగుతున్నాడు. చూడండి, గ్రహించిన వారి మీద ఎంత బాధ్యత పడుతోందో ! ఈ బాధ్యతను నిర్వర్తించడములోనే, మొదట కొంచెము బాధగా (విరుదముగా) ఉన్నా, మన సర్వసుఖాలూ ఇమిడి ఉన్నాయి.

# 28 మనస్సు చాలదు

పెక్కుమంది మానవులు ప్రకృతి ప్రేరణలచేత తరుమబడే పశుప్రాయులు. ఏ కోరికలు లేచినా, వారు వాటిని పూరిస్తారు; ఏ భావములు మెదలినా, స్వేచ్ఛగా వాటిని ఆడనిస్తారు; ఏ భౌతికావసరాలు కలిగినా, వాటిని తృప్తి పరచడానికి ప్రయత్నించుతారు. ....

కాని మనుష్యునికి ఒక మనస్సుకూడ ఉన్నది. తాను వికాసము చెందినకొలది తనహేతువ్యాపారముచేత, ఇచ్ఛాబలముచేత అతడు తనప్రాణమయ, అన్నమయ,ప్రకృతిని శాసింపనేర్చుకొంటాడు. కాని ఈ శాసనము కొంతవరకు మాత్రమే. కారణము హేతుబుద్ధితరచు ప్రాణికకామనలచేత, శారీరక అజ్ఞానముచేత భ్రమకు లోనై, వాటి తప్పులను, అపసవ్య వృత్తులను తన భావములచేత, యుక్తుల లేక వాదములచేత సమర్థింపజూచును. ఒకవేళ హేతుబుద్ధి విముక్తమై నిలిచి, ప్రాణమునకుగాని, శరీరమునకుగాని, "దీనిని చేయకు" అని చెప్పినా, అవి తరచు ఆనిషేధమును లక్ష్యపెట్టక, తమ మార్గమునే అనుసరించుతాయి— మానవుని మానసిక సంకల్పము వాటిని శాసింప సమర్థముకాదు.

.... .... ప్రాణము, శరీరమేకాదు, మనస్సుకూడ దైవ సత్యము గ్రహించి, దైవ శాసనమును శిరసావహించాలి.

శ్రీ అరవిందుడు.

వ్యాఖ్య : మానవుడు మనః ప్రధానుడు. అందుచేతనే అతనికి మానవుడని పేరు. కాని ఆ మనస్సుద్వారా తనను తాను శాసించుకోలేక పోతున్నాడు. అయితే గత్యంతరము ? భగవదాశ్రయము. ఏలన భగవంతునియందే మానవుని పరిపూర్తి.

## 29 అబద్ధముల దుష్ఫలితం

మనము అబద్ధాలు చెప్పుతూపోతున్నంతకాలము, ఆనందమయ భవిష్యత్తును మనకు దూరముగా నెట్టివేస్తూ పోతుంటాము.

13-7-72

## సత్యమే రక్షణము

అంతరించక పూర్వము అనృతము ఒకసారి ఉవ్వెత్తున లేచిపడు తుంది. అలా విపత్తు సంభవించేవరకు ప్రజలు పాఠము నేర్చుకోరు. వారు సత్యము పట్ల కన్ను తెరవక పూర్వము అట్టి విపత్తు వచ్చి పడ వలసినదేనా ?

అట్టి మహా విపత్తు సంభవించకుండా ఉండేందుకే అందరినుంచి ఒక ప్రబల యత్నమును అపేక్షించుతున్నాను.

సత్యమొక్కటే మనలను సంరక్షించ గలదు. మాటలో సత్యము, చేతలో సత్యము, సంకల్పములో సత్యము, భావనలో సత్యము.

సత్యమును సేవిస్తావా ? సర్వనాశనానికి తలఒగ్గుతావా? ఏదో ఒకటి ఎన్నుకో !

26-11-72 —మాతృశ్రీ

వ్యాఖ్య :- అసత్యము విజృంభించడానికీ, విపత్తు విరుచుకుపడడానికి మధ్య కొంత వ్యవధి ఉంటుంది. ఈ అనృత విజృంభణమును

కనులారగాంచుతూ ఉండికూడ జనులు మేల్కోవడంలేదు. ఏ అణుయుద్ధరూపముగానో విపత్తు విరుచుకు పడితేనేగాని ప్రజలు అర్థము చేసుకునేటట్లు కన్పించడంలేదు, అని శ్రీ తల్లి గారు వాపోతున్నారు. పాపం! అయినా మన విపరీత ధోరణిని మనము విడనాడము!

ప్రజలు ఈ విషయములో ప్రయత్నమే చేయడం లేదు. బహు కొద్దిమంది చేసినా, వారిలో త్రికరణ శుద్ధిగా చేసేవారు మరీ మృగ్యము. అందుచేతనే ప్రయత్నించమనీ, సర్వాత్మనా ప్రయత్నించమనీ, ప్రత్యేకించి వక్కాణించుతున్నారు శ్రీ తల్లిగారు!

## సమగ్రత

సమగ్రతయే అతిశయించిన చిత్తశుద్ధి

16—12—72 —మాతృశ్రీ

వ్యాఖ్య :— మన సత్తలో అంతరాత్మ ఎల్లప్పుడు శుద్ధముగానే ఉంటుంది. అలాగే మనసుకూడ కొంత వరకు ఉండవచ్చు. ప్రాణ, దేహ లలో ఈవిశుద్ధిని సాధించడం దుష్కరం కాని అన్ని భాగాలు విశుద్ధమై, అన్యోన్యము తమశక్తులను మేళవించి, ఆకాంక్షించి నపుడే అది అతిశయించిన చిత్తశుద్ధి అనిపించుకుంటుంది.

అందుచేతనే శ్రీ అరవిందుడు తన యోగానికి పూర్ణ యోగము (Integral yoga) అని పేరు పెట్టారు.

దీనిని వివరించుతూనే, సందేశము 1 లో "మాటలో సత్యము, చేతలో సత్యము ............" అని స్పష్టముగా చెప్పారు.

## సామాన్య భూమిక

అన్ని అభిరుచులు, అన్ని పరిమితులకు ఆవల పరస్పరావ గాహనకు ఆధారమగు సామాన్య భూమిక గలదు. ఇక్కడ అందరు కలిసికొని అంతరసామరస్యమును కనుగొనగలరు. దివ్యచేతన కొరకు మన యందలి ఆకాంక్షయే ఆ సామాన్య భూమిక.

24-4-72 —మాతృశ్రీ.

వ్యాఖ్య : కుటుంబములో ఎంతోమంది వ్యక్తులుంటారు. వారికి భిన్న భిన్న మానసికాభిరుచులుంటాయి. వారి మానసిక శక్తులు కూడ పరిమితులకు లోనై ఉంటాయి. అందుచేత ఒకరి కభిమతమైనది మరొకరికి కాదు, ఒకరికి సాధ్యమైనది మరొ కరికి కాదు. ఇట్టి విభిన్న స్వభావాలు, శక్తులుగల దేహ, ప్రాణ, మనస్సులకు ఆవల అంతరాత్మ గలదు. అది భాగవత చేతనకొరకు సదా పరితపించుతూ ఉంటుంది. ఆ తపన, ఆ ఆకాంక్ష అందరి మానవులలోనూ సమానముగా, భినహాయింపు లేకుండా, జ్వలించుతూ ఉంటుంది. కనీసం ఉబుకుతూ ఉంటుంది. ఇది అంతరాత్మ లక్షణము, స్వభావముకూడ.

ఈ ఆకాంక్షకు ప్రాధాన్యమిచ్చినపుడు, మనందరకు ఒక క్రొత్త వెలుగు ప్రాప్తించుతుంది. ఆ వెలుగులో అందరి ఆశయము ఒకటిగానే కన్పించి, ఆ మహదాశయము కొరకు బాహ్య విభేదములను విస్మరించి, విశాలతర చేతనతో పరస్పరము అర్థము చేసుకోగలుగుతాము. మానవ జీవితమునకు లక్ష్యమిదేగదా ? కలిసి, శక్తినికూడ గట్టుకుని, ఆ లక్ష్య సాధన కొరకు ఎందుకు ప్రయత్నించరాదు. ఎందుకు వివదించుకోవాలి? అని పరస్పరావబోధనకు ఉపక్రమించుతాము. అట్టి పరస్పరావగా

హనతో, సాధనా జీవితములో మనకుండవలసిన పరస్పర సంబంధ ములను అంతరాత్మ సూచించిన విధముగా ఏర్పరచుకొని కలిసి మెలిసి పనిచేయగలుగుతాము. అదే సామరస్యము (Harmony). **Harmony** అంటే స్వర సమ్మేళనము. స్వరములు అన్యోన్యము కలిసినపుడు చక్కని సంగీతము ఎలా వెలువడుతుందో, అలాగే అంతరాత్మ భూమికలో అందరూ కలిసి భాగవత జీవన సంగీతమును వెలువరించుకో గలుగుతాము.

అమ్మ, అరవిందుల లక్ష్యము వ్యక్తిగత విమోచనముగాదు. సామూహిక విమోచనము, సామూహిక జీవనము, దాని ద్వారా నూతన జాతి ఆవిర్భావము అందుచేత శ్రీమాత పరస్పరావగాహనకు, అన్యోన్య సామరస్యానికి ప్రాధాన్యమిచ్చి, ఈ సందేశము ద్వారా దానికి మార్గము చూపెట్టారు.

సామూహిక సిద్ధి అనగానే, స్వసిద్ధిని పాటించపనిలేదని కాదు. అవగాహనకు ఆకాంక్ష ఆధారమని ఈ సందేశములో శ్రీ మాత చెప్పారుకదా. ఆ ఆకాంక్ష అంతరాత్మ వికాసము మీద ఆధారపడి ఉంటుంది. అందుచేత స్వీయసిద్ధి పూర్వకముగానే, లేక స్వీయసిద్ధి ప్రక్క-ప్రక్కనే సమష్టిసిద్ధి. దీనిని అమ్మ 5-2-72న ఇచ్చిన ఒక సమా ధానములో ఇలా ప్రతిపాదించారు. "ప్రతివ్యక్తి ప్రప్రథమముగా సాధించ వలసినది స్వీయ పరివర్తనము. ప్రపంచానికి సాయపడేందుకు ప్రధాన మార్గము తాను భగవంతుని సాధించుకోవడమే."

## వెలుగును పిలువుము

నిశ్చల, నీరవస్థితిని అభ్యసింపుము. నీకొక సమస్య ఎదురైనపుడు, ఏమిచేతువు ? దాని వలన కలుగగల అన్ని విషయములను, అన్నిపర్యవసానములను, దానికి సంబంధించిన అన్ని కార్యాకార్యములను నీతలలో త్రిప్పి త్రిప్పిచూతువు, దానికి బదులు, నిశ్చలముగా నుండి, సద్భావము (goodwill) యొక్క ఆవశ్యకతను గమనించి, ఆసద్భావమునందు ఆకాంక్ష నిలుపుము. అట్లుచేసినచో, నీకుపరిష్కారము శీఘ్రముగా స్ఫురించును; మనసులో మౌనమున్నది గనుక, ఆ పరిష్కారమును నీవు ఆలకించగలుగుదువు కూడ.

నీవొక కష్టములో చిక్కువడినపుడు, ఈ ప్రక్రియను ప్రయత్నించి చూడుము: అస్థిరుడ వగుటకు బదులు, పరిష్కారాన్వేషణలో చిందరవందరగాలేచునట్టి ప్రతి ఆలోచనను పట్టి చూచుటకు బదులు, ఉత్కంఠతో కలత జెందుటకు బదులు, మనోవీధిలో అటునిటు పరుగు లెత్తుటకు బదులు—నిశ్చల చిత్తముతో నుండుము. నిశ్చలతను చిక్క బట్టుకొని నీస్వభావము ననుసరించి ప్రగాఢముగానో లేక ప్రశాంతముగానో ఏకాగ్రభావముతోనో లేక విశాల భావముతోనో, లేక అన్నింటిని మేళవించియో వెలుగును పిలువుము. పిలిచి తదవతరణమును ప్రతీక్షించుము.

అప్పుడావెలుగు నీకు దగ్గరి దారి చూపించును.

—మాతృశ్రీ

పరిశీలనః— సమాస్యా పరిష్కారానికిది యోగమార్గము. ఇక్కడ పరిష్కారము మనకు పైనుంచి దిగుతుంది. మనము పరిష్క

రించము। అందువలన హైరానే ఉండదు. యోగ పరిష్కా-రము నందు. మనద్వారా కర్మ జరుగును గాని, ఆ కర్మను మన మంటము; దానితో మనకు తగులములేదు. అది ఊర్ధ్వ చేతనా పరిష్కారముగాన మన పరిష్కారము కంటే మిక్కిలి పరిపూర్ణముగా ఉండును.

ఈ పరిష్కార విధానానికి ప్రాతిపదిక నిశ్చల నీరవతలు, శాంతి సమతలు. నిజానికి పూర్ణయోగాని కంతకుకూడ శాంతి సమతలే ప్రాతి పదిక.

## ఏకాగ్రత — 1

జీవితమునందు నీవేది తలపెట్టినను, తత్సిద్ధికి ఒక వస్తువు అత్యంతావశ్యకము. ఏకాగ్రతయే ఆ మూల సూత్రము. నీ చేతనయొక్క కిరణము లన్నింటిని ఒకచోట జేర్చి, దృఢ సంకల్పముతో ఆ ఏకాగ్రతను నిలుపుకొన్నచో, నీ కేదియు అడ్డు నిలువలేదు. అత్యంత భౌతికమునుండి అత్యంత ఆధ్యాత్మికము వరకుగల మార్గమున నిన్నేదీ ఆపలేదు. అయితే స్థిరముగా, దృఢముగా అవలంబించినపుడే ఈ ఏకాగ్రత అలవడును. ఒకే దానిపై ఏకాగ్రత ఉండవలెనని నా భావము కాదు. ఏకాగ్రతను నేర్వవలెననే నా ఆశయము.

ధన సంపాదనకు, విద్యావ్యాసంగమునకు, అది, యిది యననేల సమస్త భౌతిక మానసిక వికాసమునకు అది సర్వదా అపరిహార్యము. ఒక వ్యక్తి అవధాన సామర్థ్యము ననుసరించియే అతని విలువ ఏర్పడును.

ఏ మానవ, అతిమానవ కార్యరంగమునకైనా ఏకాగ్రతా శక్తియే కీలకము. నీకాశక్తి యున్నచో, నీవు శ్రేష్ఠక్రీడాకారుడవు కావచ్చును, శ్రేష్ఠ విద్యార్థివి కావచ్చును, కళా సాహిత్య విజ్ఞానములలో ప్రతిభా విశేషముతో విరాజిల్ల వచ్చును, మహా మునివి కావచ్చును.

ప్రతివాని యందు తదంకురము ఉండనే ఉన్నది. అది ప్రతివానికి ప్రకృతి దత్తము - అయితే దానిని కృషిజేసి పెంపొందించుకొన వలయును.

—మాతృశ్రీ

# ఏకాగ్రత—2

ప్రశ్న : ఏకాగ్రత అనగానేమి ?

సమాధానము : చెదిరిపోయిన నీ చేతనా కిరణముల నన్నిటిని ఒకే కేంద్రమునకు, ఒకే భావమునకు మరలించుటయే ఏకాగ్రత. అవధానము (Attention) నందు పరిపూర్ణతను సాధించ గలిగిన వారు తాము చేపట్టు ఏకార్యము నందైనను సాఫల్యము నందగలరు. వారు సదా మహాప్రగతిని సాధింతురు. ఇక అట్టి ఏకాగ్రతను, సరిగా మన కండరముల వలెనే, పెంపొందించుకొన వచ్చును. ఈ శిక్షణమున వ్యక్తి విభిన్న యోగములను, విభిన్న పద్ధతులను అనుసరించ వచ్చును. ఉదాహరణకు, దీర్ఘరోగి కూడ శిక్షణద్వారా ఇతరులవలె శక్తిమంతుడు కాగలడని ఈనాడు మనకు తెలుసు. నీ సంకల్పము ఉఫ్ అంటే ఆగిపోయేదిగా మాత్రము ఉండరాదు.

సంకల్పము, ఏకాగ్రత కృషిచేసి పండించ దగినవి. ఒక పద్ధతి, నియతమగు అభ్యాసమునకు సంబంధించిన విషయమిది. దృఢ సంకల్పమే ఉన్నచో సాధించ గలవు.

అయితే 'ప్రయోజనమేమి?' అనే భావము నీ సంకల్పమును దుర్బలపరుపకూడదు. పుట్టుకతోనే ఒకని శీలము నిర్ణయించబడును. దానిని ఏదియు మార్చజాలదు – అను అభిప్రాయము కూడ మూర్ఖతయే అగును.

– మాతృశ్రీ

వ్యాఖ్య : సంకల్ప బలమును పెంపొందించు కోడానికి కూడ దృఢ సంకల్పము కావాలి ; ఆ సంకల్పము నిలిచి పనిచేయాలి. అప్పుడు ఆ పని స్వభావమును సైతము మార్చివేయగలదు. ఇది అసాధ్యముకాదు. ఏలన క్రమముగా మన ఇచ్ఛ భగవదిచ్ఛను తనకు తోడు తెచ్చుకో గలుగుతుంది.

## యథార్థ వినమ్రత

నమ్రత యనగా, మనస్సుగాని, ప్రాణముగాని, దేహముగాని భగవంతుడు లేనిదే తనకేమియు తెలియదనియు, తానేమి కాననియు, తానేమి చేయజాలననియు మరచిపోకూడదు. భగవంతుడు వినా, అవి కేవలము అజ్ఞానము, అవ్యవస్థ, అశక్తత మాత్రమే అగును; భగవానుడు మాత్రమే పరమ సత్యము, జీవనము, శక్తి, ప్రేమ, ఆనందము.

కావున సత్తయందు మాత్రమేగాక, క్రియ యందును, అభివ్యక్తి యందును కూడ భగవంతుని అర్థము చేసుకొనుటకు, అతని గుణదోషములు, నిర్ణయించుటకు మనః ప్రాణదేహములు పూర్తిగా అశక్తములు. ఆ విషయమును అవి ఒకేసారి శాశ్వతముగా తెలిసికొని, జీవించవలయును.

ఇదియే నిజమగు వినమ్రత. దీనితోపాటు నిశ్చలతా శాంతులు మనకబ్బును.

పైగా, అహిత శక్తుల దాడులనుండి రక్షించుటకు అది మిక్కిలి భద్రమగు ఉపాయము. నిజానికి, మానవుని యందలి గర్వ ద్వార కవాటమునే ప్రతిపక్షి తట్టుచుండును. కారణము, అదియే అతని ప్రవేశమునకు తెరచుకొను ద్వారము.

ఆశ (అత్యాశ) విడువుము. ముఖ్యముగా, కానిది అయినట్లు నటింపకుము. కాని ప్రతిక్షణము నీవు ఉండగలిగిన ఉత్తమస్థితి యందుండుము.

— మాతృశ్రీ

విశదీకరణ: భగవంతుడు వినా అనగా, భగవంతునితో సంపర్కమువినా. క్రిందటి ఏకాగ్రత సందేశములోని ఇచ్ఛకూడ భగవంతుని ఇచ్ఛతో కూడి స్వభావ పరివర్తనను సాధించ గలుగుతుంది. నేను గర్వించినపుడే ఉబ్బితబ్బిబ్బై, ఆసుర ప్రేరణలకు ఎడమిస్తాను. అదే వాటికి ద్వారము తెరవడం.

# స్వ సంవేదనము

## (Self awareness)

నీవు ఆత్మ సచేతనుడవై యుండవలయును. నీ స్వభావమునకు నీచలనములకు నీవు మేల్కొని వలయును. నీవు ఎందుకు, ఎట్లుచేయు చున్నావో ఎరుగ వలయును, నీ ప్రేరణాచోదనలను, నిన్ను కదిలించు ప్రచ్ఛన్న ప్రత్యక్ష శక్తులను నీవు గ్రహించవలయును; నీసత్తయొక్క సమస్త యంత్రాంగమును విడదీసి పెట్టినట్లు వేరుచేయవలయును.

ఇట్లు ఒకసారి స్వీయ సత్తపట్ల సచేతనుడవగుదువేని, వస్తువులను వివేచించి, వేరు చేయగలవని దాని అర్థము. అప్పుడు క్రిందికి లాగు శక్తులేవో, ఉద్ధరించునవేవో నీవు పరికించగలవు. పిమ్మట, ధర్మాధర్మములను, సత్యాసత్యములను, దివ్యాదివ్యములను వేరుపరచి గుర్తించినపుడు, తప్పక ఆ గుర్తింపు ననుసరించియే నీవు ప్రవర్తింప వలయును-అనగా ఒక పక్షమును ధృఢముగా నిరాకరించి, మరొక పక్షమును ఆమోదించ వలయును. ఈ ద్వంద్వము ప్రతి పదమునందు నీకెదురగును; ప్రతి పదమునందు నీవు ఎన్నిక చేయవలసి ఉండును.

– మాతృశ్రీ

వ్యాఖ్య :- తింటూ ఉన్నపుడు,తిరుగుతూ ఉన్నపుడు, చేస్తూవున్నపుడు లోపల ఏమి జరుగు తున్నదో గమనించుతూ పోవాలి. తత్ఫలితముగా చేతనలోని వివిధ విషయాలు గ్రహించ బడడమే గాక, చేతనకూడ లోతులకు దిగును. ఈ అంతర్ దృష్టి క్రమముగా ఆవరణలను ఛేదించుకొని లోతులకు దారితీయును. అంతరాత్మను చేరడానికి ఈ అంతర్ దృష్టి అమోఘమగు మార్గము.

## మాతృఫోటో నిరీక్షణము

మాతాజీ ఫొటోలోని ముఖములోనికి, ముఖ్యంగా శ్రీ అమ్మ నయనాలలోనికి చూడడంచేత మనకు లాభం కలుగుతుంది. క్రమముగా, పట్టులేకుండా, అనన్యముగా అమ్మనుచూస్తూ అమ్మ తత్వములోనికి ప్రవేశించడం జరుగుతుంది. ఈ సందర్భముగా బుల్లెటిన్‌లోనే ఉన్న "నీరోద్ బరన్, మాతాజీ" ఉత్తర ప్రత్యుత్తరాలలోని అంశమును ఇప్పుడు చూద్దాము.

నీరోద్ బరన్: అమ్మా ! నిన్నుగానీ, నీఫోటోనుగానీ నిరీక్షించినందువల్ల లాభముంటుందా నాకు ?

మాతాజీ : అవును, ఉంటుంది. చాలామందికి ఉంటోంది.

## ముందుకు, అనుక్షణం ముందుకు

ముందడుగువేయ విరమించిన మరుక్షణమే నీవు వెనుకకు పడిపోదువు. తృప్తిజెంది, ఆకాంక్షకు స్వస్తిచెప్పిన క్షణమునుండే నీవు మరణింప నారంభింతువు. చలనమే జీవనము, ప్రయత్నమే జీవనము; జీవనమంటే మహాప్రస్థానము, పర్వతారోహణము. భవిష్యదావిష్కారములు, సాక్షాత్కారముల నపేక్షించిన ఊర్ధ్వగమనము. విశ్రమింప గోరుటకంటే, అపాయకరమైనది మరొకటిలేదు. క్రియలో, ప్రయత్నములో, పురోభియానములోనే నీకు విశ్రాంతి, నిజమగు విశ్రాంతి లభించవలయును. భగవదనుగ్రహమునందు పూర్ణ విశ్వాసమువలన కామనా

రాహిత్యము వలన, అహంకార విజయము వలన మాత్రమే నీకు నిజమగు విశ్రాంతి లభించును, స్వయముగావచ్చి వరించును.

చేతనను విస్తృతపరచుచు, విశ్వవ్యాపకము చేయుటలోనే యథార్థ విశ్రాంతి వెలయగలదు. విస్తారమునందు ప్రపంచముతో పోటీపడుము. అపుడు నీకన్నివేళల విశ్రాంతి విలసిల్లును. క్రియామధ్యమున, యుద్ధ మధ్యమున, ఉద్యమ మధ్యమున అనంతతా నిత్యతలయందుగల విశ్రాంతి నీదగును.

—మాతృశ్రీ.

వ్యాఖ్య : జీవనము చలనము గనుక, ముందుకు పోకపోయిన, వెనుకకు పోవలసినదే. లేని యెడల చలనముండదుగదా ! ఈ విషయమును అనుభవములో మనము గ్రహించాలి. ఎల్లప్పుడు ముందుకు పోవడం సాధ్యమా ? ముందుకు పోవడానికి ఆకాంక్షసాధ్యమే, అదికూడ పురోగతే. ఉన్నదానితో తృప్తి పడడమంటే, దానిని కౌగలించుకొని మురిసిపోవడం. అపుడు మనము ఆ తృప్తినిచ్చే ఒక పరిమిత వృత్తిగామాత్రమే సంకోచించుకొందుము. ఇదిగో ఈ సంకుచితభావమే అహంభావము. దానియందే అశాంతి; విశాలతలోకాదు.

## దైవ సంవరణము

"అనంతమును వరించినవాడు అనంతముచే వరింపబడియే యున్నాడు."

—శ్రీ అరవిందుడు

(ఎంత దివ్య మీ వాక్యము, ఎంత సత్యము!)

1. "అదేవిధముగా, భగవంతుని వరించిన వాడు భగవంతునిచే వరింపబడియే ఉన్నాడు – అనికూడ చెప్పవచ్చును. అంటే, భగవంతుడు ఆతనిని గట్టిగా పట్టుకొని జారిపోనివ్వడు. తమ భవితవ్యము పట్ల కొంత మందికి అంతర్విశ్వాసము అంతర్నిశ్చయము నుండును. దీనికి కారణము దేవుడు వారిని ఎన్నిక చేసి యుండుటయే. ఇట్టి నిశ్చయ భావము చేతనే పర్వతాలవంటి కష్టాలు ప్రాప్తించినను వారు దిగులు జెందరు. అమోఘ మగు సహనముతోను, అజేయమగు ధైర్యముతోను వానిని ఎదుర్కొని యింతురు".

2. "దీని నెప్పుడును విస్మరించకుము! నీవు భగవంతుని తలంచితివేని, భగవంతుడు నిన్ను తలంచి యున్నాడు, లేనిచో నీవు తలంచి యుండవు; అటులే, భగవంతుడు నిన్ను ముందు వరించి యుండ బట్టియే, నీవు భగవంతుని వరించి యున్నావు. ఇక ఒక్కసారి నీవు ఎన్నిక చేయబడుదువేని, సాఫల్యము పట్ల నీవు నిశ్చింతగా నుండవచ్చును, ఉందువు. ఒకవేళ మధ్య మధ్య సందేహ సంకోచములు, విచికిత్సా విచారములు తలయెత్తిన వాని వలన కాలము పాడగునే కాని, మరే ప్రయోజనము నుండదని తెలిసికొనుము."

3. "కావుననే ఒకసారి మిమ్ములను ఉద్బోధించి చెప్పితిని. చివరకు తేలిన దేమన పత్త యందలి ఒక విభాగములో ఆకాంక్షించితిరి. కావుననే, యీ నాడు మీరీ ఆశ్రమములో నున్నారు. ఇక మీలో భగ వంతుడు మీ ఆశ్రమ వాసమును అభిలషించెను. గావుననే, మీరు దాని నాకాంక్షించితిరి (సందేహాదులకు తావులేదు.)"

4. "కొందరు సూటి మార్గమును బట్టి త్వరగా గమ్యము చేరు కొందురు. అట్లుగాక, కొందరు చుట్టు మార్గమును చూచుకొని పరిభ్ర మింతురు. కాని, చివరకు వారును చేరుకొందురు. భగవంతుని కొరకు ఒకసారి గాఢమైన ప్రేరణ పొందినవానికి భగవత్ప్రాప్తిపట్ల సంశయ ముండదు; ఉన్నవాడు ఒక్కడును లేడని అనుభవమును బట్టి చెప్పగలను. ఒకవేళ అట్టివాడు కొంతకాలము భగవద్విముఖుడై వర్తించినను, చివరకు చేరితీరును. అతడు ఎక్కువ పెనుగులాడ వలసి యుండును. అతనికి ఎక్కువకాలము పట్టును. అంతే కాని అతడు చేరితీరును."

5. "అతని ఎన్నిక జరిగిపోయినది. అందుచేత, అతని ముహూర్త మాసన్నమైనది. కావున అతని ప్రాప్తి తథ్యము."

6. "దీనిని గట్టిగా గమనింపుము: నిన్ను వరించిన భగవంతుడు నీ అభిరుచికి పూర్తి అవకాశమును కూడ నిచ్చును. నా అభిరుచి నను సరించి, గమ్యమును ఈ జన్మలోనే చేరెదను – అని నిశ్చయించు కొందు వేని, అట్లే చేరెదవు. నీ నిశ్చయమును స్థిరముగా నీజ్ఞప్తి యందు నిలుపు కొనవలయునని గాని, లేక దానిని సదా జ్ఞప్తికి తెచ్చుకొనవలయుననిగాని నా అభిప్రాయము కాదు – అట్లు నిలుపుకొను పక్షమున సాఫల్యానికి పండ్రెండు మాసాలు చాలును. ఇక నా అభిప్రాయ మేమన, 'నాకు కావలయునదిదియే' అను నిశ్చయము ఒక్కతూరియైనను నిన్ను పైకొను నేని (కలిగెనేని) అది నీ జీవితముపై వేసిన అధికారముద్రయే యగును....''

7. "ఎట్టి మూల్యము చెల్లించి యైనను సూటిగా ముందుకు పోవుటకే నిర్ణయించుకొని, అన్ని కష్టములను సహింతువేని, దౌర్బల్య

మునకు తావీయక అన్ని చేదులను మ్రింగుదువేని, నీ కెన్నో చిక్కులు తప్పిపోవును."

8. "నిర్భయుడవై, కృతనిశ్చయుడవై యుండుము. అప్పుడు అవరోధము లన్నియు అంతలోనే కరిగిపోవును."

—మాతృశ్రీ

వివరణము :— పై దంతా శ్రీ అరవిందుని అనుభవ వాక్యముపై అమ్మ అనుభవ వ్యాఖ్యానము. ఈ వ్యాఖ్యానము చదువుతుంటే అంతవరకు మసకగా వున్న అనేక అర్థాలు విడిపోయి ప్రకాశము లభించింది. అమ్మ తన అనుభవమునుండి విషయమును ఎంత విశదముగా చెప్ప గలరంటే, వేరే గురువు అవసరము లేదనిపిస్తుంది.

భగవంతుడు ఎన్నిక చేయడమంటే, మనకేదో అర్థము గోచరి స్తుంది. అతనిపట్ల భగవంతుడు ఎలావ్యవహరిస్తాడో మనకుతెలియదు. కాని అమ్మ ఏమి చెప్పారు? అతనిని గట్టిగా పట్టుకుని జారిపోనివ్వడు భగవంతుడు (పేరా1) —అని అమ్మ ఆవిష్కరించి చెప్పారు. అహో, ఇదా వరించడములోని ఆంతర్యము——అనిపించింది. చదివినపుడు మనకు తెలియని ఈ లక్షణము అమ్మ ఎలా గుర్తించారు? అమ్మేగదా వరించి నడిపించేది, లేక మనము వరించిన పిమ్మట నడిపించేది!

సంవరణము యొక్క మరొక పార్శ్వము ఎన్నికలో ముహూర్త భావము కూడ ఇమిడిఉంది (పేరా౬). భగవంతుడు ఎన్నిక చేశాడంటే, సంసిద్ధి లక్ష్మితో మన వివాహానికి ముహూర్తము నిర్ణయించినట్లే. అమ్మ చెప్పేవరకు ఇదికూడ మనకు స్పష్టముగా స్ఫురించదు. ఇలాముహూర్తము

నిశ్చయింప బడినందు చేత సంసిద్ధి నిశ్చయమనే భావము సాధకుని హృదయములో ఉంటుంది.

భగవంతుడు వరించడం నిజముగా మహాభాగ్యం. కాని వరించాడో, లేదో ఎలాగుర్తించాలి? శ్రీ తల్లిగారే రెండు మూడు లక్షణములను పేర్కొంటున్నారు: 1. భగవంతుని కొరకు ఒకసారి అయినా గాఢమైన ప్రేరణ ఉద్భూతమయితే (పేరా 4), 2. నాకు 'కావలయున దిదియే' అను బలీయమగు నిశ్చయము ఒక మెరపుగా నయినా నీలో స్ఫురించితే, అవి భగవంతుని ఎన్నికకు గురుతులని అమ్మ సాక్షాదనుభవముతో చెపుతున్నారు. అయితే ఈగురుతుల స్వభావము నిర్ణయించే విషయములో మనమెంతో జాగ్రత్తగా వివేచన చేయవలసి ఉంటుంది.

ఉదాహరణకు మీ విషయమే తీసుకుందాము. మీరు వ్రాసిన ఒక లేఖలో— 'నాముందు గతి మందగతే కావచ్చు. నాకునిరుత్సాహము లేదు. ఎప్పటికైనా అమ్మను చేరుకోగలననే నమ్మకముంది' అనేమాటలను గాక, అర్థమును వ్రాశారు. ఇట్టి అంతర్విశ్వాసము, నిశ్చయము కూడ భగవంతుని వరణమునకే చిహ్నములని అమ్మ వ్యాఖ్యానించారు (పేరా 1).

పైగా, భగవంతుడు మీరాశ్రమానికి వెళ్లాలని అభిలషించడం చేతనే, మీరు ఆశ్రమానికి వెళ్లాలని అభిలషించారని, ఆవిధముగానే ఈనాడు మీరు, మీసహవాసులు ఆశ్రమములో సాధకులు గావడం తటస్థించినదని అమ్మ వివరించారు (పేరా 3). అమ్మ పై వాక్యను మీకు అందించుతూ, మీభాగ్యమును అభినందించుతున్నాను. అమ్మ మిమ్ము విస్మరించదు, విడిచిపెట్టదు.

"శ్రీఅరవింద యోగములో ఉత్సాహానికి, శాంతికి విరోధము లేదు. పైగా శాంతి ఉత్సాహానికి ఆధారము. ఇది శ్రీఅరవిందాశ్రమానికి ఒక విలక్షణ స్వరూపము. కనుక మీ ఉత్సాహములో శాంతినికూడ అనుభవిస్తున్నారనే ఆశింతును."

## దివ్యప్రేమకు మార్గము

1. తన తీవ్రతాభరముతో, ఉద్దండ శక్తితో దివ్యప్రేమ ఇక్కడే ఉన్నది, కాని దాని జ్ఞప్తి ఎవరికున్నది ? పెక్కుమందికి దాని స్పర్శయేలేదు. వారి గ్రహణ సామర్థ్యమెంతో, కేవలము అంతే వారి అనుభవమునకు వచ్చును.

2. ఎంత విడ్డూరమో ఇంచుక ఊహించుకొనుము ; అణువణువున దివ్యప్రేమతో స్పందించుచున్న వాతావరణములో నీవు స్నానము చేయుచున్నావనిన స్నానము చేయుచున్నావు. అయితే ఆవిషయమే నీ వెరుగవు ; కొన్నిసార్లు, చాల అరుదుగా, కొన్నిక్షణాలు మాత్రము ఏదియో నీకుతగులగా— 'దివ్యప్రేమను చూరగొన్నాను' అని అందువు. కాని అది దివ్యప్రేమ ఎంతమాత్రమునుగాదు. ఒకొకప్పుడు సూదిమొనయంతమాత్రమే నీ చేతన తెరచుకొనగా, ఆ సందునుంచే ఆ ప్రేమ సహసా నీలోనికి దుమికియుండును. ప్రేమ వాతావరణము సజీవ సక్రియమగుటయే దానికి కారణము. ఎక్కడెక్కడ ఇంచుక ప్రవేశావకాశము లభించునో, అది పరుగున చొరబడును. (ఈ విధముగా నీవు పొందునది దివ్యప్రేమకాదు, దాని ఛాయలు మాత్రమే).

3. ఒక్క ప్రేమయేకాదు, దివ్యశక్తులన్నియు ఇక్కడే చుట్టును ఉన్నవి— అన్నియు, వాని పూర్ణతేజస్సుతో సుస్థిరముగా నున్నవి. నీవు వానిని స్వీకరించుటలేదు, అంతే. కారణము, నీద్వార ములు మూయబడి ఉన్నవి, నీ చుట్టును గోడలున్నవి. దాదాపు సమయ మంతయు నీ మనస్సు ఇతర వస్తువులచేతనిండియుండును.

4. దాదాపు ఎల్లపుడు నీవు నీచేతనే (నీ అహంచేతనే) నిండి ఉన్నావు. విశ్వమంతయు నీ అహంయొక్క క్రియగా మాత్రమే కన్పించును. నీవు కేంద్రమునందుండగా, విశ్వము నీచుట్టును తిరుగు నట్లుండును. నిన్ను నీవు నిశితముగా పరిశీలింతువేని, అది నీకల్లే కాన వచ్చును. నీ దృష్టికి, కేంద్రమునందు నీవు, నీచుట్టును విశ్వము. నీవు విశ్వమును గాంచుటలేదు. నిన్నే విశ్వములో చూచుకొనుచున్నావు. అట్టియెడ, నీవు నీతోనే నిండి ఉందువుకాన, నీలో భగవంతున కవకాశ మెక్కడ ?

5. కాని అతడు అన్నివేళలు అక్కడే ఉండును.

6. అక్కడే నిన్ను చుట్టియున్న ఆ అద్భుత వస్తువుల మాటే మిటి ? నీవు వానిని గనుచున్నావా ? ఎపుడో, ఒక క్షణము వాని మెరపు నీకంటబడవచ్చును, వానిని నీవు ఇంచుక చూచి, స్పృశింప వచ్చును. నీ స్వీకరణ ప్రయత్నము ఇంచుక పాటున బడినపుడుగాని, క్షుద్రవిషయాలు అంతసంకులముగా నుండని నిద్రావస్థయందుగాని అది సంభవించును. కాని సామాన్యముగా, నీవు లేచినతోడనే అదంతయు తుడిచివేయబడును. అంచులవరకు తనతోనే నిండియున్న భయానకమగు అహంచేత తుడిచివేయబడును.

7. మున్ముందు నీవు నీఅహంనుంచి బైటపడవలయును. అపుడు ఇంచుక పై స్థానమునుంచి వస్తువులను, విషయములను యథాతథముగా చూడనారంభింతువు. ఇక వస్తువులను యథాతథముగా చూచుటకు నీవు కేవలము అద్దమువలె ఉండుటవసరము— నిశ్చల నీరవముగా, శాంతి మయముగా, నిష్పక్షపాతముగా, ప్రత్యేకాభిరుచులు లేకుండ, పూర్ణ గ్రహణ శీలతతోనుండుటవసరము. అటులున్నచో, నీ దరిదాపుననే ఉన్నను ఇంతదనుక నీకు జాడతెలియని అనేకశక్తులు నీలో పనిజేయ ప్రారంభించుచున్నవని చూడగలవు. అపుడు నీవు ఆశక్తులమధ్య మసలుకోగలవు, విశాల విశ్వములో ఒక అనామక బిందు మాత్రమైన అహంలో అడగి యుండవు.

8. ప్రశ్న: అహంనుంచి బైటబడుటకు ఎట్టి వైఖరి అవలంబించవలెను ?

సమాధానము : దానిని వైఖరి అనుటకంటె, సంకల్పమనుట సమంజసము; అందుకొరకు సంకల్పశక్తిని వినియోగించవలెను. దీనికి నిశ్చితమగు సాధనము భగవంతునికి ఆత్మ నివేదనము గావించుకొనుటే. నీవు భగవంతుని క్రిందికి లాగరాదు. భగవంతునికి నిన్ను నీవు నివేదించుకొనవలెను. అప్పుడు గాని నీనుంచి నీవు ఇంచుక బైటికిరాకతప్పదు.

9. భగవంతుని తలపు గలిగినపుడు, మానవులతనిని సాధ్య మైనంత తమ దెసకు లాగజూతురు. అదేవారు చేయు మొదటి పని, అదే వారి దౌర్భాగ్యము. దాని వలన తరచు వారికేమియు లభింపదు గాన — "నేను పిలిచితిని, ప్రార్థించితిని, సమాధానము లేదు. కొంచెము కూడ దిగి రాలేదు" అని మూల్గుదురు. కాని "నిన్ను నీవు నివేదించు

కొంటివా?" అని అడిగిన – "లేదు, నేలాగితిని," అని జవాబు వచ్చును. ఔను, అందుచేతనే ఏమియు రాలేదు.

10. నిజానికి, ఏమియు రాలేదనుట సరికాదు. నీవు లాగునపుడు నీ అహంకారములో మూయబడి ఉందువు; నీకును, నీవు స్వీకరించ వలసిన దానికిని మధ్య ఒక అడ్డుగోడ ఏర్పడినంతగా మూయబడి ఉందువు. కారాగారములో బంధించుకొని, అక్కడ ఏమియు కానలేక పోవుచున్నానని ఆశ్చర్యపడుదువు.

11. అది కారాగారమే, పైగా ఆ కారాగారానికి కిటికీలు కూడ లేవు.

12. నిన్ను నీవు బైటకు త్రోసివేసికొనుము, ఏమియు దిగ బెట్టకుండ నివేదించుకొనుము, నివేదనయందలి సహజానందము కొరకే నివేదించుకొనుము. అపుడు మాత్రమే కొంత అపూర్వము ననుభవించు టకు అవకాశముండును.

—మాతృశ్రీ

పరిశీలన :– తనకోపము తనకు శత్రువని మనకు తెలుసు. కాని తనే తనకు శత్రువని మనకు తెలియదు, తెలిసినా అంతగా తెలి యదు. ఎంతగా ? అమ్మకు తెలిసినంతగా. ఈ విషయము తెలిసికోవడం పైనే మన ఆధ్యాత్మిక భవిష్యత్తు అంతా ఆధార పడి ఉంది. అది ఎలాగో చూద్దాము.

భగవంతుడు, అతని శక్తులు ఎక్కడో లేవు. ఇక్కడే ఉన్నాయి. నిజానికి మనము భగవంతునిలోనే ఉన్నాము. భగవత్సాగరము యొక్క

ప్రేమతరంగాలు అనుక్షణము మనను గట్టిగా తాకుతూనే ఉన్నయి. కాని తదనుభూతి మనకు ఆవంతైనాలేదు. కారణం ? మన గూటిలో మనము నివసించు తున్నాము. ఈగూటికి ద్వారాలూ, కిటికీలూ లేవు సరిగదా, సూదిమొన అంతటి సూక్ష్మమగు సందుకూడలేదు. అయితే మనము చచ్చిపోవాలిగదా? అవును, చనిపోయే ఉన్నాము. ఆధ్యాత్మిక ముగా పూర్తిగా చనిపోయాము.

ఈగూటి విషయము కొంచెమువిచారించుదాము. దాదాపుఅన్నివేళలా మన మనస్సు ఇతర విషయాలలోమునిగి తేలుతూ ఉంటుంది. ఇతర విష యాలుమనస్సులోనిండి ఉంటాయి (పేరా 3). ఈవిషయ చింతన ముదిరిన కొలది, అది పర్వత ప్రాయమై దివ్య ప్రేమ కిరణమును కూడ లోన ప్రవేశింపనివ్వదు. కనుక విషయోన్ముఖత్వము, భగవద్విముఖత్వము— ఇదియే మనగూటి స్వరూపం.

మహాత్ములుకూడ ప్రాపంచిక విషయాలు చింతించుతారుగదా. నిజమే, కాని తమ కొరకు గాదు. ఇక మనము, మన కొరకు, మన అంతస్తు నుంచి చింతించుతాము. అదీ అంతరము. అందు చేత పైన 'ఇతర విషయాలతో' అని అన్నప్పటికీ, నిజానికి అవి మన విషయాలే, మన అహంకు సంబంధించిన విషయాలే. అందుచేత మనము మన విషయాలతోనే ఉక్కిరి బిక్కిరి అవుతున్నాము. ఇక ఈ అహం ప్రపంచ మంతా తన కొరకే ప్రవర్తించుతున్నట్లూ, తానే ప్రపంచానికి కేంద్రమైనట్లు భ్రమిస్తుంది. తననే ప్రపంచములో చూచుకుంటుంది: (పేరా 4). ప్రతిదీ తనకొరకే ప్రతిది తానే. ఇలాచివరకు మనము పూర్తిగా మనచేతనే, అహంచేతనే నిండి ఉన్నాము. కనుక ఈ అహం నుండి బైటపడాలి (పేరా 7). భగవత్ప్రేమను ఇంచుక చవిచూచినపుడు

ఈ బైటపడడ మెలా ఉంటుందో, దానికి దారి ఏదో మనము సూచ నగా చూడగలము. అదే మనకు ఏడుగడ.

28—7—72 —మాతృశ్రీ

## పరిపూర్ణ సమర్పణ

భగవంతునికి సమగ్రమముగా ఆత్మనివేదన గావించుకోడానికి మూడు మూల విధానములు :

1. నిర్మల నమ్రతాభావముతో అభిమానము నంతటిని విడిచి అతని పాదపద్మములకడ ప్రణమిల్లుట.

2. సమస్త సత్తను ఆయనముందు సమర్పించి, పుస్తకమువలె దానిని ఆపాదమస్తకము తెరచిపెట్టి, తమ వృత్తులు స్పష్టముగా కన్పించునట్లు, వివిధ కేంద్రములను పరుపువలె పరచి ఉంచుట. ఇందు నిమిత్తము ఎట్టి కువృత్తిగాని దాగిఉండడానికి అవకాశమివ్వని అశేష చిత్తశుద్ధి అత్యవసరం.

3. ప్రేమతోకూడిన పరిపూర్ణమగు నమ్మికతో అతని ఉత్సంగము (ఒడి)లో వెచ్చగా విశ్రమించి, అతనిలో కరగిపోవుట.

ఈ పై మూడు క్రియలకు ఫలితముగా క్రింది ఈ మూడు సూత్రములు వెలువడవచ్చును, లేదా, అందులో ఒకటి, రెండు :

1. నా ఇచ్ఛగాదు, నీ ఇచ్ఛయే నెరవేరుగాక !

2. నీవు ఇచ్ఛించినట్లే ప్రభూ ! నీవు ఇచ్ఛించినట్లే !

3. నేను శాశ్వతముగా నీవాడను (నీదానను).

సాధారణముగా చెప్పాలంటే, ఈ క్రియలు సరిగా నిర్వహించబడినపుడు పరిపూర్ణ తాదాత్మ్యం సిద్ధించి, అహంకారము అంతరించి పరమసుఖము ప్రకటితమగును.

1957 లేక 67 — మాతృశ్రీ

1. పరిశీలన : 1వ విధానములో అభిమానము లేకపోయినా, తాను వేరు, తండ్రి (భగవంతుడు) వేరు— అనే భావముంటుంది. 2 వ విధానములో వేరుగానున్న తన వెలుగుకోణములతో పాటు, చీకటి కోణములను కూడ విప్పి ఉంచుతాడు. ఆ తెరపిలోనికి భగవంతుడుదిగి తాదాత్మ్యమును ప్రసాదించడంచేత అహంకారము హరించుకుపోతుంది. తత్ఫలితముగా ఆనందానుభూతి అవిచ్ఛిన్నముగా ఉప్పొంగుతుంది.

2. ఈ మూడు ప్రక్రియలకు ఆధారము విశ్వాసము మాత్రమే కాదు; అనుభవమే ఇక్కడ ప్రధానంగా ఆధారము. 'తెరచిపెట్టి' 'పరచి ఉంచుట' ఇవి భగవదనుభవమును సూచించును. శీతకాలములో మన శరీరమును సూర్యకాంతికి తెరచి పెట్టుదుము. అలాగే ఇక్కడ సమస్తమును భగవంతునికి తెరచి పెట్టుతున్నాడు సాధకుడు. మూడవ ప్రక్రియలోని 'వెచ్చగా విశ్రమించి' కూడ అనుభవమును మరింత స్పష్టముగా జెప్పుతున్నది. అది అనుభవము కాబట్టే పరిపూర్ణముగా నమ్ముతున్నాడు.

తండ్రి అనే అనుభవము ఉన్నప్పుడే గదా పిల్లడు తనకేఆపద ఉండదని తండ్రి ఉత్సంగములో ప్రేమతో పరిపూర్ణముగా నమ్మి విశ్రమిస్తాడు.

3. క్రిందటి, అనగా 1972 ఫిబ్రవరి, యేప్రిల్ 'బులెటీన్' సంచికలలో కూడ అమ్మ శరీరచేతన సమర్పణం వివరింపబడింది. 'నాకు మరణమైనా, జీవితమైనా, నీవు ఇచ్ఛించినట్లే. నీవు ఇచ్ఛించినట్లే – నేను శాశ్వతముగా నీ దానను' అని అమ్మ శరీరము విన్నవించుకుంది. అంటే తన సమర్పణా ఫలితముగా సందేశములోని సూత్రవాక్యములు మూడు అమ్మ శరీరచేతన నుండి అప్రయత్నముగా వెలువడినాయి. అమ్మ సహజవాక్యాలు మనకు సూత్ర వాక్యాలు. అట్టి సమర్పణ ఉన్నపుడే శరీర పరివర్తనము సాధ్యం.

4. శ్రీ అరవిందుని ప్రథమ దర్శన సమయమందే మాతృశ్రీ, తాను అంతకు పూర్వము నేర్చినదంతా తుడిచివేసి, తననుతాను తన ప్రభువు, శ్రీ అరవిందునికి అశేషముగా అర్పించివేసుకున్నారు. దానికి శ్రీ అరవిందుడుకూడ అచ్చెరువొంది—— 'ఇట్టి సంపూర్ణ సమర్పణము నే నెక్కడ గాంచలేదు ! ' అని పలికారు.

5. అమ్మ సమర్పణయొక్క మూర్తీభావము, సమర్పణయొక్క అవతారము అంటే అది అతిశయోక్తిగాదు.

6. దీనికి నిగూఢకారణముకూడ లేకపోలేదు. అమ్మరూపం శక్తి అయితే అరవిందుని రూపం సత్త. ఇక శక్తి ఎల్లపుడు సత్తను ఆశ్రయించి ఉంటుంది. కనుకనే నిర్మలమగు శక్తికి తాదాత్మ్యము, సమర్పణము అతిసహజము.

7. మనమందరము ఆపరాశక్తి రూపాలమే — 'పరాశక్తిః జీవభూతా' అని గీత, మన అంతరాత్మ ఆ పరాశక్తి సాక్షాద్రూపము అని ప్రకటించుచున్నది. మనము అంతరాత్మస్థితులమైనపుడు, అమ్మకువలె మనకుకూడ సమర్పణ సహజమవుతుంది.

8. 2వ పేరాలో భగవంతుడు (సాధ్యమయినంతవరకు) అనుభవానికి వచ్చిన భగవంతునికి సమర్పణ అని చెప్పుతున్నాముగాదూ. అయితే మనకు ఆ అనుభవము సాధ్యమా?— అనే శంక కలుగవచ్చు. అది సాక్షాత్తు భగవదనుభవము కాకపోవచ్చు. అది సాధారణ స్థితికి కొంతపైనున్న స్థిత్యనుభవము. పై స్థితికి సమర్పణ చేసుకుంటూ పోతే, చివరకు భగవదనుభవము కలుగుతుంది.

9. మనస్సు సమత సాధించాలంటే రెండు పద్ధతులు:ఒకటి అది అడగిపోవాలి. నిష్క్రియ స్థితిలో ఉండే సమత అది. సాంప్రదాయ సాధనలో అలాజీవితమును సాధ్యమైనంతవరకు వర్జించి, సన్యసించి సమతను సాధించారు. ఇక రెండవపద్ధతి: ఇచ్చట మనస్సుతోపాటు సమస్తసత్తను భగవంతునికి అర్పించుతాము. భగవంతుడే మనద్వారా వ్యవహరిస్తాడు. కర్తృత్వము మనదిగాదు గావున, అపుడు కర్మ సమతను చెరుపదు. అంటే సమర్పణా పద్ధతిలో సమతా ఉంటుంది, జీవితమూ ఉంటుంది. ఆజీవితము భాగవత జీవితము ! ఇప్పుడు మనకు తెలియవస్తోంది సమర్పణ యొక్క విశిష్టత, దివ్యత.

# చైత్యీకరణ రహస్యము
## ( Psychicisation )

1. సత్తా కేంద్రమగు అంతరాత్మను (Psychic being)ఆశ్రయించి, సమస్త సత్తా దానితో ఏకీభూతము కావాలి ; అదే పరిపూర్ణముగా చిత్త శుద్ధి సిద్ధించడానికి ప్రధాన నియమము.

21-2-72 —మాతృశ్రీ.

2. విషాదమునకు లోనగునది అహంకారమే.

ఆ విషాదమును లక్ష్యపెట్టకుము. ప్రశాంతముగా పనిలో వ్యాపృతుడవై ఉండుము. అపుడు దానికదే అంతరించును.

18-8-1971 — మాతృశ్రీ.

3. నీ అంతరాత్మలో సంయోగమును స్థాపించుకోడానికే నీవిక్కడున్నావు. అందుకే నీవు జీవించుచున్నావు.

ఒకవైపున పట్టువిడువక ఆకాంక్షించుతూ, మరొకవైపున మనస్సును శమింపజేయ ప్రయత్నింపుము.

(అపుడే) ఆకాంక్ష హృదయతలమునుండి ఉద్గమించగలదు. అది ఎంతో ఆవశ్యకము.

11-6-1971 —మాతృశ్రీ.

4. నాప్రేమ, నా అనుగ్రహము, నా ఆశీస్సులు అన్నీ నీకు గలవు.

కాని వాటిని ఆస్వాదించి, అనుభవించాలంటే, నీయందు క్రమశిక్షణ, సావధానము ఏకాగ్రత తప్పక అవసరము; విశేషించి ఏ కోర్కెలకు, ఏ మోహములకు నీవు చెవియొగ్గరాదు.

16-6-1971 —మాతృశ్రీ.

5. కల్పనలన్నీ ప్రాణవృత్తులే. అవి అత్యంత అవాంఛనీయములు.

స్వేచ్ఛకు అర్థం కోర్కెలవెంట పరుగులుపెట్టడంకాదు, వాటినుండి విముక్తము గావడమే !

28-8-1971 —మాతృశ్రీ.

6. సమస్యయొక్క నీకు సంబంధించిన పార్శ్వమునే నీవుచూతువు. కాని జ్ఞానమును విస్తృతపరుప గోరుదువేని, నిష్పక్షపాతముగా అన్ని పార్శ్వములనుంచీ దానిని పరికించడ మవసరం. ఈ విశాలవైఖరిలో మహాప్రయోజనములు ఉన్నవని క్రమముగా నీవు గాంచగలవు.

17-9-1971 —మాతృశ్రీ

7. వినమ్రత, సత్యత (Sincerity): ఇవి ఉత్తమోత్తమ రక్షణలు. తద్రహితమైనపుడు ప్రతి పదము ఒక ప్రమాదమే; తత్సహితమైనపుడు విజయము తథ్యము. తప్పనిసరియగు అహంకార విలయమునకు సునిశ్చిత మార్గము వినమ్రతయే!

—మాతృశ్రీ

8. మనకు తెలిసిన మానవవిజ్ఞత జటిలతకు మారుపేరు. దానికి పైన భగవదనుగ్రహము యొక్క ప్రకాశమయ సరళత విరాజిల్లుతున్నది. మనము అవకాశ మిచ్చినదే తడవుగా, అది దిగి పనిచేయడానికి సిద్ధముగా ఉన్నది.

—మాతృశ్రీ

## మాతృశ్రీ ఇటీవలి ప్రవచనములు

1. మన వ్యక్తిగతజీవితానికి మూలహేతువు భగవంతుని కనుగొని ఆయనలో ఏకము కావడముచేత కలిగే ఆనంద సందోహమే.

22–8–71

వ్యాఖ్య :– భగవంతునితో ఏకము కావడంచేత కలిగే ఆనందాపేక్షయే మనవ్యక్తిగత జీవితానికి మూలహేతువు.

2. సౌఖ్యము నపేక్షించి జీవించకు. భగవంతుని సేవించడానికే జీవించు. అపుడు నీవు ఆశించినదానికి మించిన ఆనందమును అనుభవించుతావు.

28–12–71

3. అహంను వదిలించుకున్నపుడే నీవు ముక్తపురుషుడవు కాగలవు. అహంను వదిలించుకోవాలంటే, నీవు భగవంతుని వాడవు మాత్రమే కావాలి.

3–12–71

4. క్షణమాత్రం భగవంతునితో పొందిన సచేతన సంసర్గము ఎంతటి బలీయమైన ప్రతిరోధమునైనా విచ్ఛిన్నము చేసివేయగలదు.

18–12–71

4. భగవత్సన్నిధిలేని జీవనము దుర్భరమనిపించే ఘడియ ఎప్పుడో వస్తుంది. అపుడు అశేషముగా భగవంతునికి ఆత్మార్పణ గావించుకొనుము, విడివడి వెలుగులో అడుగిడుము.

17–12–71

6. మౌనమునందే నీవు అత్యధికముగా గ్రహించగలవు. అంతేగాక అచల మౌనమునందే బృహత్తమక్రియ జరుగుచుండును.

భగవంతుడు మనల నుపయోగించుకొనేందుకు మౌనము నభ్యసింతుముగాక!

19–12–71

వ్యాఖ్య : 1వ ప్రవచనము జీవిత లక్ష్యమును చెప్తుతోంది. 2. ఆ లక్ష్య ప్రాప్తికి భగవంతుని సేవించాలి. లక్ష్యానికి అడ్డుగా ఉన్నది. అహం. 3. దానిని వదిలించుకోడానికి భగవంతునికి మాత్రమే చెంది, సేవించాలి. 4. భగవత్సంసర్గానికి అలాటి ప్రభావ ముంది. 5. 4నకు కావలసిన ఘడియ ఎపుడో నిశ్చయముగా వస్తుంది, వేచిఉండు. ఆ ఘడియను నిలబెట్టుకునేందుకు 6–లోని మౌనం.

# సంసిద్ధత

పరివర్తనమునకు అంతరంగమున సంసిద్ధముగా నున్నవారు ఎక్కడున్నను దానిని సాధించగలరు. ఇక అట్లు సిద్ధముగా లేనివారు ఏప్రదేశము నందున్నను దానిని సాధించజాలరు.

12-11-71 —మాతృశ్రీ

ఒక వివేచన :

పూర్తిగా సంసిద్ధమైన అంతరంగము గలవారు ఆపనిచేయ గలరు. ఇక ఏమాత్రము సిద్ధముగా లేనివారికి ఎక్కడున్నా ఒకటే. కాగా, మధ్యస్థముగా నున్నవారికి మంచి వాతావరణము మహాత్ముల సన్నిధి చక్కగా సాయపడతాయి. ఆమధ్యస్థముగా నున్నవారుకూడ అసలు విషయము మర్చిపోయి అధికార రాజకీయాలలో తగుల్కొన గూడదు. చేతనా పరివర్తనము సామాన్యులకు చాల మందగతిని మాత్రమే సాధ్యము. అందుచేత ప్రగతి, సాధనలో సంతోషము కన్పించక పోయే సరికి, తెలియకుండానే రాజకీయాలలో (ఆశ్రమ రాజకీయాలలో) అడుగుపెడతారు. అందుచేత మాతృశ్రీ సన్నిధిలాభము పొందాలంటే, ఓరిమి, పట్టుదల, ఆత్మవిమర్శ తప్పక కావాలి. అపుడు సాధన వేగ మును పుంజుకుంటుంది.

అమ్మశక్తి దూరానికికూడ ప్రసరించుతుంది, నిజమే. కాని .... .... ఇక్కడ శ్రీ అరవిందుడు చెప్పిన మాటే వినండి: "కాని, సాధన యొక్క చరమ దశలలో బాహ్యసన్నిధికూడ అవసరము. ఆవశ్యకము," అని శ్రీ అరవిందుడే వెలి బుచ్చారు. పైగా అమ్మకూడ—సాధనకు ఈ

ఆశ్రమము వంటి ప్రదేశము మరెక్కడలేదని చెప్పారు. కాని పైసందే శమును మన మీ మినహాయింపులతో అర్ధముచేసుకోవాలి.

## ఒకే మార్గము

ఒకే ఒక మార్గమున్నదని నాకధికాధికముగా దృఢపడుచున్నది. ....... అదృశ్యము చక్కని వినోదమును కల్గించును.(అదృశ్యమెట్టిది?) మనస్సుపై పీఠము పెట్టి కూర్చొనుము ! మనస్సుపై పీఠముపెట్టి కూర్చొనుము ! నిశ్చలముగా నుండుము. ఇదొక్కటే మార్గము. (ఇందుకొరకు) నీవు నీమనస్సుపై పీఠముపెట్టి కూర్చొనుము. (ఇక్కడ తల్లిగారు చిన్నచరుపు చరుచుచున్నారు.) నిశ్చలముగా నుండుము. ఇది నాకు ఒకశిశువు మనస్సు యొక్క శిరముపై కూర్చొని, అక్కడ ఆడు చున్న దృశ్యమును సదా స్మరింపజేయును. ఘనతవహించిన ఈ 'మట్టి' మనస్సు తాను లేకపోయిన పూటజరుగదని, తాను అంత ఘనుడనని భావించు కొనుచుండగా, రెండవ వైపున ఒక పిల్లవాడు దాని తలపై నెక్కి ఆడుచున్నాడు: ఇది మిక్కిలి వినోదకరము కాదూ!

—మాతృశ్రీ

ఒక పరిశీలన :

మనస్సు కాలము చెల్లిపోయింది. అది ఎన్నో ఘనవిజయాలు సాధించినప్పటికీ, ఇపుడు అది ప్రముఖము కాదు. దానిని మించిన మరొక చేతన ఇపుడు రంగములోనికి దిగినది. ఈ నూతన చేతనకు పూర్తి అవ కాశము లభించాలంటే, మనసు మాటాడ కూడదు. మెదల కూడదు.

అది నిశ్చల నీరవము కావాలి. నూతన చేతన ప్రతిష్ఠితము కావడానికి ఇదొక్కటే మార్గము.

అయితే మనస్సు అంత తేలికగా మాట వినదు. దానికి కొంత మర్దనము అవసరము. ఒక శిశువు దాని తలపై నెక్కి ఆడుకునే దృశ్యము ఈ మర్దనమునే చూపించును. ఆ శిశువు ఇపుడే ముందుకు వస్తున్న అంతరాత్మ.

ఇచ్చట ఒక కృష్ణలీల మనకు గుర్తు వచ్చును. గర్వించిన కాళియ నాగుని తలమీద ఆదివ్య శిశువు తాండవము గావించి, దాని మదమడచి, ఆ హ్రదమునుండి (ఈ తనువునుండి) దానిని తోలివేశాడు? ఇది ఒక రమణీయ సాదృశ్యం.

—›: O :‹—

# సమస్త జీవనము యోగమే

ఈ శీర్షిక శ్రీ అరవిందుడు మనకు అపూర్వంగా అందించిన మహా వాక్యం. అపూర్వము ఎందుచేతనంటే అది జీవితమును భగవన్మయము చేయగలదు. ఇంతటి మహత్తర వాక్యము అనుష్ఠించడం ఎంతో కష్టమని మనం భయపడడం సహజం. కాని తదనుష్ఠానానికి ఎంత సులభమైన ఉపాయాలు శ్రీమాతారవిందులు సూచిస్తూ ఉన్నారో ఈ ఆశ్వాసంలో మనం తెలుసుకొంటాము.

## సమస్తము నందు సుఖము

స్వీయ సుఖము, సంతృప్తి, భోగము, సంతోషము – వీనికొరకు తపనను విడనాడుము. పురోగతి నిమిత్తము పరితపింపుము; అది ఎట్టిదైనను, పురోగతికి దోహదము చేయు పక్షమున, దానిని స్వీకరించి, వెంటనే అపేక్షించిన పురోగతిని సాధింపుము.

నీవు చేయు సమస్తమునందును సుఖమును ఆస్వాదింప ప్రయత్నించుము. కాని సుఖము నిమిత్తము దేనిని చేయకుము. ఎపుడును ఉద్రేక పడకుము, నిరుత్సాహ పడకుము, ఆందోళన పడకుము. సర్వకాల సర్వావస్థలయందు నిశ్చలచిత్తుడవై నిలిచి యుండుము. అట్లు నిశ్చలుడవై నీ వింకను సాధించవలసిన పురోగతి పట్ల మెలుకువతో నుండి క్షణము కూడా వృథా పుచ్చక ముందునకు సాగిపొమ్ము.

స్థూల సంఘటనలకు విలువ పైకి కనుపించునది మాత్రమే యని ఎన్నడును భావింపకుము. బాహ్యేతరమగు దేనినో ప్రకటించుటకు ఒక వికృత ప్రయత్నమే ఆ సంఘటనలు, నీ బాహ్య బుద్ధికందని సత్యమును ప్రకటించుటకే ఆ సంఘటనలు.

ఇతరుల ప్రవర్తనను ఎంచకుము. వారట్లు ప్రవర్తించుటకు మూలమగు వారి స్వభావమును మార్చగలిగి నపుడు నీవు ఎంచుట కర్హుడవు. ఇక మార్చగలిగి నపుడు ఎంచుటెందుకు ? మార్చుము.

నీవేదైన చేయుము. కాని నీవేర్పరచుకొన్న లక్ష్యమును మాత్రము విస్మరించకుము :-

—మాతృశ్రీ

వివరణ :- చేతనా వికాసమే మన లక్ష్యము. క్షణము వృధా పుచ్చక చేతనా పథములో పురోగమించాలి మనము.

కష్టాలు, విమర్శలు, అవమానాలు - వీటి బాహ్య ఫలితము దుఃఖము, కాని అంతఃప్రయోజనము చేతనా వికాసానికి దోహదము చేయడం చేతనకు చేయూతనిచ్చి తద్వారా సత్యమును ప్రకటించును.

స్వార్థము చేతనా వికాసానికి సరిపడదు గాన, దానివి విడనాడుమని చెప్తున్నారు తల్లిగారు. సుఖము లేనిదే మానవుడు జీవించలేడు గదా! అయినప్పుడు స్వసుఖమును చూచుకొనకపోతే ఎలా? జీవితానికి స్వార్థపరమైన సుఖమే కావాలనే నియమము లేదు గదా!

మనముచేయు భగవత్కార్మయందు మనము సుఖము పొందవచ్చు.

అందుచేతనే— కర్మలో సంతోషము పొందుము. సంతోషము కొరకు కర్మ చేయకుము— అంటున్నారు అమ్మ.

## లక్ష్యమును ఏమరకుము

నీవు భుజించుటకుముందు, తీసికొనబోవు ఆహారము నీ లక్ష్యమగు మహాసాక్షాత్కారానికి నీవు చేయు కృషికి ఆవశ్యకమగు సారపదార్థమును ప్రసాదించగలదని ఏకాగ్రచిత్తముతో క్షణమాకాంక్షింపుము.

పరుండుటకు ముందు, నిద్ర నీ అలసటను కూడదీసి, నీమర్నాటి ప్రయాణమునకు నూతన తేజము నివ్వగలదని ఏకాగ్రభావముతో క్షణమాకాంక్షింపుము.

పనికి ఉపక్రమించుటకు ముందు, నీపని మహాసాక్షాత్కార మార్గములోని పురోగతికి పుష్టినివ్వగలదని నీ ఇచ్ఛాశక్తియందు మనసును క్షణమేకాగ్రపరుచుము.

నీవు మాటాడబోవు నపుడు, చిత్తమును క్షణమేకాగ్రపరచి, మాటలను లాగిపట్టి, అత్యంతము ఆవశ్యకమైన మాటలనే మాటాడుము, పురోగతికి అభ్యంతరకరమగు వానిని పరిహరింపుము.

ఒక్క మాటలో— నీ జీవిత ప్రయోజనమును మరియు గమ్యమును ఏ సందర్భములోనూ ఏమరకుము.

—మాతృశ్రీ

వ్యాఖ్యానము:— లక్ష్యమును ఎట్టిదశలోను విస్మరింపరాదని అమ్మ హెచ్చరించుతున్నారు. ఇదే హెచ్చరిక 'హితవచనాలు—1' చివరకూడ కానవచ్చును. ఇలా ఏమరకుండడానికే ప్రతి పనికిముందు గుర్తు తెచ్చుకోవాలి, ఇలా ఏమరకుండ ఉండడానికే స్వార్థమును పరిహరించాలి.

ఎంతమందికి అసలు లక్ష్యమనేది ఒకటున్నది ? ఉన్నవారు కూడ సూటిగా దానివైపుకు మరపులేకుండ అహరహము పయనించుచున్నారా ?

లక్ష్యము, దానిని సాధించాలనేదీక్ష, దీక్షకు దోహదముచేసే దైవానుగ్రహము—— ఈ మూడును ఉన్నపుడు నేడో, రేపో సంసిద్ధి తథ్యము—దీనికి మారుమాట లేనేలేదని శ్రీ అరవిందులంటారు.

## విమర్శను పాటింపుము

ఈ ప్రపంచమున మనమేపని ప్రారభించినను, అజ్ఞానదశనుండియు, అసంపూర్ణతాదశనుండియు దానిని ప్రారంభించు చున్నాము. మనము తప్పులు చేయుచునే ఒప్పును తెలిసికొనవలసి ఉన్నది. పొరపాటులకు పాల్పడుచునే, వానిని దిద్దుకొని సరియగు మార్గమును కనుగొనవలసి ఉన్నది. ఈ నియమమును తప్పించుకొన్న వారెవ్వరు ఇంతవరకు కన్పించలేదు. అందుచేత మన మన్నుల నుంచి అపేక్షించదగినది కేవలస్తోత్రముకాదు; సరిగాగాని, బాగుగా గాని చేసిన దానికి

ప్రశంసను అపేక్షించుచునే, తప్పుగాగాని, పొరపాటుగాగాని చేసిన దాని యొక్క విమర్శనుకూడ కోరుకొనవలయును. ఎంత ఎక్కువగా విమర్శను సహించి మన తప్పులను గుర్తించ గలుగుదుమో, అంతఅధికముగా మనశక్తి సామర్థ్యములను పెంపొందించ గలుగుదుము. అల్పవయస్కులమైనపుడు——అంటేవ్యక్తత రాక పూర్వము —— దోషరహితమగు కార్యము కావించుట సులభము కాదు.

ఇతరులతో పోల్చుకొను ప్రవృత్తి ఉన్నది. అది అపేక్షణీయము కాదు. ఏలన, ప్రతివానికి తాను నేర్వవలసిన ప్రత్యేక విషయము లున్నవి. చేయవలసిన ప్రత్యేక కార్యము లున్నవి. అతడు తన విషయములనే చూచుకొన దగునుగాని, ఇతరులు తనకంటే న్యూనాధికముగా సాధించిన పురోగతినిగాదు. ఒకవేళ తాను వెనుకబడి ఉన్నను, ముందుముందు తన పూర్ణసామర్థ్యముతో పుష్పించు సమయము వచ్చును. అట్టి భావిపరిపూర్ణతను లక్షించియే అతడు పరిశ్రమింప వలయును.

....చేసిన విమర్శలను, చూపిన దోషములను సంతోషముతో స్వీకరింప నేర్చుకొనుము. ఎంతెంత ఇది నీకు అబ్బునో, అంతంత శీఘ్రముగా పురోగమింతువు——శ్రీఅరవిందులు.

వ్యాఖ్యానము :— 'అల్పవయస్కులము'— మన మందరము అల్పవయస్కులమే. మనకు వ్యక్తత రాలేదు ఇంకను, మన వ్యక్తిత్వము ఇప్పటికి బాల్యదశలోనే ఉన్నది. అంతరాత్మ ముందుకు వచ్చినపుడే, మనవ్యక్తిత్వమునకు వ్యక్తత సమకూడును.

ఆత్మ విమర్శ సర్వదా స్వయముగా జరుగుచునే ఉండును. పరులు చేసే విమర్శను సహించలేము సరే; ఆత్మవిమర్శను కూడ సహించ లేక,

పాటించక, ఆత్మ వంచనకు పూనుకొందుము. ఇది మిక్కిలి అన్యాయము. పైగా, పర విమర్శకు ప్రేరణ ఈర్ష్యాసూయలు కావచ్చు. అందుచేత అది తరచు తిరస్కరణీయము కావచ్చు. కాని ఆత్మవిమర్శ మన శ్రేయమునే తెలుపును. అందుచేత ఆత్మ విమర్శను—అంటే, మన అంతరాత్మ ప్రబోధమును — ఆదరించి పాటించుట శ్రేయోదాయకము.

మనకంటె ఎక్కువ వ్యక్తత గలవారుగాని, భిన్నప్రకృతి గలవారుగాని అవలంబించు యోగసాధనలు మనకు శ్రుతి మించినవికావచ్చు, లేక సరిపడనివి కావచ్చు. అందుచేత స్వసామర్థ్యమును బట్టి, స్వీయ ధర్మమును బట్టి ప్రయత్నము సలిపినపుడే మొత్తము మీద త్వరగా పురోగతిని సాధించ గలుగుదుము.

15-7-72

## ఆహారము - 1

జీవించుటకు తినుము, కాని తినుటకు జీవించకుము.

ఆశీస్సులు

9-9-72 — మాతృశ్రీ

వ్యాఖ్య :- భూలోకము (స్వర్గమువలే), భోగభూమి కాదు, యోగభూమి. అందువలన ఆహారము శరీర పోషణానికి, శరీరము యోగ సాధనానికి. కాని మనమేమి చేస్తున్నాము? శరీరమును

భోగసాధన గావించి, ఆహారమును, తదితరమును భోగముగా స్వీకరించుచున్నాము. మానవుడు భగవంతుని ఎందుకు ప్రార్థించుచున్నాడు? తన ఆరోగ్యముకొరకు, తన ఐశ్వర్యము కొరకు, తన సౌఖ్యము కొరకు, అంటే, మానవునికి యోగము ద్వారా భగవంతుడు కావడ మిష్టము లేదు. తాను తానుగానే ఉండాలి. తన అవసరాలు, కామనలు భగవంతుడు పూరించాలి! భగద్భావము కొరకు జీవించడు (జీవించుట కొరకు తినడు). తన భావము కొరకే భగవంతుని ఉపయోగించుకుంటాడు (తినుటకే జీవిస్తాడు).

## ఆహారము - 2

తినుటకు ఉపక్రమించునపుడు ఇంచుక మనసును ఏకాగ్రపరచి ఆకాంక్షింపుము: నీవు సేవించుచున్న ఆహారము అవసరమగు సార పదార్థమును సమకూర్చవలయుననియు, ఆ పదార్థము మహాసాక్షాత్కారానికి నీవు సలుపు ప్రయత్నమునకు దృఢమగు పునాదిగా నెలకొనవలయుననియు ఆకాంక్షింపుము.

9-9-1972 —మాతృశ్రీ

జీవించడానికి మాత్రమే తినాలని 1-వ సందేశములో వక్కాణించారు తల్లిగారు. ఇది మరికొందరు కూడ చెప్పారు. శ్రీతల్లిగారు విశేషించి ఎలా తినాలో తెలియజేస్తున్నారు. 2-వ సందేశములో మనసుకు భౌతిక పదార్థములలో మార్పు తీసుకురాగల శక్తి కలదు. దీనికి మన మెరిగిన తార్కాణము 'విశ్వాస చికిత్స'. విశ్వాసము ద్వారానే రోగములను కుదర్చ గల ఒక చికిత్సా విధానమున్నది. "మంత్రే తీర్థే ద్విజే

దైవే దైవజ్ఞే బేషజే గురౌ, యాదృశీ భావనా యత్రసిద్ధిర్భవతి తాదృశీ' అని ఆర్ష విజ్ఞానము కూడ దీనిని చెప్పుతూనే ఉంది.

అయితే అట్టి మార్పుకొరకుమనస్సుఏమి చేయాలి?ఆకాంక్షించాలి, సంకల్పించాలి. అందుచేతనే అమ్మ ఆకాంక్ష పూర్వకముగా ఆహారము స్వీకరించుమని ఉపదేశించుచున్నారు.

'ప్రసాద విషయమును' గురించి 'మదర్ ఇండియాలో' వచ్చిన విషయము ఇచ్చట గమనింపనగును. ఒకపుడు శ్రీ తల్లిగారు 'ప్రసాద విధిని' (Soup-Ceremony) నిర్వహించారు. సమాధిలోనికి వెళ్లి, ఆసమాధి స్థితిలోనే ప్రక్కనున్న భాండములో నుంచి ఒక గరిటె సాంబారును ఒక కప్పులోవేసి, తాను స్వయముగా స్వీకరించి—ఇంచుక చవిచూచి–పిమ్మట శిష్యులకు ఇచ్చేవారట. కొంత కాలానికి దీనివలన అమ్మ ఆరోగ్యము దెబ్బతిన్నదట ! ఆహారమును పవిత్రము చేయు విధిలో అమ్మ అందులోని మాలిన్యమును, శిష్యుల దోషములను స్వీకరించే వారని మనము గ్రహించాలి. అందుచేతనే అమ్మకు ఆరోగ్య క్షతి.

ఆభాండముపై తన రెండు బాహువులను ముందు ఒక నిమిషము సాచి, నిలిపి తర్వాత సూపును పంచేవారు. దాని ఆంతర్యము ? ఆ బాహువులను అలాపెట్టి శ్రీఅరవిందుని అతిమానస శక్తిని ఆభాండములోనికి ఆవాహనచేసేవారు. అది వారివల్లనే తెలిసింది. ఆ అతిమానస శక్తి ఆపదార్థము ద్వారా శిష్యులలో ప్రవేశించి వారి శరీర పరివర్తనమును సాధించుతుంది.

వారు ఉభయులు ఇంత చేస్తూ ఉన్నప్పటికి, శిష్యగణానికి

దాని పట్ల శ్రద్ధ క్షీణించిందట ! పైగా ఒకనాడు ఒక డాక్టరు శిష్యుడు, "ఇన్ని గంటలు పొయ్యిమీదిఉన్నఈ ఖాండములో ఏమి (ఆహార) విలువ ఉంటుంది?" అనికూడ అనాలోచితముగా అని వేశాడట ! అమ్మ దానికి 'అలాగా' అని మాత్రమని మౌనము ధరించారు. అంటే, ఒక మహత్తర ఆధ్యాత్మిక క్రియను బాహ్య దృషితో మాత్రమే చూచాడు ఆడాక్టరు మహాశయుడు. ఈ వివిధ తీవ్రకారణాలచేత శ్రీఅరవిందుడు ఆప్రసాద విధిని ఆపించివేశారు.

ప్రసాదము, ప్రసాదము—అని అంటూ ఉంటాము. ప్రసాదమంటే అది. మాలిన్యరహితము గావించి, శక్తిని పూరించి పెద్దలు, భగవంతుడు అందించే ఆహారము ప్రసాదమంటే.

ఈప్రసాదక్రియను మనము స్వయముగాకూడ కొంతసాధించుకోవచ్చు. ఎలా? అమ్మచెప్పిన విధముగా ఆకాంక్షాపూర్వముగా ఆహారమును స్వీకరించి, తర్వాత అమ్మ ఈసందేశములో చెప్పిన రీతిగా శ్రీమాతారవిందుల శక్తినికూడ, ఆహారములోనికి ఆవాహన జేసుకొని చివరకు, మనద్వారా వారే భుజించు తున్నారనే విశ్వాసముతోకూడ ఆహారము సేవించి, ఆకాంక్షకు, ఈ ఆవాహనను, ఈ విశ్వాసమును జోడించుకుందాము. అయితే ఈప్రవృత్తి మనస్సునకు క్లేశప్రదముగా నుండ గూడదు.

## స్వేచ్ఛ

ఇంతకూ స్వేచ్ఛ అనగానేమి? నీవు కోరినదాని నెల్ల చేయుచూ తిరుగుటయా? అయితే 'నీవు' అనగానేమో నీకు తెలియునా? అసలు

నీ ఇచ్ఛ ఏమియో నీ వెరుగుదువా? నీ నుండి ఏది వచ్చుచున్నదో, వెలుపలినుండి ఏది వచ్చుచున్నదో, నీకు ఆకళింపు గలదా? నీకు బలమైన యిచ్ఛయే ఉంటే, నిన్ను యథేచ్ఛగా వ్యవహరింప నిచ్చెడి దాననే; సరిగా అట్లే గావించెడి దానను. కాని నీ కదిలేదు. నిన్ను కదలించునవి కొన్ని ప్రేరణలు మాత్రమే. ఇక అవికూడ నీవిగావు. అవి వెలుపలినుంచి నీ చేత నానావిధములగు బుద్ధిలేని చేష్టలను చేయించును. నీవు రాక్షసుల చేతులలో కీలుబొమ్మవగుదువు. మొదట నీచేత తెలివి మాలిన పనులు చేయించి, తర్వాత నిన్నుజూచి నవ్వుకొందురు ఆ రాక్షసులు. నీకు ధృఢమగు ఇచ్ఛ ఉన్నపుడే, నీ యిచ్ఛ, నీ ప్రేరణలు, నీసమస్తము అంతరాత్మ కేంద్రమును ఆశ్రయించినపుడే, అపుడు – అపుడే, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ఇంచుక ఆస్వాదించగలవు. లేనిచో నీవు బానిసవే!

—మాతృశ్రీ

వ్యాఖ్య :- పరప్రేరణ తనకు తెలియకుండా తనలో ప్రవేశించి, తన మనస్సులో రూపొంది బహిర్గతము కావడము చేత అది తనదని మానవుడు మోసపోతున్నాడు. దాస్యమేదో, స్వాతంత్ర్యమేదో తెలియజాలని అజ్ఞానాంధకారములో నున్నాడు. మహా పండితులు, వైజ్ఞానికులు కూడ అంతే. ఏలన నిజమగు 'నేను' వారికి తెలియదు. ఆ నేనును, అంతరాత్మను ఆశ్రయించి, నిజముగా విముక్తులు గండని అమ్మ హెచ్చరించుతున్నారు.

## వాఙ్నియమములు

1. వాగ్వేగము శ్రుతిమించి విజృంభించుటకు నీవు అవకాశ

మివ్వరాదు. అనాలోచితముగా ఏదియు పలుకనురాదు. ఎల్లపుడు సచేతన నియంత్రణ గలిగి, అవసరము, సహాయకమునగు దానినే పలుక వలయును.

2. తర్కము, వివాదము, మిక్కిలి ఉత్తేజితమగు చర్చ—వీనిని పరిహరింపవలయును. వక్తవ్యమును కేవలము వచించి, అక్కడితో దానిని విడిచివేయుము. నీవు చెప్పినదే సరియని, ఇతరులది తప్పనే పట్టు పనికిరాదు. సత్య పరిశీలనకు సహాయపడు ఒక అంశముగానే నీవు చెప్పినది ఉద్దేశించబడవలయును.

3. నీ మాట స్థాయి, విధానముకూడ మిక్కిలి నిర్మలముగా, ప్రశాంతముగా, ఆగ్రహరహితముగా నుండునట్లు చూచుకొనుము.

4. ఇతరులు ఉద్ధతులై వివదించినను లక్ష్యపెట్టకుము, నిర్మలముగానుండి చలింపకుము. ఇక నీ వంతుగా తిరిగి విషయము ఉపశమించుటకు తోడ్పడుదానినే వచింపుము.

5. ఇతరులనుగురించి వ్యర్థ ప్రసంగము, తీవ్రవిమర్శ ........ వీనిలో పాల్గొనకుము. ఏలన, ఇవి ఎవ్విధముగానూ సాయపడకపోగా, చేతనను ఉన్నతస్థాయినుండి దిగలాగును.

6. ఇతరులను నొప్పించు, లేక గాయపరచునట్టి సమస్తమును పరిహరింపుము.

—శ్రీ అరవిందుడు.

వ్యాఖ్య : ఈ నియమాలు పాటించితే, సహచరులతో రాపిడులుండవు. క్రిందటి సందేశ వ్యాఖ్యలో చెప్పుకున్నట్లు, మాటయొక్క మూలమునుకూడ అనుసంధించగలుగుదుము. మాటలో మృదువుగా నున్నను, ఇతరులకు లోబడవలసినపనిలేదు. ఉద్వేగమువలన సంభాషణ తర్వాత వేధించే అశాంతి వేదన తప్పును, వాఙ్నియమము వలన. 2250



## ఏది దివ్యము ?

వస్తువుల సత్యముతోను, తత్వముతోను ఏది సంగతమై ఉండునో, ఏది మానవుల మధ్య ప్రేమను పెంపొందించునో, ఏది వ్యక్తి, రాష్ట్రము, జాతియొక్క బలవృద్ధికి అనుకూలించునో, అది దివ్యము ... మన ప్రేమ మనలను బలహీనులను, అంధులను, అవిజ్ఞులను జేయరాదు ; మన బలము మనలను కఠినము, దారుణము గావింపరాదు ; మన నియమములు మనలను ఆవేశపరులు లేక భావుకుల నొనరింపరాదు. ప్రశాంతముగా, ఓరిమితో, నిష్పక్షపాతముగా మనము ఆలోచింతుము గాక ! పూర్ణముగా, తీవ్రముగా, కాని వివేకయుక్తముగా మనము ప్రేమింతుము గాక ! జవముతో, సత్వముతో, ఉదాత్తతతో మనము కర్మ గావింతుము గాక ! అప్పుడు కూడ మనము తప్పులు చేయవచ్చును, భగవంతుడు మాత్రము తప్పుచేయడు. మనము ఒక నిశ్చయమునకు వచ్చి, కర్మకు దిగుదుము; అతడు దానికి ఫలమును నిర్ణయించును. ఇక అతడేది నిర్ణయించినను, అది మంచిదే యగును!

—శ్రీ అరవిందుడు

వివరణ :— భక్తి ఒక వస్తువు. అది సత్యము, మిథ్యకాదు. దానికొక తత్వము (స్వభావము) ఉన్నది. జ్ఞానము భక్తియొక్క ఈ సత్యమునుగాని, తత్వమును గాని నిరాకరించగూడదు. నిరాకరించితే అది దివ్యముకాదు. అట్లే ఇతర వస్తువుల విషయము కూడ. సంగతము = Consistent పొందు గలది. అనుకూలించి సమరసమై యుండునది. 'భగవంతుడు తప్పు చేయడు'—అనగా, మన తప్పునకు శిక్ష విధించడు. అది శిక్షయే అయితే అది అతని తప్పు అవుతుంది. ఆ తప్పునకు అతడు నిర్ణయించిన ఫలము కూడ మనకు మంచినే చేయును.

## భగవంతుని వాడవుకమ్ము

యోగమంటే భగవంతునితో సంపర్కము. ఆ సంపర్కమునకు మార్గము నివేదన. నిన్నునీవు భగవంతునికి నివేదించుకున్నపుడు—అది మార్గమేకాదు, ఆధారముకూడ అవుతుంది. ఆదిలో, జీవితానికి ఒకేసారి చేసివేసినట్లు, ఒక సామాన్యరీతిలో నీవు ఈ నివేదన గావింతువు. నీవు ఇలా అంటావు :

"నేను భగవంతుని సేవకుడను; నా జీవితము నిశ్శేషముగా భగవంతునికే సమర్పిత మయింది; నా సమస్తకృషి దివ్య జీవితమును సాధించడానికే".

కాని అది మొదటి అడుగు మాత్రమే. అది చాలదు. నీవు నిశ్చయ మయితే చేసుకున్నావు, నీ యావజ్జీవితము భగవంతునికే

అర్పించివేతునని నిర్ణయించుకున్నావు సరే; కాని దానినింకను ప్రతి క్షణమునందు స్మరించుకొని, జీవితముయొక్క ప్రతి చిన్న విషయము నందు పాటించడం మిగిలే ఉన్నది. ప్రతి పదమునందు నీవు భగవంతుని వాడవేననే భావము నీకుండాలి; నీవు ఏది తలంచినా, ఏదిచేసినా, దానియందు దైవచేతనయే నీద్వారా పనిచేస్తున్నది-అనే సంతతానుభూతి నీయందు నెలకొనాలి. 'నాది' అని చెప్పదగినది నీ యందింకెంత మాత్రము మిగిలిలేదు. ప్రతివస్తువు భగవంతునియందుండే వస్తున్న దని నీ కనుభవమగును; అప్పుడు దానిని తిరిగి తన మూలమునకే నీవు అర్పించవలసి ఉండును. అనుభవ పూర్వకముగా నీవిలా చేయగలిగి నపుడు, సాధారణముగా నీ వంతగా లక్ష్యపెట్టని, లేక జాగ్రత్త వహించని అత్యంత అల్పవస్తువైనా అల్పము, అర్థరహితము కాబోదు; అది అర్థసంభరితమై, నీముందు ఒక విశాల దృగ్వలయమును తెరిచి పెట్టును.

— మాతృశ్రీ, AIM : జనవరి, 1973

భగవంతుడు మననుంచి వేరు కాలేదు, మనమే భగవంతునినుంచి వేరుపడ్డాము : భగవచ్చేతనలో అంతా ఒకటే, మన చేతనలో మాత్రమే మనము మూలముతో సంపర్కము కోల్పోయాము. అలా కోల్పోవడం చేత మన దివ్యతను పోగొట్టుకొని దిక్కు తెలియక, దీనులమై పరిభ్రమించుతున్నాము. ఎంత దుర్దశ ! ఇట్టి మహావిపత్తును బాపగలసూటి ఉపాయం ?

నివేదన, ఆత్మ నివేదన. ఈ నివేదన మనకు సంపర్కమును కలిగించటమేకాదు, ఆ సంపర్కము నిలిచి ఉండడానికి ఆధారము కూడ అగును. ఏలన, నివేదన ఒక సంతత ప్రవాహము వంటిది. అది

అంతర్గతముగా కొనసాగినపుడే, దానినుంచి పోషణ రసమును గ్రహించుతూ సంపర్క వృక్షము వృద్ధినందగలదు—అని మాతృశ్రీ నివేదనా ప్రాముఖ్యమును ప్రస్తుతించారు.

ఈ నివేదనా వికాసమునందు కొంతవరకు మన ప్రయత్నము ఎక్కువగా అవసరమవుతుంది. అందుచేతనే 'నీవు భగవంతుని వాడవనే భావమునీకుండాలి'అనిచెప్పి, 'ఉండాలి' అనేపదముతో ప్రయత్నమును తెలియజేస్తున్నారు. అలా ఉన్నపుడు, భగవచ్ఛక్తి నీద్వారా పనిచేస్తున్నదని జ్ఞానము పొడముతుంది. తర్వాతిదశలో నాదని చెప్పదగినది ఇక మిగిలి ఉండదు. అటు పిమ్మట భగవచ్ఛక్తి మనద్వారా పనిచేయడం మాత్రమేకాదు, అసలు సమస్తము అక్కడినుంచే ప్రసరించుతోంది – అనే గంభీరానుభూతి కలుగ నారంభించుతుంది.

ఇపుడు నివేదనావలయములో ఒక్కదశ మాత్రమే మిగిలి ఉంది. ప్రతివస్తువు భగవంతునియందుండే వస్తున్నది గదా. అట్టి దానిని నీవు భగవంతునికే తిరిగి అర్పించాలి. ఇక్కడకూడ ప్రయత్నం కొంత అవసరం కాబట్టే 'అర్పించాలి' అంటున్నారు అమ్మ. ఈ దశలోకూడ మిగిలిఉన్న అహంకారావశేషము అలా భగవంతునినుంచి వచ్చిన దానిని తనకొరకే వినియోగించుకోవాలనే ప్రవృత్తిని కనపరుస్తుంది. ఈ ప్రయత్నమును కొనసాగనీయకుండా, భగవంతుని ప్రసారమును భగవంతునికే అర్పించివేసినపుడు, నివేదనావలయము పరిపూర్ణమవుతుంది. ఈ చరమదశలో నాదని చెప్పదగినది నష్టము గావడమే గాదు, నేనని వేరుగా చెప్పదగినది నిశ్శేషమవుతుంది.

ఈ దశనుంచీ కర్మయోగము దివ్యకర్మయోగ మవుతుంది. కర్మలను దేవుడే చేస్తూఉండగా, సమస్తము తిరిగి దేవునిలోనికే ప్రవహిస్తూ ఉండగా, ప్రతి చిన్నపనియందు భగవంతునితో సంపర్కము అనుకోని విధముగా విస్తరించుతుంది. ఈ దశలో "సమస్త జీవనము యోగమే(All life is yoga)"అనే వాక్య సత్యము మనకుఅనుభూతమవుతుంది. ఇదే దివ్యకర్మయోగములోని వైభవము !

--- : ---

# అంతరాత్మ సాధన

మనం ఇతరులతో ఘర్షణపడడమేకాదు, మనతో మనమే అంతకంటే ఎక్కువగా ఘర్షణపడతాం. దానికి కారణంమనమెవ్వరమో మనకు తెలియకపోవడమే, మన అంతరాత్మను గుర్తించకపోవడమే. అంతరాత్మను గుర్తించినప్పుడు మనలో శాంతి సామరస్యాలు వికాసం జెందడమేగాక ఆవికాసము అతి మానసావతరణమునకు ఆధారము కాగలదు. అట్టి అంతరాత్మసాధనకు కొన్నిముఖ్య విషయాలు ఈ ప్రకరణంలో మనకులభిస్తాయి. అంతరాత్మ కొక ఆకారమున్నదని కూడ మనం తెలుసుకోగలము.

మనము ఒకొకప్పుడు దూరముగా మనవలసి వస్తుంది. అప్పుడు ఉత్తరప్రత్యుత్తరాలే మనకున్న సంబంధము. కాని ఆ దూరము దగ్గరైతే ఎంత బాగుండును ! అని వాపోతాము. ఈ వాపోవడానికి కారణం, మనం ఎంత దూరముగా ఉన్నప్పటికీ, ఎంత సన్నిహితముగా కూడ ఉన్నామో !— అది మనకే తెలియదు.

మనలోని నిజమగు నేను అంతరాత్మ— అమ్మనుంచి వెలువడినదే కాని, విడివడలేదు. ప్రతివారి అంతరాత్మ అమ్మతో సంపర్కము కలిగేఉంది. కావున అమ్మ మనందరికి అనుసంధానము (link). అమ్మ ద్వారా మనము ఒకరినొకరు స్పృశించే ఉన్నాము ! ఇది సాన్నిహిత్యము మాత్రమే కాదు సంపర్కము, తాదాత్మ్యముకూడ. ఇప్పుడు చెప్పండి, మనము దూరముగా ఉన్నామో, దగ్గరగా ఉన్నామో. అంతరాత్మనుగురించిన స్వీయఅజ్ఞానమే మనలను ఇంత దూరము చేసింది. అంతేకాదు, ఒకొకప్పుడు మనమధ్య విరోధమునుకూడ తెచ్చిపెడుతోంది !

అంతరాత్మను గురించిన అజ్ఞానపర్యవసానము ఎంతభయానకం ! అజ్ఞానమువలన శరీరభావన, శరీరభావనచేత పరిమితత్వము, దీనిచే అసామర్థ్యము, తిరిగి ఈ అసామర్థ్యముచేత కోరిక. ఇక తీరని కోరిక చేత తీరని దుఃఖము. ఆనందమే జీవితరసముగావున, దుఃఖప్రచురమైన జీవితానికి మృత్యుప్రాప్తి: ఇదీ ఇప్పటి మన దుఃస్థితి ! ఈ దుఃస్థితికి మూలకారణమగు అంతరాత్మయొక్క అజ్ఞానమును ముమ్ముందుగా తొల గించి, అమరత్వమును కల్పించి, శక్తిని పూరించి అమర జీవనమును అభివ్యక్తము గావించడమే శ్రీ మాతారవిందులు దిగివచ్చి కావించుతున్న మహాత్కార్యము.

అంతరాత్మను తెలుసుకునేందుకు ఆ మహనీయులు ఆవిష్కరించిన మార్గమును ఇపుడు పరికించుదాము: మానవుడు బాహ్య మనః ప్రాణ శరీరాల్లో ఏదీకాదు. వాని సంఘాతముకూడ కాదు. బాహ్య సత్తవెనుక అంతః సత్త ఉన్నది. దీనినే ప్రచ్ఛన్న సత్త (Subliminal Being) అన్నారు శ్రీ అరవిందులు. దాగియున్న ఈ అంతః సత్త ద్వారం తెరచి అక్కడినుంచి వ్యవహరించ నేర్చుకోవాలి. ఈ అంతః సత్త బాహ్య సత్తతో పోల్చినపుడు మిక్కిలి విస్తృతము, శక్తిమంతము, తేజోమయము అయి ఉంటుంది. ఈ సత్తలో ప్రవేశించినపుడు మొదటి సారిగా విముక్తిని చవిచూడగలుగుతాము. ఇక్కడ ప్రవేశించగానే మన అజ్ఞానము ఎంతో హరించిపోతుంది.

తరువాత అంతః సత్తవెనుక— అంతః సత్తకుకూడ వెనుక— అంతరాత్మ (హృత్పురుషుడు, Psychic Being) ఉన్నది. ఈ అంతరాత్మయే నిజమైన మానవుడు. ఈ అంతరాత్మయొక్క ఉపరిభాగము ప్రకృతి సంపర్కముతో కొంత మలినమై ఉన్నా, దాని ఆంతర భాగము

ఎల్లప్పుడూ భగవత్సంపర్కము కలిగి ఉంటుంది. అందుచేత, నేనమ రుడ—ననే భావము ఈ అంతరాత్మలో అవిచ్ఛిన్న ధారగా కొనసాగు తూనే ఉంటుంది.

అంతః సత్తనుండి కూడ క్రమముగా వెనుకకు జరిగి అంతరాత్మతో మానవుడు ఐక్యము పొందినపుడు – అహో! నేనమరుడను–అనే సత్యము మొట్టమొదటిగా అతనికి కంటికికట్టినట్లు కన్పిస్తుంది. దీనితో నేను మర్త్యుడను – అనే అజ్ఞానము అడుగంటుతుంది.

అంతః సత్తలోనికి దిగినపిమ్మట ఊర్ధ్వమున నున్న దివ్యశక్తికి మనము ఉన్మీలితులము కాగలుగుతాము. ఏలనంటే అంతఃసత్త చాలా వరకు విముక్తము కాబట్టి, ఊర్ధ్వమునకు ఉన్మీలితము గావడము దానికి సులభతరము, సహజతరము కూడ. ఊర్ధ్వమునుంచి అప్పుడు భగవంతుని తేజఃశక్త్యాదులు అవతరించి, అంధకార బలహీనత్వముల చేత మూతబడి యున్న అంతరాత్మ కవాటమును తెరచి, మనకు అంతరాత్మ యొక్క గర్భగృహములోనికి ప్రవేశమును కల్పిస్తాయి, లేక అట్టి ప్రవేశమునకు తోడ్పడతాయి. ఒకొకప్పుడు అంతఃసత్తనుండి అంత రాత్మలోనికే పాక్షిక ఉన్మీలనము ముందుగా సంభవించి, అచ్చట నుండే మనము ఊర్ధ్వభూమికలకు ఉన్మీలితుల మవుతాము. ఊర్ధ్వమునుండి దిగి వచ్చిన స్వేచ్ఛా శాంతులచేత, తేజఃశక్తులచేత అంతరాత్మ ఉన్మీలనము క్రమాభివృద్ధి నొందుతుంది.

ఈ అంతరాత్మ ఉన్మీలనానికి మహత్తర ప్రాముఖ్యముంది. అప్పుడు మాత్రమే మానవుడు మానవుడుగా మనగలుగుతాడు; నిజమగు మానవుడై ఆ ఆధారము మీద అతి మానవుడు గావడానికి అర్హుడవుతాడు.

ఏలనంటే, ఈ అంతరాత్మకు ఈశ్వరునితో తిరిగి సాయుజ్యమును (సహయోగమును) సాధించాలనే ఆకాంక్ష అతి సహజము. ఈ ఆకాంక్ష నిరంతరము అంతరాత్మయొక్క అంతరములో జ్వలించు తూనే ఉంటుంది. అది మనస్సు మున్నగు వానివలే ప్రకృత్యంశముగాక, సాక్షాత్తుగా భగవదంశము కాబట్టి, భగవత్ సాయుజ్యమునకు దానికి ప్రబలమైన ఆకాంక్ష సహజముగానే ఉంటుంది.

ఈ అంతరాత్మకున్న మరొక శక్తి ఏమంటే, తర్కాపేక్ష లేకయే, తక్షణమే సత్యాసృతములను పట్టి చూపగలదు, చూపుతుంది. పైగా, సత్య స్ఫూర్తితో సంతృప్తి పడక, సదా సత్యమార్గమునే అవలంబించి పురోగ మించుతుంది. అది కష్ట నష్టాలను ఎంతమాత్రము పాటించదు. సత్య పథములో పురోగమనమే దానికి ప్రాణము. దానికి మృత్యు భయము లేదు. గనుక ప్రతిపక్షుల భయంకర దృశ్యములకు కూడ అది భయ పడదు.

అందుచేతనే మన పురోగతికీ, సంసిద్ధికీ అంతరాత్మానుభవం కీలక ప్రాయము. అంతరాత్మ ఉన్మీలనము జరిగిన పిమ్మట మన మార్గము వెలుగుబాట, పూలబాట కాగలదు. కారణము, సత్యాసత్యములను గుర్తించే అమోఘపాటవము దాని కున్నది. భగవంతుని పట్ల దానికి భక్తిప్రేమలు సహజము కనుక భక్తిప్రేమలతో నిండిన ప్రయాణము మధుర మధుర ముగా ఉంటుంది. ఈ విధముగా అది పూలబాట కూడాను. అంతరాత్మ ప్రయాణములో కూడ బాహ్య కష్టములు కొన్ని ఉంటాయి. కాని అవి అంతరమును సృజింప జాలవు. అందువలన ఆ బాట నిష్కంటకమే అనదగును. అన్నిటికంటె ఎక్కువ అంతరాత్మకు పరమాత్మ సహాయ సంరక్షణలు, అనునయలాలనలు అనుక్షణమూ లభించి అలరిస్తాయి.

చేతనా పరివర్తనము వలననే ఇప్పటి మానవునికి పురోగతి సాధ్యము. మానవుడు పరిణామ క్రమములో ఇపుడు ఆ దశను చేరు కున్నాడు. మనశ్చేతనతో ఎంత సతమతమైనా, మానవుడు ఇప్పటి తన జటిల సమస్యలకు మౌలిక పరిష్కారమును సాధించలేడు. దీనినే శ్రీ అరవిందులు పదేపదే నొక్కి వక్కాణించారు. ఇందుచేతనే ఆయన నేటి మహాత్ముడు అని కీర్తింపబడినారు. ఇప్పుడు వ్యవహరిస్తున్న మనశ్చేతన స్థానములో అంతరాత్మ చేతన (నైతిక చేతన కూడ కాదు) ముందుకు వచ్చి వ్యవహరించాలి. అదే చేతనా పరివర్తనము.

ఈ పరివర్తన సాధ్యమగుటకు అంతరాత్మానుభవము ముందు ఆవశ్యకము. ఈ అనుభవానికి శ్రీ అరవిందుడు అనేక ఇతరోపాయ ములతో పాటు చెప్పిన ఈ క్రింది ఉపాయమును కూడ గమనించండి. "హృదయము ప్రేమాదులగు రసభావములకు (Emotions) స్థానము. కనుక రసభావములు ఎక్కడ పుడుతున్నాయో ముందు మనము గుర్తు పట్టాలి. ఈ రస భావస్థానమునకు వెనుక హృత్పురుష స్థానము అక్కడ ఉన్నామని భావించుకుని, అక్కడే నుండే సామాన్య వ్యవహారము కూడ జరపడానికి మనము ప్రయత్నించాలి. అట్టి వ్యవహారము ఆ కేంద్ర వికా సానికి తోడ్పడుతుంది, అంతరాత్మానుభూతిని ప్రసాదిస్తుంది."

అంతరాత్మకు ఒకే విచారము బాహ్య ప్రకృతి భగవదిచ్ఛను ప్రతి ఘటించుతున్నపుడు—'అయ్యో! ఎంత అవివేకం! ఎంత ఆత్మహత్యా సదృశం'! అని అంతరాత్మకు ఆవేదన, విచారము కలుగుతాయి. అట్టి విచారము పొడముతూన్నపుడు, ఏ స్థానము నుంచి అది పొడముతూ (పుట్టుతూ) ఉందో చూచుకోవాలి. ఈ విధముగా అంతరాత్మ జాడను పసి కట్టాలి. ఉజ్జ్వలమైన భగవదాకాంక్ష ఊర్ధ్వమున కెగయుతూన్నపుడు

కూడ దాని మూలమును పసికట్టాలి. ఈ విధముగా కూడ దాని మూలమును పసికట్టాలి! ఈ ప్రకారము దాని మూలమును అన్వేషించుతూ ఆస్థానము నుండి వ్యవహరించే అభ్యాసము చేసుకోవాలి.

అంతరాత్మ తాదాత్మ్యము, కనీసం సంపర్కము సిద్ధించినపుడు మాటలతో అంతపని ఉండదు, చేతలతోనే సత్యమును అభివ్యక్తము చేయ గలుగుతాము. ఈ సత్యాభివ్యక్తియే మానవజన్మకు సార్థక్యము.

ఈ సందర్భములో 'మదరిండియా' (సెప్టెంబరు 1971) సంచిక ప్రథమ పుటలో వెలువడిన మాతృశ్రీ వచనములను గమనించుదాము.

ప్రశ్న :- శ్రీ అరవిందుని శత వార్షికోత్సవమును పురస్కరించుకొని ఎంతోమంది ఆశ్రమానికి రాబోతున్నారు గదా! ఆశ్రమ నిజ తత్వమును వారికి వ్యక్తము చేసేందుకు మేమేమి చేయ గలము, ఏమి చేయాలి ?

మాతృశ్రీ:- దానిని అనుజీవించుము (జీవనముగా అనుష్ఠించుము, Live it). తక్కినదంతా, వాగ్వ్యాపారము (మోత, ధ్వనిగా వాగ్వివాదము మాటలు). అది కేవలము నిష్ప్రయోజనము.

ప్రశ్న :- దీనికి మమ్ములను మేమెట్లు సిద్ధమొనరించుకోవాలి ?

మాతృశ్రీ:- అంతరాంతరాల్లో అవతరించి, రూపం ధరించిన భగవంతుడే అగు అంతరాత్మతో సంపర్కము ద్వారా. సుతీవ్రమగు ఆకాంక్ష (An intense Aspiration), సంపూర్ణమగు నివే దన (A perfect Consecration), సుస్థిరమగు సమర్పణ (A constant Dedication).

మాతృశ్రీ సమాధానాలను మనము ఎలా అన్వయించుకోవాలి? ఆశ్రమ నిజతత్వమును మీరు జీవించినపుడే, జీవితములో అనుష్ఠించినపుడే, అది అభివ్యక్తము కాగలదు; మాటలచేతకాదు. అలా జీవించడానికి అంతరాత్మ సంపర్కమే సాధనము. ఆ సంపర్కముచేత సత్యమును జీవించగలము, అంతరాత్మకు సత్యమే ప్రాణము గాన. ఇక ఈ అంతరాత్మ సంపర్కము సుతీవ్రమగు ఆకాంక్షాదులద్వారా మనము సంపాదించుకోవాలి.

శ్రీ అరవిందుడు ప్రతిపాదించిన అంతరాత్మ అపూర్వమైనది. దానిని సాంప్రదాయ వేదాంతములలోని కూటస్థునిగానో లేక ఆభాసునిగానో జమకట్టగూడదు. మన సంతృప్తి కొరకు శ్రీ అరవిందుని భావముల, అనుభవముల ఔన్నత్యమును తగ్గించగూడదు. వాని ఉన్నత స్థాయిలోనే వానిని స్వీకరించి అర్థము చేసుకోవాలి.

పైన జరిగిన చర్చాంశమును ఇలా చెప్పుకొనవచ్చు :

మానవుని అజ్ఞానము ఆవరించి ఉంది. కావున తన స్వరూపమేదో తనకే తెలియదు ;

ఈ అజ్ఞానమును తొలగించుకోడానికి అరవిందుడు ఏర్పరచిన మార్గము : మనకు తెలిసిన బాహ్యసత్త వెనుక ప్రచ్ఛన్నమగు అంతఃసత్త **(Subliminal being)** కలదు. అంతర్ముఖులమై ముందు అందులో ప్రవేశించాలి. ఈ అంతఃసత్తకు వెనుక అంతరాత్మ ఉన్నది. అంతఃసత్త నుంచి సరాసరి అంతరాత్మలో ప్రవేశించ గలిగిన, అట్లే చేయుము. అది సాధ్యము గాదేని, అంతఃసత్తయందు నెలకొని ఊర్ధ్వమున నున్న శక్తు

లను ఉన్మీలితులమై, ఆ శక్తులను ఆహ్వానించి, వాటి బలవీర్యములతో హృదయ కవాటమును తెరచి, అక్కడ విరాజమానమై ఉండు అంతరాత్మను గుర్తించి, దానితో ఏకముగమ్ము. ఈ అంతరాత్మకు భగవదంశమగు ఈ అంతరాత్మకు, భగవత్సంపర్కము నిత్యము గావున, నీవు సహజముగా అపుడు భగవత్సత్యమును జీవించగలవు. అదే అమరత్వానికీ, అతిమానస పరివర్తనానికీ, భాగవత జీవితానికీ ప్రధాన సాధనము.

## అంతరాత్మకు ఆకారము గలదా ?

ఈ విషయమున కూడ శ్రీ అరవింద దర్శనము మనకొక విశిష్ట రహస్యమును వివరించి చెప్పును. అంతరాత్మ ఆధ్యాత్మిక సత్తామాత్రము గదా! అయినప్పుడు దానికి ఆకారముండడం పొసగునా ? ఒక రమణీయమైన కథ గాని కథద్వారా ఆ విషయము నిపుడు గ్రహించుదాము.

శ్రీ నలినీకాంత గుప్తగారు ఒకరి జీవితము నందు సంభవించిన సంఘటనమును ఆ వ్యక్తి మాటలలో ఇలా వివరించుతున్నారు—

నే నొకసారి మద్రాసులో సెంట్రలు స్టేషనుకు వెళ్ళగోరి ఒకబస్సు స్టాపులో వేచి ఉన్నాను. నాతో అలాగే పెక్కుమంది కూడా నిలబడి చూస్తున్నారు బస్సు నిమిత్తం. అంతలోనే ఒక బస్సు కండక్టరు వెళ్ళదలంచిన వారిని పిలువగా, నేనా బస్సును సమీపించాను. ఆశ్చర్యం! వేచిఉన్న బృందములోనుంచి ఒక తమిళవనిత చరచరా ముందుకు వచ్చి, "దయచేసి ఆ బస్సులో వెళ్ళకండి!" అని నన్ను హెచ్చరించినది. నేను

చకితుడనై "ఎందుచేత, ఎందుచేత?" అని ప్రశ్నించగా, కొంచెమాగండి, మీరే చూస్తారు". అని పలికినదామె. ఇక నేను వెనుకకు తగ్గాను. వెంటనే రెండు బస్సులు రాగా, నేనొక దానిలో, ఆమె ఒకదానిలో ఎక్కినాము.

నేను ముందుగా ఎక్కదలంచిన బస్సు, నేనెక్కి కూర్చున్న బస్సు ఒక దానితో నొకటి పోటీపడి దూసుకుపోతున్నాయి. చూస్తూ ఉండగానే ఘోరవిపత్తు! నేను ఎక్కబోయిన బండి ఒక చెట్టుకు ఢీకొని భగ్నమైంది. అందులోని ప్రయాణీకులు హాయ్! దుర్మరణం పాలయ్యారు, మిగిలిన కొద్దిమంది గాయపడి హాహాకారాలు చేస్తున్నారు!

తక్కిన రెండు బళ్లు స్టేషను చేరుకున్నాయి. నేను దిగి అతి కుతూహలముతో ఆ తమిళమహిళను "మీకు ఎలా తెలిసింది? మీరెలా ఊహించారు?" అని అడిగాను. "తర్వాత చెపుతాను" అందుచేత మేమిరువురము మరల బయలుదేరి ఒక కొండ గుట్టపై ఉన్న ఒక దేవాలయము వైపుకు సాగిపోతున్నాము. దారి కిరువైపులా చిట్టడవి, అది పొదల మయం. ఒకచోట ఒకడుగు ప్రక్కకు వేసి అక్కడేమున్నదో నని కుతూహలముతో చూడబోయాను. "ఆఁ ఆఁ ఆ వైపుకు వెళ్ళకండి!" అని ఆమె ఉద్విగ్న స్వరముతో వారించింది. ఆశ్చర్యం! అక్కడ ప్రక్కనే 200-అడుగుల లోతుగల భయానకమగు చరియ బలిని కోరుతున్నట్లున్నది! తెలియక ఒక్కడుగు వేశానో, నిశ్చయముగా బలి అయిపోయే వాడిని.

అపుడు మరింత కౌతుకము రేకెత్త ఆమెను అనునయముగా అర్థించాను : "దయచేసి చెప్పరూ? అక్కడా అఖాత మున్నదని మీకెలాపొడ

కట్టింది?" "సరే, మంచిది, కూర్చోండి, ఆ కథను వివరించుతాను" అని ఆమె ప్రారంభించారు—

"నా పసితనములో నన్నెంతో లాలించి ప్రేమించే మా తాతగారు ఉండేవారు. వారికి ఒకసారి తీవ్రముగా జబ్బుచేసింది. డాక్టర్లు ఏమీ చేయలేని నిస్సహాయస్థితికి వచ్చారు, పెదవి విరిచి నిస్పృహను వెల్లడించారు. ఆ విషమావస్థలో తాతగారు నన్ను పిలిచి 'అమ్మా! శివునకు విన్నవించి ప్రార్థించు' అని నన్ను పంపారు. నే నాదర సంభ్రమాలతో అలాగే చేశాను, ఒకటి రెండు రోజులు. కాని లాభము లేకపోగా, పరిస్థితి మరింత విషమించింది. దుఃఖము పొంగివచ్చి ఏడ్వసాగాను!

"ఆ స్థితిలో అకస్మాత్తుగా తాతగారి మంచము ప్రక్కన నాకొక బాలిక గోచరించింది! ఆ బాలిక సరిగా నన్నే పోలిఉండడం చూచి నేను నిజముగా నివ్వెరపోయాను! నమ్మలేక, నా ప్రక్కనే ఉన్న ఒకరిని, అటుచూపి 'అక్కడ మీ కెవ్వరైనా కన్పించుతున్నారా?' అని అడిగాను 'లేదే' అని జవాబు. అపుడు ముందుకు నడిచి, ఆ రూపము సరసను నిలబడి, నిజమని నిశ్చయపరచుకున్నాను. ఇక క్రమముగా మా తాతగారు కోలుకున్నారు.

"తదారభ్య ఎచ్చట ఏ ఉపద్రవము సంభవించినా, ఏ కష్టము ప్రాప్తించినా, ఈ నారూపము గోచరించి నాకు సాయపడుతూ వస్తున్నది. మీరు దైవోపహతమైన ఆ బస్సు ఎక్కబోయినపుడు కూడ, ఈ రూపమే ప్రత్యక్షమై 'జాగ్రత్త'! అని హెచ్చరిక చేసింది. (మనము ఇంతకు ముందు నడుస్తూ ఉన్నపుడు నయితం ఆ బాలికే ఆచరియ సంగతి తెలియపరిచింది).

"ఇంతకూ ఆ బాలిక ఎవరో నాకు ఇంచుకేని జాడ తెలియదు!" అని నన్ను రెండుసార్లు రక్షించిన ఆ తమిళమహిళ తన కథను ముగించింది.

అవును ఆ బాలిక ఎవరు ? తెలుసుకోవాలని మనకూ కుతూహలముగానే ఉన్నది. ఆ రహస్యమునే ఇపుడు ఆకళించు కుందాము — నళినీ కాంతగుప్తగారు దానికి సంబంధించిన సత్యమును ఇలా వివరించు తున్నారు :

అది నీ ఆత్మాంతరము, నీ సూక్ష్మాత్మ. వెలుపల నీవు గాంచు తున్న నీ శారీరకవ్యక్తిత్వము నీ నిజసత్తయొక్క ఒక ప్రతి బింబము మాత్రమే. అయితే అది నీ ఆధ్యాత్మిక వ్యక్తిత్వమని నా అర్థముగాదు; అది నీ సూక్ష్మభౌతిక స్వరూపము. భౌతిక తత్వమునకు సంబంధించి నంతవరకు అదియే నీ యథార్థ స్వరూపము (Personality). ఇక ఈ సూక్ష్మాత్మకు కూడ స్ఫూర్తిని కల్గించే మరొక మహత్తర వ్యక్తిత్వము (individuality) ఉన్నది. ఇది నిజమగు అంతరాత్మ, చైత్యపురుషుడు. ఈ అంతరాత్మ ఆధ్యాత్మికము, భౌతికముకాదు.

శరీరమొక్కటే మనకు కన్పించుతున్నది గాన, శరీరముమాత్రమే మన ఏకైక రూపమని మన భావము. కాని సత్యమువేరు. మనకు అనేక బాహ్యతరరూపాలు, వాటికి సంబంధించిన అనేక బాహ్యతర వ్యక్తిత్వాలు గలవు. మన సత్తయొక్క ప్రతి స్థాయికి ఒక ప్రత్యేక రూపముంది. దానిని మనము గుర్తించవచ్చును కూడ. ప్రతిరూపానికి ప్రత్యేకమగు ముక్కు, చెవులు, కండ్లు గలవు! నీ కా ప్రజ్ఞ కలదేని ఆ వ్యక్తులకు విడిగా పేర్లు కూడ పెట్టుకుని వ్యవహరించ గలవు!

సూక్ష్మ భౌతికము స్థూలము కంటె మరింత సాంద్రము(దట్టము)గా

ఉండును! సాంద్రతను మారకపోవడముతో ముడి పెట్టరాదు. స్థూల భౌతికం అంతమారకపోయినా, సూక్ష్మమంత సాంద్రము (Concrete) కాదు. నీ స్థూలరూపము కూడ వయస్సును బట్టి మారినా, సాపేక్షముగా కొంతకాలము పాటు అది ఒకే రీతిగా కన్పించును. కాని సూక్ష్మ రూపాలు అలాకాదు. అవి ఇట్టే మారిపోతాయి — పరిస్థితిని బట్టి మారతాయి, మనఃస్థితిని బట్టి మారతాయి, భావావేశమును బట్టి మారిపోతాయి. వాటికి సహజమగు నమ్యత్వము (Plasticity) ఒప్పారును. అయితేనేమి? ఎంతమారినా, ఇది ఇదేనని గుర్తించగల సామ్యము కొనసాగుతూనే ఉంటుంది.

ఇలా బాహ్యతర, ఆంతరతర రూపాలెన్నో ఉన్నాయి మనలో. అయితే వీటి అన్నింటిలో అతి ముఖ్యమూ, అతి మౌలికమూ అయిన రూప మొకటుంది : అది నీ చైత్యసత్తయే, యథార్థమగు అంతరాత్మయే. ఏ తదుపలబ్ధినే (Realisation) మనము ప్రయత్న పూర్వకముగా సాధించాలి! అదియే మన జీవిత ప్రథమ ప్రయోజనము.

అంతరాత్మకు ఆకారము కలదా ?—అనే శీర్షికారూపమైన ప్రశ్నతో మనము ఆరంభించాము కదూ ? అంతరాత్మ రూపమే అసలు మౌలిక రూపమని నళినీకాంతగారు ఇక్కడ వక్కాణించుతున్నారు. మౌలిక మంటే, అదే తదితర రూపాలన్నింటికి మూలకందము. దానినుంచే తక్కిన స్థాయిలు తమతమ రూపాలను పుణికి పుచ్చుకుంటున్నాయి.

ఇంతటి మహనీయమగు ఈ మూలరూపముతో సంస్పర్శను ఎలా సాధించుకోగలము?— ఇదే మనలో సంస్పృహగా రేకెత్తే తర్వాతి ప్రశ్న. అది కేవలము అందని ద్రాక్షపండు కాదని నళినీకాంతగారు మనకు

ఆశ్వాస మిస్తున్నారు. ఒకడు కేవలము దుష్టుడైతేనే తప్ప, సర్వాత్మనా మూర్తీభవించిన దుష్టత్వ మైతేనేతప్ప, ఛాయామాత్రముగానైనా అంత రాత్మ సంస్పర్శ అతనిలో ఉండనే ఉంటుంది. ఇక అలాంటి దుష్టుడు లేడనే చెప్పవచ్చు.

శివము, ఉదాత్తము, నిస్స్వార్థమునైన ప్రతి ప్రవృత్తిలోను అంతరాత్మ తన స్వభావమును ప్రకటించుకుంటూనే ఉంటుంది. ఉదాహరణకు, నీ వేదేని సుందర వస్తువును చూచినపుడు గానీ, లేక ఏదేని రమ్యకార్యమును గావించినపుడు గానీ, నీ అంతరాత్మయే ఆ చూపు చూస్తూ ఉంది, లేక ఆ చేత చేస్తూఉంది. ఇది నిక్కువము. సూర్యాస్తమయమును నీవు తిలకించి ఉల్లసించినపుడు, ఆ తిలకించి ఉల్లసించునది నీ లోని అంతరాత్మయే, సందేహములేదు. అంతరాత్మ సంస్పర్శకు అది ఎంత అల్పారంభమైనా, ఆరంభ మనడంలో సందియము లేదు. అట్టి ప్రవృత్తికి నీవు అధికాధికముగా అవకాశమిత్తువేని, ఆ అల్పారంభమే మహాపరిణామము కాగలదు. అట్టి అవకాశము ద్వారా, నీ చేతలను అంతరాత్మయే నిర్దేశించు గాక ! ఇప్పట్టున ఒకే ఒక వస్తువు ఆవశ్యకము: చిత్తశుద్ధి. హృదయపూర్వకతను పెంపొందించుకొనుము. ఈ హృదయ పూర్వకత మొదటి రోజున మిక్కిలి కష్టమనిపించును, రెండవ రోజు కొంత తేలిక అగును, మూడవ నాడు మరింత సులభమగును, ఇక నాల్గవనాడు అది నీకు నైజమే అయిపోవును. అది సుకరము కానిమాట నిజమే ; కాని హృదయ పూర్వక ప్రయత్నమునకు లొంగి వచ్చును.

ఒక కవి తనకు కన్పించి సాయపడుతూ ఉండే సూక్ష్మభౌతిక రూపమును ఏకాంతము యొక్క మూర్తీభవించిన మానవ భావమని అభిప్రాయపడినాడు. కారణం, ఆ సూక్ష్మాత్మను ఏకాంతము నందే, వివిక్త

భావము నందే నీవు గ్రహించగలవు, అనుభవించ గలవు, చూడగలవు, వినగలవు. శ్రీ అరవిందయోగానికి ప్రాతిపదికలైన నిశ్చల నీరవతలే ఇక్కడకూడ అపేక్షణీయా లన్నమాట. హృదయపూర్వకతను వలెనే ఈ నిశ్చల నీరవతలను కూడ క్రమగతిని సాధింప బూనుకుంటే, అంత కష్టమనిపించదు.

ఇపుడు 'అంతరాత్మకు ఆకారము గలదా?'—అనే ప్రశ్నకు మాతృశ్రీ ఏమి చెప్పుతారో చూద్దాము —

"ఈ చైత్యసత్త మన ప్రతి ఒకరిలోనూ నిహితమై ఉన్న దివ్య వ్యక్తిత్వము. నీ బాహ్య వ్యక్తిత్వము బహుశః ఈ దివ్య వ్యక్తిత్వము యొక్క దిష్టిబొమ్మ రూపము మాత్రమే. అయినప్పటికి, కష్టము మీదనే అయినా ఆంతరతమమగు నీ నిజతత్వము యొక్క అవసరములు ప్రేరణల స్వభావమును కొంతలో కొంత ప్రతిబింబింప ప్రయత్నించు తుంది ఈ బాహ్య వ్యక్తిత్వము". అంటే, అమ్మ కూడ అంతరాత్మయే రూపాదు లన్నింటికీ మూలమని నుడువుతున్నారు.

కైవల్య ముక్తియే ఆధ్యాత్మిక సంసిద్ధికి పరాకాష్ఠ అని సాంప్రదాయిక సిద్ధాంతము. కైవల్య మంటే మూలములో, సముద్రములో నీటి బిందువువలే, వ్యక్తి లీనమైపోవునని అభిప్రాయము. అదే పరమ సత్యమైతే, అంతరాత్మకు ఒక సనాతన రూప మున్నదని చెప్ప జాలము. కాని మాతృశ్రీ "ఇది ఆత్యంతిక సత్యముకాదు, ఈలయము సంపూర్ణము కాదు". అని ఉద్ఘాటించారు. "సంపూర్ణలయము సాధ్యము కాదు. ఏలనంటే, పరమేశ్వరుడు అది వేరొక విధముగా ఉండాలని కోరుతున్నాడు".అని ఒకానొక సందర్భములో శ్రీఅరవిందుడు ప్రాసంగికముగా చేసిన సూచనను అమ్మ తన ఉద్ఘాటనకు ఉప

బిలకముగా ఉదాహరించారు.'' సదసత్తులకు పైన వెలుగొందుతూన్న సత్య శిఖరాగ్రమున సంసిద్ధి దశయందు కూడ జీవుల రూపములు — తాత్విక రూపములు — ఇమిడి ఉండును. ఈ రూపములు ఏకముయొక్క ఏకతకు విరుద్ధములు కావు, ప్రత్యేకతకూడ వాని కక్కడలేదు. ఎట్టి విభేదము లేకుండా మూలములో పొందుపడి ఉంటాయి ఈ తాత్వికరూపములు. కాని మనకందుబాటులో నున్నమాటలు ఆ సత్యముపట్ల మూగవోవును, ఆ అర్థమును ఏమాత్రము సూచింపలేవు !'' అని అమ్మ ముగించారు. జీవుడు సనాతనుడు, జీవరూపముకూడ సనాతనమేనని అమ్మ చెప్పి నట్లయింది.

తైత్తరీయోపనిషత్తు ఈ సందర్భములో ఏమి చెపుతున్నది ? ''సవా ఏష పురుషవిధ ఏవ. తేనైష పూర్ణః'' [అంతరతరమగు అదికూడ పురుషాకృతినే కలిగి ఉండును. దానిచేత దానిపైనున్న బాహ్యతరము పూర్ణమై ఉండును.] అని అన్ని కోశముల యందున్న పురుషులకు రూపసంపత్తి గలదని చెప్పి, లోపలి రూపము ననుసరించే బాహ్యరూపము ఏర్పడుననికూడ తెలియపరుస్తున్నది.

''పరాప్రకృతి ర్జీవభూతా'' (ఈ లోకము జీవభూతయైన పరా ప్రకృతి) అని భగవద్గీత వెల్లడించిన దానిని నళినీకాంతగారు ఇలా చెపుతున్నారు — ''నీలోని చైత్య సత్త మాతృశ్రీయే. ఏలనంటే, నిన్ను రక్షించడానికి నీయందు ఆమె నిక్షిప్తము గావించినది కేవలము ఆమె రశ్మియే.'' దీనిని బట్టి—

అమ్మ ఎక్కడ ఉంటుంది ? ఎక్కడ అమ్మ ఎక్కువ అందు బాటులో ఉంటుంది ? అని ప్రశ్న వేసుకుంటే, ఏమి తేలుతుంది ? అంతరాత్మకు మూలమైన అమ్మ అంతరాత్మనంటి, అంతరాత్మ వెనుక

ఉంటుంది. జీవులను మహాగ్నినుండి వెలువడిన నిప్పుకణములుగా వర్ణించడం కద్దు. కాని విస్ఫులింగాలు అగ్నినుంచి విడిపోతాయి. అలా జీవులు అమ్మనుంచి విడిపోక, అమ్మను సదా అంటే ఉంటాయి. కనుక అంతరాత్మ వెనుక అమ్మప్రాప్తి సులభతరము. ఈ విషయమునే పోషించుతూ సేథ్నాగారు ఇలా చెపుతున్నారు—

"సమగ్ర ఆధ్యాత్మికతకు ఆవశ్యకమగు సమస్తమూ ఏదోఒక రూపములో అరవిందునిలో ఉండనే ఉన్నది. అయినప్పటికీ శ్రీ అరవిందచేతనయొక్క ముఖ్యవృత్తి మనస్సునకు ఊర్ధ్వమునుంచి ఉత్పన్నమవుతున్న అపార జ్ఞానశక్తి అని అభివర్ణించుకోవచ్చును. అలాగే అమ్మయందుకూడ యోగసంపూర్ణతకు అవసరమగు సకలము ముందుగానే ఉపాంగముగా సిద్ధమై ఉన్నప్పటికీ, మాతృశ్రీ ముఖ్యవృత్తి హృదయము వెనుకనుంచి ఉత్పన్నమయ్యే ఘనిష్ఠ ప్రేమశక్తి అని ఉగ్గడించుకోవచ్చును. కనుక మాతారవిందుల సమాగములో ఉభయుల శక్తులు పరస్పర పూరకములై పృథివీ పరివర్తనము ప్రారంభించాయి." అని సేథ్నాగారు అతి విశాలమైన భవ్యచిత్రమును మనకు చిత్రించి పెట్టారు.

హృదయము వెనుక తీవ్రమగు ప్రేమశక్తిగా విజృంభించుతున్న అమ్మను ప్రేమవాత్సల్యాలతో స్పృశించి పట్టుకుందాము. మన అంతరాత్మకు సనాతన శాశ్వతరూపమున్నా, అది తాత్వికరూపము గనుక, ఏకతకు విరుద్ధము కాదు గనుక, ఆ రూపముతోనే అమ్మతో ఏకమై, అమ్మయై దివ్యానందమును అనుభవించుదాము!

—:o:—

# దివ్యకర్మ యోగము

కర్మజ్ఞానాలకు పొందికలేదని, పరస్పర విరుద్ధాలని తరతరాలుగా మనం వింటూఉన్నా కర్మయోగమును దివ్యకర్మయోగము గావించి ఎలావైరుధ్యమును శ్రీ అరవిందుడు తొలగించివేశాడో మనమిక్కడ సూత్రప్రాయంగా చూడగలం. దివ్యకర్మయోగం విరోధమును పరిష్కరించటమేగాక పరిపూర్ణమగు ఏకతా జ్ఞానమునకు ఎలా దారితీయగలదో చూడగలం. ఈ ఏకతా జ్ఞానం ప్రపంచమును త్రోసిరాజనదు. పరతత్వజ్ఞానమునకు ప్రపంచజ్ఞానమునకు అభేదాన్ని చూపెట్టుతుంది. దీనికిసాధనంగా "తత్వమసి" ని ఎంతవిలక్షణంగా ఉపయోగించుకున్నారో ఇక్కడ మనకు గోచరిస్తుంది.

# దివ్యకర్మ యోగము

కర్మయోగముపై భగవద్గీత వంటి, కాదు భగవద్గీతతో పోల్చదగిన గ్రంథము కూడ మరొకటి లేదని మహామహులే చెప్పుతారు. అది అద్వితీయ గ్రంథము కాబట్టే, శ్రీఅరవిందుడు తాను దానిపై రెండు సంపుటాల బృహద్ వ్యాఖ్యానానికి పూనుకొన్నానని స్వయముగా వెల్లడించారు. కాని ఈ మహాసముద్రమును మథించడానికి ఆవశ్యకమగు శక్తియుక్తులు గాని, క్షమా సమయాలు గాని మనకు లేవు. కావున శ్రీ అరవిందలేఖినియే చిత్రించిపెట్టిన సరళ మగు రేఖా చిత్రమును పరికించి కర్మయోగ సారమును స్పష్టముగా ఆకళించుకొందాము.

ఏది కర్మ ? కర్మయోగము ఎలా ఆరంభించాలి ? కర్మయోగము ఎప్పుడు దివ్యకర్మయోగ మవుతుంది? దాని అంతస్తులు? కర్మయోగ సారాంశము ? ఇతర యోగాలతో దీని సంబంధము ? ప్రకృతి పరివర్తనానికి ఇది ఎందుచేత అత్యంతావశ్యకము ? ఈ ప్రశ్నల కిపుడు సూటి యగు సమాధానాలు పొందుతాము.

శిష్యుడు :— నాకు సరిగా జ్ఞాపకము ఉన్నపక్షాన, ఆధ్యాత్మిక జీవితానికి కర్మ ఒక సన్నాహము మాత్రమేనని మీరు వ్రాశారు; అందు కొరకు తప్పితే దానికంత విలువ లేదు.

శ్రీఅరవిందుడు :— ఓ భగవంతుడా! నేనెప్పుడు పర్వతప్రాయమైన ఈ వాక్యమును పలికాను ? పలికిఉంటే, గీతపై వ్రాసిన రెండు సంపుటాలను,'ఆర్య' యొక్క మొత్తం ఏడు సంపుటాలను అది ఒక్క వ్రేటుతో బలి గొంటుందే! విషయమేమంటే, కర్మ తనకు తాను అయిన ఒక సన్నాహము మాత్రమే. ఆ మాటకు వస్తే, తనకు తాను అయిన ధ్యానము కూడా అంతే. ఇక కర్మ ప్రవర్ధమాన మవుతున్న యౌగిక చేతనతో చేయబడినపుడు ధ్యానము వలెనే అది కూడా సాక్షాత్కార సాధనమే.

శిష్యుడు :— ఇలాగే కర్మను గురించి మేము తికమక పడుతూ ఉంటాము. అందుచేత దానిని గురించి తిరిగి తిరిగి మిమ్ములను అడిగి తెలుసుకో గోరితే మీరు క్షమింతురు గాక!

శ్రీఅరవిందుడు :- అవును గాని ప్రతిసాధకునికి తిరిగి తిరిగి అదే విష
యము వ్రాయవలసివస్తే - సరే వ్రాస్తాను !

"ముమ్ముందు ఒక సంగతి స్పష్టము చేయాలి — అజ్ఞానము నందు అహంభావముతో చేసిన క్రియయే కర్మ అని గాదు నా అర్థము. అప్పుడా క్రియ అహంతృప్తి కొరకు రజోగుణము నుండి పుట్టిన కామనా ప్రేరితమై జరుగుతుంది. అజ్ఞానముయొక్క అధికార ముద్రలగు అహంకారము, రజస్సు, కామము— వీటిని వదిలించుకో డానికి ప్రబలమగు సంకల్పము పనిచేయనపుడు, కర్మయోగానికి అర్థమేలేదు.

"మరొకమాట, మానవసేవ, పరోపకారము మున్నగునవి కూడ కర్మ అని నేను చెప్పను — అవి నైతికములే గానివ్వండి, ఆదర్శవాద విషయములేగానివ్వండి. వీటిని కర్మయొక్క గహన (deep)సత్యమునకు బదులు కొంతమంది జమ కట్టడం కూడ కద్దు.

"కర్మఅంటే నా ఆశయము భగవంతుని కొరకు, భగవంతునితో అధికాధిక సంపర్కముతో చేస్తూ ఉన్నకార్యమే— కేవలము భగవంతుని కొరకు, తదన్యము కొరకు గాదు".

ఇదే కర్మయోగానికి నిజమగు ఆరంభము. భగవంతుని కొరకు సరే, ఆ కర్మలో ఎంతోకొంత భగవత్సంపర్కము ఉండాలి.ఆసంపర్కము క్రమముగా వికసించాలి. భగవంతునికొరకే చేయాలంటే, అహం భావము, కామము అసలే ఉండగూడదు. అవి కర్మను తామే అపహ రించడానికి చూస్తాయిగదా! ఇక సంపర్కముతో కర్మ చేయాలంటే,

అజ్ఞానము తొలగిపోవాలి. అందుచేతనే అహం, రజస్సు, అజ్ఞానము లను పరాస్తము చేయడానికి ప్రయత్నించనంతవరకు కర్మ యోగానికి అర్థములేదని పైన ఉద్ఘాటించారు శ్రీ అరవిందుడు. ఇంకా అంటు న్నారు:

"ఇలా భగవంతుని కొరకే, భగవత్సంపర్కముతో కర్మగావిం చడం ఆదిలో సుకరముగాదు, అది సహజమే (నిజమే). ఆ మాటకు వస్తే గంభీరధ్యానము, ప్రకాశమయజ్ఞానము సుకరమా? స్వచ్ఛమైన ప్రేమ భక్తులైనా మాత్రము సుకరమా! అందుచేత తక్కినవి చేపట్టి నట్లే కర్మనుకూడ సరియైన హృదయముతో (Spirit), సరియైన మనో వైఖరితో, సీయందలి సరియైన సంకల్పముతో ప్రారంభించాలి. తక్కిన దంతా తర్వాత సమకూడును," అని ధైర్యము చెప్పుతున్నారు.

"భక్తి లేక ధ్యానము ఎంత ఫలప్రదమో, ఇట్టి హృదయముతో చేసిన కర్మలుకూడ పూర్తిగా అంత ఫలప్రదములు, సందేహములేదు. కోరిక, రజస్సు, అహంలను త్యజించడంచేత మనకు ఒకానొక శాంతీ, పవిత్రతాలభించును. ఈ శాంతి పవిత్రతల లోనికి చెప్పనలవికాని ఊర్ధ్వ శాంతి అవతరించును.

"తన ఇచ్ఛను భగవదిచ్ఛకు అంకితము చేయడముచేత, తర్వాత దానిని భగవదిచ్ఛలో లీనము జేయడంచేత, సాధకునికి అహంకార మరణము సిద్ధించును. అతనిచేతన విశ్వచేతన లోనికి విస్తరించును, లేదా విశ్వాతీతములోనికే ఉద్ధరింప బడును.

"పురుషుడు ప్రకృతి కంటే వేరుగా ఉన్నాడనే అనుభవము

అంకురించి, అపుడు అవరప్రకృతిబంధనములనుండి అతడు విముక్తు డగును. అటుపిమ్మట సాధకుడు తన అంతఃసత్తను గుర్తించి, బాహ్యసత్త యంత్రప్రాయమని గమనించును.

"(ఇక ఇప్పుడు) వైశ్వ (Universal) శక్తియే తన కర్మలను చేస్తూ ఉండగా, ఆత్మలేక పురుషుడు ఆ కర్మలను కేవలము పరిశీలించు తున్నాడు, లేక సాక్షిగా చూస్తున్నాడు — అని సాధకునికి తోచును. అతడలాచూస్తూ ఉన్నా ముక్తుడే." ఇది ఈదశ కర్మలకు నాంది. ఇంకొక్కమెట్టు – అవి దివ్యకర్మలు కాబోతున్నాయి. ఇక్కడి నుంచే, పైన వివరించిన యథార్థ కర్మయోగము కూడ తన స్వరూపమును మార్చుకుని దివ్యకర్మయోగము కాబోతున్నది. ఈ మెట్టునే ఇపుడు లక్షించుదాము.

"తన సమస్త కర్మలు తన నుంచి స్వీకరించబడి, విశ్వజననిచేత, లేక పరమ జననిచేతనే చేయబడుతున్నాయని సాధకునికి భవ్యాను భవము కలుగును. లేదా, హృదయము వెనుకనుంచి దైవశక్తి అదుపులో పెట్టుతూ ఆ కర్మలను నిర్వహించుతున్నదని అతడు గ్రహించును." ఇపుడు ఇలా దివ్యజననియే మన కర్మలను చేస్తూ ఉన్నది గాన మన కర్మయోగము దివ్యకర్మయోగమగును. ఈ విధముగా కర్మ సన్నాహము మాత్రమేగాక, పరమసాక్షాత్కారాలకు సాక్షాత్సాధనము కూడ అవుతున్నది. కర్మ మాత్రమే అయిన కర్మ సాక్షాత్కారానికి సన్నాహము (Preparation) మాత్రమేకాగా, దివ్యకర్మ సాక్షాత్కారానికి స్వయముగానే సాధనమవుతుంది. ఇపుడు మళ్లీ ఒక మెట్టు దిగివచ్చి, దివ్యకర్మ సిద్ధించేముందు కర్మయోగి అవలంబింపగల మరొక ఉపాయమును చూపుతున్నారు శ్రీ అరవిందుడిపుడు:

"సాధకుడు తన ఇచ్ఛను, కర్మలను సంతతము భగవంతునిముందు పెట్టడం చేత భక్తిప్రేమలు అతనిలో ప్రవృద్ధమగును, అంతరాత్మ ముందుకు వచ్చును. అలాగే ఇచ్ఛాకర్మలను ఊర్ధ్వమునందున్న శక్తి ముందు నివేదించడంచేత ఆ శక్తి ఉనికిని, తదవతరణమును సాధకుడు అనుభవించు స్థితికి రాగలడు; పెరుగుతూన్న చేతనాజ్ఞానములకు తన లోని ఉన్మీలనమును కూడ అతడు తెలుసుకోగలడు.

"చివరకు కర్మలు, భక్తి, జ్ఞానము పరస్పరము కలిసిపోగా, స్వీయసంసిద్ధి సాధ్యమగును—దీనినే మనము ప్రకృతి పరివర్తనమని పిలుస్తాము.

"ఈ ఫలితాలు ఒకేసారి ఊడిపడవు. అవినెమ్మదిగా వచ్చును–ఎక్కువ తక్కువ నెమ్మదిగా, అలాగే ఎక్కువతక్కువ సమగ్రముగా. ఈ విషయము సత్తయొక్క స్వభావముమీద, వికాసముమీద, ఆధారపడి ఉంటుంది. దివ్యసాక్షాత్కారానికి రాజమార్గమంటూ ఏదీలేదు.' ప్రతి సాధకుని స్వభావమునుబట్టి దివ్యశక్తి ఆ సాధకుని మార్గము నిర్ణయించును గాన, అందరికీ ఒకే రాజమార్గము పనికిరాదు. అయితే స్థూలముగా అందరికీ వర్తించేలాగున కర్మయొక్క సాధారణ రూపమును చెప్ప వచ్చును. ఇపుడు శ్రీ అరవిందుడు కర్మయోగ సారాంశమును తెలుపు తున్నారు.

"భగవద్గీతచేత ప్రతిపాదింపబడి, 'ఆర్య' లో నాచేత పోషింప బడిన కర్మయోగమిదే. ఇది అనుభవము మీద ఆధారపడినదేగాని, ఊహాగానము మీదాకాదు, హేతు ప్రక్రియ మీదాకాదు. ఈ కర్మ యోగము ధ్యానమును వర్జించదు. భక్తిని అసలే వర్జించదు, ఏలన,

భగవంతునికి ఆత్మసమర్పణము, భగవంతునికి తన సంపూర్ణసత్తను ముడుపుగట్టి వివేదించడము—ఇవి కర్మయోగానికి ఎలాసారాంశమో, అలాగే భక్తియోగానికి ప్రాణక్రియ కూడ. జీవనక్షేత్రమునుండి పలాయన మంత్రము పఠించే కేవలధ్యానము మాత్రమే ఈకర్మయోగము స్వీకరించదు; అలాగే తన ఆంతరిక స్వప్నమునందు మూసివేయబడిన తత్పరభక్తినికూడ అది అంగీకరించదు—అది అంగీకరించక పోవడం కూడ ఈ ధ్యానమును, ఈ భక్తిని యోగము యొక్క పూర్ణక్రియ అని భావించినపుడే. విశుద్ధ విలీన ధ్యానమునందో, లేక ఆంతరిక నిశ్చలోపాసనయందో గంటలకొలదీ గడిపినా, అవే పూర్ణయోగము యొక్క సంపూర్ణ స్వరూపము కాజాలవు.'' అని ముగించి, శ్రీ అరవిందుడు తన అనుభవ సంభూతమైన దివ్యకర్మ యోగముయొక్క చక్కని చిన్నిచిత్రమును మన కందించారు.

భగవంతుని కొరకే కర్మలు చేస్తాము. భగవదిచ్ఛలో మన ఇచ్ఛను లీనము జేస్తాము. భగవంతునికి పరిపూర్ణమగు ఆత్మ నివేదనముగావించుకుంటాము. ఈ కర్మయోగములో,.నిజానికి ఈవిధమగు భగవత్తత్పరత భక్తియోగానికి హృదయ భూతమగు వృత్తి. కావున ఈ కర్మయోగములో భక్తియోగము అంతర్గతమై చేయి కలిపి పనిచేస్తుంది. అలాగే ఈ కర్మయోగము నందు మన యిచ్ఛను భగవదిచ్ఛ యందు లీనము గావించడము చేత 'అహంకార మరణమును' సాధించుతాము. అపుడు అవర్ణనీయమైన ఊర్ధ్వశాంతి మన లోనికి దిగుతుంది. మనచేతన విశ్వ చేతనలోనికి విస్తరించుతుంది. చివరకు పరచేతనలో ప్రవేశించుతుంది. ప్రకృతి పురుష వివేచన కూడ దీని వలన సహజముగా అబ్బుతుంది. ఇప్పుడు కర్మలు పరమేశ్వరి శక్తియే గావించును గావున, మనకు నైష్కర్మ్యసిద్ధి, శాంత్యాదులైన ఈ అపూర్వ లాభాలు,

నడకలు జ్ఞానయోగానికి పంచప్రాణాలు. అయినా, ఇవన్నీ ఈ కర్మ యోగములో అంతర్భాగమే. కావున ఈ కర్మయోగములో జ్ఞానయోగము కూడ పనిచేస్తుంది. ఇలా పరస్పర సమ్మిశితములై పని చేయడంచేత, విడివిడిగా పనిచేసి నపుడు ఈ మూడింటిలో దేనికి అందని అతిమానస శక్తికూడ అవతరించుతుంది. అప్పుడు ఇది ఈ మూడింటి సమ్మేళనము మాత్రమే గాకుండా, ఒక నూతన స్వభావమును సంతరించుకుని పూర్ణ యోగమవుతుంది. ఈ పూర్ణయోగానికి భౌతిక పర్యంతము ప్రకృతి పరివర్తన సాధ్యము.ఇట్టి ప్రకృతి పరివర్తనముకొరకే మున్నుప్రచలితము కాని పూర్ణయోగము అనివార్యావసరమయింది.

'మున్ను ప్రచలితముకాని' అనేదానికి ఒక దృష్టాంతముగా ఈ క్రింది ప్రశ్నోత్తరాలను గమనించుదాము.

శిష్యుడు : మీ యోగములో అత్యున్నత సాక్షాత్కారము కేవలము కర్మ ద్వారానే పొందడం సాధ్యమేనా ? లేక, కర్మను ఒక దశ వరకు మాత్రమే సాధనగా ఉపయోగించుకుని తర్వాత విడిచి వేయాలా ? ఈ విషయములో శ్రీరామకృష్ణుడు గర్భిణీ సాదృశ్యమును చూపుతూ, గర్భము (జ్ఞానము) ఎలా పెరుగునో, కర్మ అలా క్రమముగా పడిపోవునని చెప్పారు.

శ్రీఅరవిందుడు : నేను రామకృష్ణుడనా ? పైగా, నా యోగానికీ, రామకృష్ణుని యోగానికీ భేదములేదా ?

సరే, కాని కర్మ విరహితమైన ధ్యానావసరము, రామకృష్ణుడు నుడివినట్లు, శ్రీ అరవిందునికి లేని పక్షాన, ఆయన ఏకాంతములోనికి

ఎందుకు ఉపసంహరించుకోవలసి వచ్చింది ? ఇది ఎక్కువ మందికి కలిగే అనుమానమును తీర్చుకుందాము.

శిష్యుడు : గహన ధ్యానమును మాత్రమే చేయడానికి అయిదారు సంవత్సరాలు మీరు ఏకాంతము నాశ్రయించలేదా ?

శ్రీఅరవిందుడు : అలా ఆశ్రయించినట్లు నాకు తెలియదు. కాని ఈ విషయములో నాకంటె నా జీవితచరిత్ర వ్రాసిన వారికే బహుశః ఎక్కువ తెలుసు !

తర్వాత శ్రీ అరవిందుడు ఇంకా ఇలా వెల్లడించారు :

శ్రీఅరవిందుడు : నేను ఏకాంతానికి వెళ్ళానంటే మరొక ముఖ్యతర కార్యము మీద నా శక్తులను ఏకాగ్ర పరచి పనిచేయ డానికే కాని, కేవల ధ్యానములో మునిగిపోవడానికి కాదు. ఆనందమయ నైష్కర్మ్యములో సుఖముగా ధ్యానము చేసుకునేందుకు తీరిక కావాలని నేను అపే క్షించడములేదు.

అందుచేతనే శ్రీఅరవిందుడు, 'నా జీవితమును గురించి ఎవరూ వ్రాయలేరు. ఆ జీవిత వ్యాపారము బాహ్యానికి కానవచ్చే క్రియగాదు', అని వాఖ్యానించారు. అసలు ఇపుడు ఏమి జరుగుతోంది ? లోకానికి శ్రీఅరవిందుడు మరణించారు. కాని అమ్మ ఏమి చెప్పుతున్నారు ? ఆయన మనమధ్య లేడనుకోవడం ఆయన స్మృతికి అపచారము చేయడమే అవుతుంది. ఆయన మనమధ్య మనలో నిష్క్రియముగా నిలిచి ఉండ డమే కాదు, సక్రియముగా పనిచేస్తున్నారు — అని అమ్మ వక్కాణించు

తున్నారు. ఆరోవిల్ విషయములో ఒక సందర్భములో మాతృశ్రీతో మూడు గంటలు శ్రీఅరవిందుడు (దేహత్యాగము తర్వాత) చర్చించారట! అస్తు!

## ఏకతాజ్ఞానమే జ్ఞానము

"తత్త్వమసి" : ఇది మహోదాత్తమైన మహావాక్యము. దీనితో పోల్చదగిన వాక్యము ప్రపంచవాఙ్మయములో మనకు మరెక్కడను కానరాదు – అని వివేకానందస్వామి మేఘ గంభీరస్వరముతో ఆనాడు అమెరికాలో ఉచ్చరించారు. అదే మహావాక్యానికి మున్నెన్నడూ ఎవ్వరూ ప్రవచింపని పరిపూర్ణార్థము ఈనాడు శ్రీ అరవిందుని అనుభవ క్షేత్రమునుండి ఎలా పుట్టుకొని వచ్చిందో గమనించి ఈ సత్యద్రష్టకు నమస్సు లర్పించుదాము.

ఇందునిమిత్తం 'యోగసమన్వయము' అను గ్రంథమునుండి ఎత్తి, 'ఆల్ ఇండియా మ్యాగజీన్' డిశంబరు, 72—జనవరి, 73 సంయుక్త సంచికలోని 'ఏకతా జ్ఞానము' అను శీర్షిక క్రింద ప్రకటించిన శ్రీఅరవింద వాణిని ఆకళించుకుందాము. వారక్కడ ముందుగా సంప్రదాయజ్ఞానమును ఇలా పరామర్శించుతున్నారు:

"సన్యాసపరమగు పురాణజ్ఞానమార్గము సమస్త భూతముల ఏకత్వమును, ఆయాభూతములపై అనుశీలనమును అంగీకరించింది. కాని అది ఆసత్తలను ప్రత్యేకముగా పరికించి, వాటిలో ఒక నిమ్నోన్నత క్రమ

ముమ ఏర్పరచింది. దీని ననుసరించి, వస్తువుల నానారూపములను ధరించు ఆత్మను విరాట్పురుషుడు లేక వైశ్వపురుషుడు అన్నది; ఈ రూపములను సృజించే ఆత్మను హిరణ్యగర్భుడు లేక సృష్టికర్త అన్నది; అన్నివస్తువులను తనయందే కలిగి ఉన్న ఆత్మను ప్రాజ్ఞుడు లేక కారణ పురుషుడు అన్నది; ఇక వీటన్నింటిపైన ఒక పరతత్వమును ప్రతిపాదించి అది (Absolute) జగత్తుయొక్క మిథ్యావ్యాపారమును అనుమతించునే గాని, అందులో పాల్గొనదు అని చెప్పివేసింది. ఆ బ్రహ్మములోనికే మనము ఉపసంహరించుకుని, ప్రపంచానికి ఒక నమస్కారము వదలాలి; ఏలన, జ్ఞానమంటే చరమజ్ఞానమే గనుక, ఈ అవరసాక్షాత్కారాలు మననుంచి పడిపోనైనా పడిపోవాలి, పరతత్వములో అంతరించనైనా అంతరించాలి. అంతేగాని వాటికి మన సంవిత్తులో స్థానము లేదు,'' అని శ్రీ అరవిందుడు సంప్రదాయజ్ఞానమును సంగ్రహించి చెప్పారు.

ఇంతకంటె ప్రసిద్ధమైన పరిభాషలో చెప్పాలంటే, ప్రపంచము సత్యమేగాని, వ్యావహారికసత్యము. పారమార్థికసత్యములో ప్రవేశించిన పుడు ఈ ప్రపంచము కన్పించదు, లేదా దేహమున్నంతకాలము భ్రాంతి మాత్రముగా స్ఫురించుతుంది. ఈ విభేదమును పురస్కరించుకుని, శ్రీ అరవిందుడు, ''ఏనాడు ఈ వ్యావహారిక పారమార్థికభేదము భారతావనిలో వేరూనిందో, ఆనాడే భారతీయుల అవనతి ఆరంభమయింది !'' అని ఆవేదన వెలిబుచ్చారు ఒక సందర్భములో. ఇపుడు, పైన పేర్కొనిన చతుర్విధ విభేదము పట్ల శ్రీ అరవిందుని అభిప్రాయం ?

''మనదృష్టి ననుసరించి, ఆచరణ సౌకర్యముకొరకు ఇవి మనస్సు చేత కల్పించబడిన విభేదములే. కొన్ని ప్రయోజనముల నిమిత్తము వాటికి కొంత విలువ ఉన్నది గాని, నిరపేక్షమగు చరమమూల్యము మాత్రము శూన్యం.

"మన ప్రపంచదృష్టి దాని ఏకత్వము పట్ల పట్టు సడలనీయదు. ఆ దృష్టికి విరాడాత్మ సూత్రాత్మయగు హిరణ్యగర్భుని కంటే భిన్నము కాదు. అలాగే సూత్రాత్మ కారణాత్మకంటెను, కారణాత్మ పరబ్రహ్మము కంటెను భిన్నముకాదు. సత్యమేమన, ఒకే 'ఆత్మసత్త' అన్నిభావములు (becomings)అయింది. ఇక ఈఆత్మసత్త తానే నానాసత్తలుగా అభివ్యక్త మవుతూన్న ఈశ్వరునికంటే ఇతరముగాదు ;ఈశ్వరుడుకూడ ఏకైకసత్తా మాత్రమగు అద్వితీయ బ్రహ్మము కంటే అన్యుడు కాదు."

ఈ విధముగా అభేదాద్వైతమును ప్రతిపాదించి, అక్కడితో విరమించలేదు శ్రీఅరవిందుడు. ఆ అభేదోపలబ్ధికి ఏకతాసాధకమగు జ్ఞానమును వక్కాణించి చెప్పుతున్నారు :

"ఆ ఆత్మ, ఈశ్వరుడు, బ్రహ్మము: పేరునకు మాత్రమేమూడగు ఈతత్వమును తెలుసుకోవాలి, దాని జ్ఞానమును సాధించాలి. లేకపోతే దానితోనూ, దాని అభివ్యక్త ప్రపంచముతోనూ మనకు ఎట్లు ఐక్యము లభించును. ఆ ఐక్యములో మనమెట్లు జీవింపగలము ? జ్ఞానము ద్వారానే సమైక్యము లభించాలి. కారణము, తప్పక ఏకముచేసేదే జ్ఞానమని మనము విధించుతాము. ఇక విభజన గావించే జ్ఞానము, ఆచరణరీత్యా దానిలో కొన్ని ప్రయోజనాలున్నప్పటికీ, పాక్షిక జానము మాత్రమే. ఏకముచేసే జ్ఞానమే యధార్థజ్ఞానము." ఇపుడు ఈ యథార్థజ్ఞానము కొరకు ప్రత్యేక ప్రయోజనాలు గల పాక్షిక సాధనలను ఎలా ఉపయోగించుకోవాలో చెపుతున్నారు పూర్ణయోగి శ్రీ అరవిందుడు :

"ఏకముగావించే జ్ఞానమే అసలు జ్ఞానము గావున, మన పూర్ణ యోగము వివిధ సాధనలను, యోగములను చేపట్టి, వాటిని సమరసపరచి

సాధ్యమైతేవాటిని మేళవించివేయును. ఇట్టి సమ్మేళనము వాటిమధ్య గల దూరములను రూపుమాపును. ఈ సమ్మేళనమును లక్షించును గావుననే, పూర్ణజ్ఞాన సాధకుడు ఏ ధార్మిక మతము చేతగాని, ఏ దార్శనిక సిద్ధాంతము చేతగాని తన ఆలోచయందుగాని, అనుష్ఠానము నందుగాని, సాక్షాత్కారము నందుగాని తనను తాను ఇరికించుకొనడు. అలా ఇరికించుకుని, కేవల పరతత్వ యోగమునందువలే, నీరవాత్మనో, అజ్ఞేయ పరమునో అపేక్షించి, భగవంతునికి, విశ్వమునకు విముఖుడై వాటిని నిరాకరించడు. అలాగే భక్తియోగమును మాత్రమే అవలంబిం భగవంతుని కొరకే జీవింప జూడడు; సమస్తవిశ్వము భగవంతుడేనని తలంచి, విశ్వమునందు మాత్రమే జీవించడు. జగత్సత్యమును సమగ్ర రూపమున అన్వేషించును పూర్ణయోగి. అవి శాశ్వత సత్యముల మీద నిలిచి ఉన్నాయిగాన, అతడు ప్రాచీన యోగములను నిరాకరించడు. అయితే తన లక్ష్యమునకు అనుగుణముగా వాటికి నూతన దిశను చూపును."

ఇలా పూర్ణయోగి ప్రత్యేక భావమునకు బద్ధుడుగాక, ప్రత్యేక యోగములను పూర్ణయోగ లక్ష్యానికి అనుగుణముగా మలచుకుంటాడు. అలా మలచుకొనేందుకు ప్రత్యేక యోగాలలో దేనినిముందు చేపట్టాలో ఇపుడు చెప్పుతున్నారు:

"జ్ఞానవిషయమునందు మన ప్రాథమిక లక్ష్యము మనయందలి ఉత్తమాత్మను ఉపలబ్ధి మొనరించుకోవడమేనని మనము గుర్తించాలి. ఆ ఆత్మను ఇతరులయందు గుర్తించడముకంటే, లేక ప్రకృతి ప్రభువు గానో, లేక సమస్తవిశ్వముగానో చూడడముకంటే మనయందు సాక్షాత్కరింప జేసుకోవడమే ముఖ్యము. ఏలన, అది మన అనివార్యా

వసరము. మనకు ఆత్మజ్ఞానము కలిగినపుడే, మన సత్తయొక్క ఉత్తమ సత్యమును అందుకోగలము; మనయందలివ్యతిక్రమములను (disorders) తికమకలను, మిథ్యాతాదాత్మ్యములను సరిచేసుకోగలము; మన సత్తయొక్క సమీచీనమగు (right) ఏకాగ్రతను, విశుద్ధిని చేరుకుని, తెలుసుకుని మూలములోనికి ఆరోహించ గలుగుదుము". ఇపుడే పూర్ణయోగము యొక్క ఒక పరమవిశేషము ప్రారంభము కానున్నది. అవరోహణ ప్రక్రియయే ఆ పరమవిశేషము. ఈ అవరోహణ ప్రాచీనయోగాల ఆరోహణను సవ్యముగా ఉపయోగించుకొనును.

"అయితే మన ఈఆరోహణము మూలములో మునిగిపోయేందుకు గాదు. మన సమస్త సత్తా, ఆంతరరాజ్యముయొక్క అన్ని అంగములూ తమసరియగు ఆధారమును పొంది, అట్టి ఆధారమును మన ఉచ్ఛతమ ఆత్మలో జీవించేందుకు, ఉచ్ఛతమ ఆత్మకొరకే జీవించేందుకు మాత్రమే మనము ఆరోహింతుము. ఇలా జీవించుతూ, ఉచ్ఛతమ ఆత్మనుండి నిర్గమించి, మనస్సుచేత వికృతము చేయబడకుండా, విశుద్ధము గావించబడిన మనసత్తకు అందించబడే పరమధర్మమునకు తప్ప మరేనియమానికి మనము తలయొగ్గము.

"ఇక దీనిని మనము సరిగాచేయగలిగితే, మన ఉచ్ఛతమ ఆత్మను కనుగొనడంలోనే, అన్నింటియందలి ఆత్మను కనుగొన్నామని తెలుసుకుంటాము; అలాగే మన ప్రకృతికీ, జగత్ప్రకృతికీ అధీశ్వరుని తెలుసుకున్నవారమవుతాము; విశ్వముయొక్క సర్వము (విరాట్టు) కూడ అయిన మన సర్వమును కనుగొన్న వారమవుతాము. కారణం, దేనిని మనము మనయందు గాంచుతున్నామో, దానిని అన్నింటియందు మనము చూడడం సంభవించి తీరును. ఏలన, అదే భగవంతుని ఏకతాసత్యమునకున్న

శక్తి: మన సత్తయొక్క శ్రేష్ఠసత్యమును కనుగొని, సరిగా ఉపయోగింతు మేని, మన వ్యక్తిత్వానికీ, విశ్వానికీ,మధ్యఉన్న అడ్డుగోడ బలవంతముగా తెరుచుకొని కూలిపోతుంది. అపుడు మనసత్తయందే మనము సాక్షాత్కరించుకున్న శ్రేష్ఠసత్యము మనకొరకు విశ్వభావమునందు తనను తాను సాక్షాత్కరించు కొనక తప్పదు. అలాంటి సాక్షాత్కారములో విశ్వాత్మే మన ఆత్మఅవుతుంది!"

ఈ పరిణామమునే ఉపనిషత్తులలోని మహావాక్యపరముగా ఇపుడు అరవిందుడు మనకు వెల్లడించుతున్నారు. ఇక్కడే అరవిందుని ప్రతిభ పతాకస్థాయి నందుకుంటోంది: 'విశ్వాత్మే మన ఆత్మ అవుతుంది!' అని పైన చెప్పి, ఇంకా అంటున్నారు :

"మనలోనే 'సోఽహం' (నేను అతడను) - అనే వేదాంత వాక్యమును ఉపలబ్ధమొనరించుకుని, మన చుట్టును ఉన్న ప్రపంచమును పరికించినపుడు, ఆ వాక్యమునకు అవతలి పార్శ్వమునందున్న, ఏకతాజ్ఞాన ప్రేరకమగు 'తత్త్వమసి (నీవు అది) అనే వేదాంత వాక్యమును ఉపలబ్ధ మొనరించుకొనకుండా ఉండలేము. ఇట్టి మహత్తర ఏకీకరణ గమ్యమును చేరుకునే నిమిత్తం మన సాధనను ఎంత ఆచరణాత్మకముగా నడుపుకోవాలో—దానిపట్ల శ్రద్ధవహించితే చాలు".

శ్రీఅరవిందుని అనుసరించి 'సోఽహం'వాక్యం మనకూ, మనలోని అత్యున్నత ఆత్మకు ఉన్న ఐక్యమును చెప్పి, ఆ ఐక్యమునకు దారి తీస్తూ ఉండగా, 'తత్త్వమసి' వాక్యము మనకూ, మనచుట్టూ ఉన్న ప్రపంచానికి ఐక్యమును చెప్పి, ఆ ఐక్యమునకు దారి చూపుతోంది. 'తత్త్వమసి' లోని తత్ = అది, అవ్యక్త పరబ్రహ్మమును గాక, వ్యక్తమగు విశ్వ

బ్రహ్మమును ప్రతిపాదించుతోంది. ఇది శ్రీఅరవింద వ్యాఖ్యానములోని అపూర్వ విశేషము.

సాంప్రదాయిక జ్ఞానయోగములో 'తత్త్వమసి' ఉపదేశ వాక్యము. తత్త్వమసి = నీవు అది అయి ఉన్నావు – అని గురువు శిష్యునికి ఉపదేశించును. ఇచ్చట తత్ = జగద్వివర్జితమైన బ్రహ్మము. త్వం = ప్రకృతి వివర్జితమైన శుద్ధమగు అహం (నేను). అంటే ప్రకృతి వియుక్తములైన జీవ బ్రహ్మములకు మాత్రమే ఏకత్వము. ఇట్టి ఉపదేశము తర్వాత శిష్యుడు దాని సత్యమును సాక్షాత్కరించుకుని 'అహం బ్రహ్మాస్మి' అని తన అనుభవమును తెలుపును. అంటే 'అహం బ్రహ్మాస్మి'లోని బ్రహ్మయే 'తత్త్వమసి' లోని తత్తు. అంతేగాని తత్తు శ్రీ అరవిందుడు చెప్పినట్లు, చుట్టును ఉన్న జగత్తును పరామర్శించదు. ఈ పరిసర ప్రపంచము వ్యావహారిక సత్యము మాత్రమే. 'అహం బ్రహ్మాస్మి' అనే కేవల నిశ్చలానుభవములో అది సున్నయై పోతుంది.

అనుభవ వాక్యముగా, అంటే స్వీయాత్మానుభూతికి సంబంధించిన అనుభవవాక్యముగా శ్రీఅరవిందుడు'అహం బ్రహ్మాస్మి'ని గాక, 'సోఽహమస్మి'ని స్వీకరించారు. ఇందులో కూడ ఇంచుక విశేషముంది. నేను బ్రహ్మను – అని గాక, నేను అతడను – అనిచెప్పి, నేను యొక్క చరమ రూపమును పురుషవాచకము చేస్తున్నారు. మన స్వరూపము వ్యక్తిత్వ సహితమే గాని రహితముగాదని చూపుతున్నారు.

సంప్రదాయ జ్ఞానములో తత్త్వమసి–తో బోధన ప్రారంభముకాగా,

శ్రీఅరవింద యోగములో తత్త్వమసి-తో అంతమొందుతోంది. అంటే, మన నిజస్వరూపమును ముందుకనుగొని, తన్మూలకముగా బాహ్యప్రపంచముతో ఏకత్వమును తత్త్వమసి-ద్వారా సాధించుకుంటున్నాము.

ఈ విధముగా తత్త్వమసి-ని ఏకతాజ్ఞానమునకు చరమ సోపానము జేసుకొన్నారు అరవింద మహానీయుడు. ఏకతాజ్ఞానమే జ్ఞానమని చెప్పి, ఆ జ్ఞానమునకు ఆచరణ యోగ్యముగా మలచుకొన్నారు తత్త్వమసి-ని. అందుచేతనే 'ఎంత ఆచరణాత్మకముగా నడపుకోవాలో-దానిపట్ల శ్రద్ధవహించితే చాలు' అనిపైన ముగించారు, అరవిందుడు.

"మన ప్రపంచదృష్టి దాని ఏకత్వముపట్ల పట్టుసడల నీయదు" అనిపైన ఒకచోట శ్రీ అరవిందుడు ప్రతిపాదించారు. ఏందుచేత? ఒకే మూలతత్త్వం జగద్రూపముగా అభివ్యక్త మయింది. అందుచేత జగత్తులో ఎన్నివిరాడాది అంతస్థు లున్నప్పటికీ, ఆ అంతస్థులు వేరుపడి పరస్పరసంబంధమును కోల్పోవు. వాటి అన్నింటిలోను ఆ మూలతత్త్వమే తన అనభివ్యక్తరూపములో అనుగతమై ఉంటుంది. కావుననే సమస్తజగత్తునకు ఏకత్వమును శ్రీ అరవిందుడు వక్తిచెప్పును. అంతేగాదు; మనయందే అనుగతమై ఉన్న ఆ మూలతత్త్వము ద్వారా ఈ ఏకత్వమును సాక్షాత్కరింపజేసుకోడానికి మార్గమును చూపారు.

ఆ మార్గమే మన, మనయందలి ఆత్మలో మునిగిపోకుండా దానిలో దానికొరకు నివసించడం నేర్చుకోవాలి. అపుడు ఆ ఆత్మయే ఇతరము నందుకూడ ఉన్నట్లు, ఇతరముకూడ అయినట్లు సహజముగానే తెలియ వస్తుంది.

ఇలా ఉత్తమాత్మలో, ఉత్తమాత్మకొరకే సచేతనముగా జీవించడం మనస్సునకు సాధ్యము కాదు. కావున అలా జీవించాలనే పట్టుదలను కొనసాగించినపుడు, మనస్సునకు పైనున్న చేతనా స్తరములను మనము కనుగొంటాము. ఆ ఉత్తరోత్తర చేతనలు ఏకతాజ్ఞానానికి సమర్థములై ఉంటాయి. ఈ ఉత్తరోత్తర చేతనలను కనుగొనడంలో శ్రీ అరవిందుని వైశిష్ట్యము విస్పష్టముగా దీపించుతుంది.

—→: o :←—

# భారతదేశము — మాతారవిందులు

భారత దేశముయొక్క నిజాత్మను, భారతదేశముయొక్క భవ్య భవిష్యత్తును మాతారవిందులు గుర్తించినంతగా మరెవ్వరైనా గుర్తించారేమో తెలియదు. ఉదాహరణకు : కనీసం ఈ చతుర్యుగ పర్యంతం భారతాంబయే పృధివీ ప్రపంచమును నడిపించవలసి ఉన్నదని శ్రీఅరవిందులు ఒక సందర్భంలో ఉద్ఘాటించారు. "ఆధ్యాత్మికంగా నేను భారతాంబ యొక్క బిడ్డనే" అని అమ్మకూడా మనకా రహస్యాన్ని వెల్లడించారు. అట్టి భారత దేశమును ఉద్ధరించటానికి మాతారవిందులు తమ తపస్సును ఎంతగా ధారపోశారో, దానినీ ప్రకరణంలో సూచనగానైనా తెలుసుకోగలము. ఈ విషయమున అమ్మ ఆవేదన తెలుసుకొన్నప్పుడు మన ఒళ్లు జలదరించగలదు.

## భారతాంబ అనుంగు బిడ్డ

### మూలం—శ్రీ అరవిందులు.

"దేనిని క్రైస్తవ మతము చేయజాలక పోయెనో, కొలదినాళ్ళు కొలది మంది కొరకు దేనిని సాధింప మహమ్మదీయమతము శ్రమపడెనో; యావజ్జగము కొరకు దాని నందింప హిందూ మతము ప్రయత్నించవలసి యున్నది. ఇందు నిమిత్తమే భారతావని విజృంభించినది; ఇందు

నిమిత్తమే భగవంతుడామెకు నవ్యప్రాణము పోసియున్నాడు. ఇందు నిమిత్తమే మహామహులు అహోరాత్రాలు కృషి సల్పుచున్నారు. ఇందు నిమిత్తమే ఆమె పుత్రుల హృదంతరాళములో ఆకస్మిక పరివర్తనము దీపింప నారంభించినది. ఈ మహోద్యమము రాజకీయాలతో పుట్టి ఆధ్యాత్మిక సంసిద్ధియందు పర్యవసించనున్నది.

"మానవజాతి తన పురోగతియందు ఈసారి వేయవలసిన అడుగు భౌతికముకాదు; ఆధ్యాత్మికము, నైతికము, మానసికము. దీని కొరకు స్వాతంత్ర్యము పొందిన ఆసియా, ఆసియాలో స్వాతంత్ర్యమును పొందిన ఇండియా నాయకత్వము వహించవలెను. మానవజాతి కొరకు మనము సాధించవలసిన కార్యము జాతికి జాతినే ఆధ్యాత్మికము కావించుట—జాతియొక్క ఆధ్యాత్మికీకరణము. దీనిని మరే జాతియు సాధించజాలదు.

"భారతము సమస్తజాతులకు భవ్య గురువు; మానవాత్మ యొక్క లోపలి రోగములకు వైద్య శిఖామణి. ప్రపంచజీవితమును నూతన మార్గము పట్టించి, మరొకసారి మానవాత్మకు శాంతి సామరస్యములను సమకూర్చుటయే భారతమునకు భగవంతుడు విధించిన భవితవ్యము."

పరిశీలన : ఈభవ్యవాక్యములను పలికిన దెవరు? ఇంకెవరు? అపూర్వ ద్రష్టయగు శ్రీ అరవింద మహర్షియే. ఇందు మనకు మకుటాయమానముగా కన్పించునవి రెండు:- 1 సమస్త జాతి యొక్క ఆధ్యాత్మికీకరణము. 2 దానికి భారతాత్మయే గురువు కావలసి ఉన్నది. మానవ బాహుళ్యము యొక్క ఆధ్యాత్మికీకరణమును—వ్యక్తుల యొక్కగాదు—ఇంతదనుక మరెవ్వ

రును సూచించినవారు కూడలేరు. అందువలన ఆయన అపూర్వద్రష్ట. తరువాత, ఇండియాయే యీభగీరథ ప్రయత్నమును సాధించవలయును, సాధించగలదు. ఆమెను అందుకు భగవంతుడు ఎన్నుకొనెను. ఈవిషయము ఎవరికి తెలియును ? పైగా, శ్రీ అరవిందుడు ఈరహస్యము భేదించి చెప్పినపుడు, దీనహీనదశలో, కొనఊపిరితో ఉన్నది భారతాంబ. అపుడు ఈమాటలను నమ్మశక్యము కూడ కాదు. ఈరహస్యమును ఉద్ఘాటించి పలికినదికూడ ఆ అపూర్వద్రష్టయే!

పై ఉదాహరణలోని మూడవ విశేషము : భగవంతుడు భారతావనికి నూతన జవసత్త్వములను పూరించియున్నాడు. ఆ భగవదాదేశము చేతనే మహామహులవతరించి తమ సర్వస్వమును ధారవోసి కృషి సల్పుతున్నారు. అట్టివారిలో అగ్రగణ్యుడు, భారతాంబ అనుంగుబిడ్డ, శ్రీ అరవిందుడు. పసితనము నుండియే ఈ అనుంగు బిడ్డ హృదయములో తల్లిసముద్ధరణమునకు తపించుచుండెను. తల్లి తరపున బిడ్డలందరి భారము తనపై వేసుకొనిన అనుంగు బిడ్డ. ఇక, మాతృశ్రీని చూస్తే, తాను ఫ్రాన్సులో పుట్టినప్పటికి, తాను భారతాంబయొక్క ఆధ్యాత్మిక శిశువుననీ, ఆధ్యాత్మికముగా భారతమే తన జన్మభూమియని అసందిగ్ధముగా చెప్పియున్నారు. భారతాంబకు ఎంతటి అనుంగుబిడ్డలు వీరు.

'అధ్యాత్మికముగా అంతయు మేమే'—ఈ సత్యము ఈ బిడ్డలిరువురికి అనుభవసిద్ధమని చెప్పడానికి అనేక సందర్భాలున్నాయి. అలా అనుభవసిద్ధము గావున, వీరే సమస్తము, సమస్తవిశ్వము, ఆ విశ్వములోని సమస్తలోకాలు.

ఇప్పట్టున ఈ విషయమును— అసాధారణ విషయమును —స్మరించు

కొని ప్రభావితుల మవుదాము : అప్పటికింకా అమ్మ పుదుచ్చేరి రాలేదు. కొద్దిమంది శిష్యులతో శ్రీ అరవిందుడు నివసించుచున్నారు. ఆ కొద్ది మందిలో శ్రీ వేలూరి చంద్రశేఖరంగారు ఒకరు. ఒకనాటి రాత్రి ఈయువకుడు ప్రశాంతవాతావరణములో పండువెన్నెల సాగరతరంగాలపై తన వైభవమును వర్షించుచూ ఉండగా తిలకించి, పులకించి సముద్ర తీరాన కొంతసేపు గడిపి,ఆ ఆనందమును అరవిందునితో పంచుకోవాలను కున్నాడు. శ్రీ అరవిందుని సమీపించి చూచేందుకు రమ్మని అనేక పర్యాయాలు నిర్బంధించాడు. చివరకు బైటపడి శ్రీ అరవిందుడు ఇలా అన్నారు: "చంద్రశేఖర్! ఎందరు సూర్యచంద్రులు, ఎన్ని మహా సాగరాలు నాలోనే ఉన్నాయో ఊహించ గలవా?" ఇది విన్నపుడు 'అహో! అరవిందుడు!' అని మనమేను జలదరించక పోదు.

ఈ విధముగా అన్నిలోకాలతోపాటు భారతాంబకూడ ఆధ్యాత్మి కముగా వీరి పుత్రికయే, వీరిలోనే ఉన్నది. అందుచేత 'భారతాంబ అనుంగు బిడ్డ' అన్నప్పుడు, భారతాంబ వీరిఅనుంగు బిడ్డ-అనే అర్థమును కూడ మనము స్వీకరించవలసి ఉండును. ఇలా భారతాంబ అనుంగు బిడ్డలై, భారతాంబయే వీరి అనుంగుబిడ్డఅయిన ఈ మహనీయులకు ప్రణ మిల్లుదము.

## విజ్ఞాపన

### (Invocation)

ఓ మా తల్లీ! ఓ భారతాత్మా! అత్యంత విషాద దినములలో కూడ నీవు నీ బిడ్డలను విడనాడలేదు—నీ మాటను పాటించక పెడదారిని

బిట్టి, పరప్రభువులను సేవించి, నిన్ను నిరాకరించినపుడు కూడ నీవు నీ బిడ్డలను కాదనలేదు. అది గతించి, ఇపుడు వారు మేల్కొని లేచారు. నీముఖారవిందమునందు విముక్తియొక్క ఉషోదయ కాంతులు లాస్యము చేయగనుచున్నాము. ఇట్టి మహత్తర ముహూర్తమున ఇవే నీకు మా ప్రణతులు !

ఇపుడు మాముందు ఆవిర్భవించుతున్న స్వాతంత్ర్య దిగ్వలయమే యథార్థమగు ఘనతావలయము కూడ నైమించునట్లును, జాతి సమితి యందు నీ సత్య జీవితముయొక్క తేజోవలయమై విరాజిల్లునట్లును మమ్ములను నడిపించుకొనుము. జననీ! మే మెల్లపుడు ఉదాత్తాశయముల పక్షమునే అవలంబించులాగునను, ఆధ్యాత్మిక పథములయందు నాయకురాలవు, సమస్త జనులకు సుహృత్ సహాయకురాలవుగా నున్న నీ నిజరూపమును మానవాళికి చూపగలుగునట్లును ఓ మాతృమూర్తీ, మమ్ము నడపించుకొనుము.

15-8-47 ....మాతృశ్రీ

## భారతదేశము—తల్లిగారి ముఖ్యసందేశములు

1. నేటి మానవజాతి కష్టము లన్నిటినీ ప్రతిబింబించే దర్పణమైనది, భారతదేశము. ఈ పవిత్ర భారతావనియందే మానవజాతి పునరుత్థానము నందగలదు, సమున్నత, సత్యతర జీవితములోనికి పునరుత్థానము నందగలదు.

2. ఇప్పటి అత్యవసర పరిస్థితిలో ప్రతి భారతీయుడు ఏమి చేయాలి. అతని కర్తవ్యమేమిటి ?

భారతదేశముయొక్క ప్రప్రథమ సమస్య తన ఆత్మను కనుగొని, అభివ్యక్తము చేయడమే.

3. దైవశక్తి మాత్రమే భారతావనికి బాసటయై తోడ్పడగలదు. భారతీయులయందు ఆత్మ విశ్వాసమును, అన్యోన్య సామరస్యమును నీవు పెంపొందింపగలుగుదువేని, మానవకృతమగు ఎట్టి శక్తినైననూ మించి అది మనకు తోడ్పడగలదు.

4. భారతీయులను ఏకము చేయగలిగినది భారతాత్మ మాత్రమే.

5. భాషా విషయములోవలె స్వభావములో, శీలములో, సంస్కృతిలో బాహ్యముగా ఎంతో భేధముంది భారత దేశములో వివిధ రాష్ట్రముల మధ్య. కనుక వాటిని కృత్రిమముగా ఏకము చేయజూచే ఎట్టి ప్రయత్నమైనను విపరీత ఫలితాల నివ్వగలదు !

6. కాని ఆత్మయందు భారతావని ఏకమే. ఆధ్యాత్మిక సత్యము పట్ల భారతాత్మకు తీవ్రమగు ఆకాంక్షకలదు; అలాగే సమస్త సృష్టి యొక్క అంతర సమైక్యముపట్ల, సర్వ జీవితానికి దైవమూలత్వముపట్ల కూడ అదే ఆకాంక్షగలదు. ఇట్టి ఆకాంక్షతో అనుసంధించుకుంటే అశేషదేశము తన సమైక్యతను తిరిగి పొందగలదు. నిజానికి ఈ సమైక్యము విశిష్టమనీషావంతులకు ఎప్పుడూ లుప్తముకాలేదు.

7. భారతవైభవానికి మనము పాటుపడుదుము గాక!

8. తన సజీవ ఆత్మయొక్క అండదండలతో, ఆశీస్సులతో ప్రాప్తించే తన సన్నిహిత భవిష్యత్తుయొక్క సాక్షాత్కారమునందు భారత మాతయొక్క గతవైభవము పునర్భవము నందుగాక!

6-5-1971 —మాతృశ్రీ

పై 8 సందేశముల అన్వయము:

ఇప్పటి భారతమున అనేక జాతులు, మతాలు, భాషలు, దారిద్ర్యము, అజ్ఞానము, స్వార్థపరత, అలసత్వము: ఇత్యాది దోషాలు తీవ్రముగా లుకలుక లాడుతున్నాయి. కావున ఈదేశ సముద్ధరణముతో మానవజాతి సమస్యలన్నీ పరిష్కృతమైనట్లే. ఇట్టి భారతావనికి ప్రతిబింబము శ్రీ అరవిందాశ్రమము. కావాలనే శ్రీమాతారవిందులు ఉచ్చ నీచ స్వభావాల నన్నింటిని ఆశ్రమములో చేర్చుకున్నారు. అందుచేత ఆశ్రమ పరిధిలో పరివర్తనము సాధించగలిగితే, భారతమునందు, బైటి ప్రపంచమునందుకూడ అది సాధ్యపడుతుంది. (1)

కాని భారతపునరుత్థానము భారతీయులలో ఆత్మవిశ్వాసమును, అన్యోన్యతను ఆవిర్భజేయడముపై ఆధారపడి ఉన్నది. ఏలన చరిత్రను తిరగవేస్తే, మన పతనానికి కారణము మన అనైక్యత, పరవ్యామోహమేనని తెలిసిపోతుంది. కావుననే శ్రీమతి ఇందిరాగాంధి మాతృశ్రీని దర్శించినపుడు, పార్టీ రాజకీయాలకు స్వస్తి చెప్పి, సమైక్య రాజకీయాలకు శ్రీకారముచుట్టమని సందేశమిచ్చారు. (3)

పైగా, దైవము తప్పితే మానవశక్తి కార్యకారి కాలేనంత దిగజారిపోయింది భారతము. కాని దైవసహాయానికి సహకారము, సామరస్యము తప్పనిసరి. ఆప్రాతిపదిక మీదనే దైవశక్తి పనిచేయగలదు.

(చూ. 1973—సందేశము) అందుచేతకూడ అన్యోన్యత ఆవశ్యకము. (3)

కాని ఈసమైక్యత కమ్యూనిష్టుదేశాలలో వలే బాహ్యామునుంచి విధించబడజాలదు. కారణము, భాషాదిక తీవ్రభేదాలు అట్టి బలాత్కారమును ఎంతోకాలము సహించవు. (5)

అయితే ఈసమైక్యమును ఎలాసాధించాలి? భారతీయులలో భాషాదిక బాహ్యావ్యవహారాలు భిన్నమైనా ఆత్మఒక్కటే. అదిగో, అదే మన తరణోపాయము ! (6)

అదృష్ట వశాత్తు మహనీయులగు మన పూర్వఋషుల తపః ఫలితముగా అట్టి ఏకాత్మయందు మనకు, కనీసం అంతరాంతరాలలో, విశ్వాసము గలదు. తత్ప్రాప్తిపట్ల ఆకాంక్షకూడ కలదు. నిజానికి ఇట్టి ఏకాత్మ సాక్షాత్కారము కలవారు భారతభూమి యందు ఏకొద్దిమందో ఎప్పుడూ ఉంటూనే వచ్చారు. (6)

కనుక ఇప్పటి భారతీయుని ప్రథమ కర్తవ్యము భారతాత్మను గుర్తించి అభివ్యక్తముచేయడమే ! (2) ఈప్రయత్నమే భారతవైభవోపేత పునరుజ్జీవనానికి మూలకందము. (7)

ఒక్కసారి ఈ భారతాత్మను మేల్కొల్పామా, ఇక ఆత్మయొక్క జవసత్వముల చేతనే, తేజోవైభముచేతనే, భారతావని తిరిగి తన సమున్నతి నందుకొని, అతిమానస భవిష్యత్తును నిర్మించుకుని, మానవాళికి ధ్రువతారయై దారి చూపగలదు. భారతము ద్వారానే తమ మహత్తర కార్యమును సాధించ దలిచారు మాతారవిందులు. (8)

## బ ల ము

మనకిపుడు లోపించినదియు, తక్కిన వానికంటె ముందు మనము పొందవలసినదియు బలము. బలమును ఎంతెంతలోతుగా పరిశీలింతుమో, అంతంత అధికముగా బలము అవసరమని మనకు నమ్మకము కలుగగలదు. బలమనగా—శారీరక బలము, మానసిక బలము, నైతిక బలము, అన్నింటిని మించి ఆధ్యాత్మిక బలము. ఈ ఆధ్యాత్మిక బలమే తక్కిన బలాలకు అక్షయము, అక్షరమునగు ఏకైకజన్మస్థానము. బలమే ఉన్నయెడల, తక్కిన దంతయు మనకు సులభముగా, సహజముగా వచ్చి ఒనగూడును. ఆ బలమే లేనపుడు స్వప్నము నందలి వ్యక్తుల వలె నుందుము: ఆ వ్యక్తులకు చేతులు ఉండును గాని పట్టుకొనలేరు. పాదములు ఉండును గాని పరుగెత్తలేరు.

....ఇండియా సజీవముగా వర్ధిల్లవలెనంటే, ఆమెకు పునర్యౌవ్వనమును కల్పించవలెను. మహోద్ధృతముగా దుముకుచున్న శక్తి ప్రవాహములను ఆమెలో ప్రవేశ పెట్టవలెను. తమ ఇచ్ఛననుసరించి విశాలమో, తీవ్రమో, ప్రశాంతమో, సంక్షుబ్ధమో అగుచుండు పెను కెరటములవలె, భారతాత్మయు, ప్రాచీన కాలములయందు తాను వెలసి మించినట్లు, క్రియాసాగరమో, శక్తిసాగరమో కావలెను.

—శ్రీఅరవిందుడు.

వ్యాఖ్య :— ఒకసారి సోదరి నివేదిత "భారతీయు లెంతసాత్వికులు !" అని ప్రశంసా వాక్యము పలికింది వివేకానందుని సమక్షములో. అపుడు స్వామి అందుకొని "అలాంటి సాత్వికులు కాకపోతే నేను చాల సంతోషించేవాడిని." అన్నారు : ఆయన భావము, అది సత్వముగాదు. సత్వరూపముగా నటించే తమస్సు— అని.

వివేకానందుడు, చిత్తరంజన్‌దాసు, తిలక్ మున్నగు మహాశక్తి మంతులు మరొకదేశములో జన్మించి ఉంటే, వారి శక్తివలన ఆ దేశము ఎంతో పురోగతి సాధించి ఉండేది. కాని భారతదేశము అత్యంత తమోగ్రస్తముగావడము వలన, వారి ప్రచండశక్తి కూడ భారతీయ జనతను అంతగా కదిలించలేక పోయింది. అందుచేత ప్రచండశక్తి ప్రవాహమును భారత శరీరములో ప్రవహింపజేసినపుడే, అది తమస్సును విడగొట్టుకొని, లేచి కనులు విప్పికార్యోన్ముఖము కాగలదు—అనికూడ అరవిందుడు అభిభాషించారు.

శ్రీ అరవిందుని యోగములో లక్ష్యము మోక్షముగాదు, ప్రకృతి పరివర్తనము. గనుక, శక్తి, అధికతరశక్తి, అతిమానసశక్తి ఇక్కడ అత్యంతావశ్యకము.

శ్రీ అరవిందునికి అమ్మసహయోగము ఎంత అవసరమో, ఆవశ్యకమో, ఇప్పుడు మనకు అంతుచిక్కగలదు. అమ్మ శక్తిస్వరూపిణి గదా!

## ఆర్య లక్షణములు

వ్యక్తులకు, ముఖ్యముగా తలయెత్తుచున్న యువకులకు మేము చెప్పునదేమన— "భారతసేవను చేయుడు, భగవత్కర్మను చేయుడు!" అని..........శరీరరీత్యా మీరేమియుకాదు, ఆత్మరీత్యా మీరేసమస్తము. భారతీయుడే సర్వమును నమ్మగలడు. సర్వమును ఎదుర్కొనగలడు. సర్వమును ఆహుతి చేయగలడు. అందుచేతమున్ముందు భారతీయులు గండు మీ పిత్రార్జితమును పునరుద్ధరించుకొనుడు. ఆర్య విజ్ఞానమును, ఆర్యశిక్షణను, ఆర్యశీలమును, ఆర్యజీవితమును పునరుద్ధ

రించుకొనుడు. మీవేదాంతమును, మీగీతను, మీయోగమును తిరిగి చేపట్టుడు. కేవలము బుద్ధియందో, భావమునందోకాక, మీ జీవితము లందు వానిని రూపొందించుకొనుడు. వానిని జీవితమునందు అనుష్ఠింపుడు. మీరు ఘనులు, శక్తిమంతులు, బలయుతులు, అజేయులు, నిర్భయులు కాగలరు. అపుడు జీవనముగాని, మరణముగాని మీకు భీతికలిగింపదు. కష్టము, అసాధ్యము—అనుమాటలు మీపదజాలము నుండి అంతరించును. ఏలయన. ఆత్మయందు శక్తి శాశ్వతమై వెల్గొందు చున్నది. అందుచేత మీ ఆత్మ రాజ్యమును, ఆంతర స్వరాజ్యమును ముందు సాధించుకొనవలయును. పిమ్మట బాహ్య సామ్రాజ్యమును మీరు సాధించుకొనగలరు. అక్కడ, ఆంతర స్వరాజ్యమున మీకు శక్తి నివ్వదలంచి మాతృదేవి మీ పూజకొరకుప్రతీక్షించుచున్నది. ఆమెయందు నమ్మకముంచుడు. ఆమెను సేవింపుడు. మీ ఇచ్ఛలను ఆమె ఇచ్ఛలో లీనము చేయుడు. మీ అహంభావమును దేశము యొక్క మహా అహంభావమున అంతరించనిండు. మీపృథక్స్వార్థపరత్వమును మానవాళి సేవకు కైంకర్యముచేయుడు. సమస్త బలమునకు మీలోనేయున్న మూలమును తిరిగి ప్రాపింపుడు. అప్పుడు తక్కినదంతయు మీకుకలిసి వచ్చును— సాంఘికసౌష్ఠవము, బౌద్ధిక వైశిష్ట్యము, రాజకీయ స్వాతంత్ర్యము, మానవవిజ్ఞానముపై ఆధిపత్యము, ప్రపంచనాయకత్వము.

— శ్రీ అరవిందుడు

వ్యాఖ్య :— ఆధ్యాత్మిక సంస్కృతి విజ్ఞానములు ఆర్యుల ప్రత్యేకత. అన్ని శక్తులకు, అన్ని యుక్తులకు మూలము ఆత్మలోనే ఉన్నదని కనుగొన్న ప్రాచీన మహనీయులు వారు. ఆత్మవిజ్ఞానము చేతనే వారు ఆధిక్యమును పొందగలిగారు. వారి విజ్ఞానము

మన నరములలో ప్రవహించుతూనేఉంది. అందుచేత దానిని పసికట్టి పునరుద్ధరించుకోవడం మనకే ముమ్ముందు సాధ్యం. దానిని సాధించిన, స్వరాజ్య సామ్రాజ్యములు మన కరగతమై, ప్రపంచ నాయకత్వమును కట్టబెట్టును.

భగవతీ మాతృదేవి అంతరమున మనలను ఆశీర్వదించడానికి ఉవ్విళ్లూరుతున్నది. అంతరపూజచేత ఆమె దివ్యాశీస్సులను అందుకొని ధన్యులమగుదుముగాక !

## తలుపు తట్టిన దైవానుగ్రహము

"దైవానుగ్రహము ఇండియాకు సహాయము చేయడానికి సిద్ధముగా తలుపు దగ్గర వేచిఉంది. ఒక జాతి చరిత్రలో అట్టి అవకాశాలు అన్నప్పుడూ రావు. అనేక శతాబ్దుల సన్నాహము తర్వాత మాత్రమే ఏవో కొన్ని విరళక్షణములందు ఆ జాతికి దైవానుగ్రహము స్వయముగా వచ్చి ప్రత్యక్ష మగును. ఆ అనుగ్రహమును ఆమోదించి, స్వీకరించితేనే, ఆ జాతి కొనసాగి, దైవచేతనయందు నూతనముగా జన్మించి మించును. కాని ఆ పరమానుగ్రహమును ఆ జాతి నిరాకరించితే, ఇంకేముంది ? అనుగ్రహము మరలిపోగా, ఆ జాతి భయంకర బాధల ననుభవించును. విపత్తులు దానిని ముంచెత్తును !"

ఎవరిదీ దివ్యవాణి ? మాతృశ్రీ ఉత్కంఠతో పలికిన మహా వచనమిది. ఏ జాతిని గురించి ? ఏ జాతి పునరుజ్జీవనానికి మాతారవిందులు అహరహము, అహోరాత్రాలు కృషిచేస్తున్నారో, అట్టి భారత

జాతినిగురించే. తలుపు తట్టి, అనుగ్రహముచేతనే ప్రత్యక్షమైన ఆ పరమానుగ్రహమును భారతజాతి స్వీకరించిందా, తిరస్కరించిందా ? ఎలా స్వీకరిస్తుంది ? అభాగ్యులు, మందమతులు ఆ అదృష్టమును ఎలా ఆమోదించగలరు ? ఆ అవివేకానికి అమ్మ నుడివిన విపత్కర పరిణామమును ఊహించితేనే హృదయము కంపించుతుంది ! కాని అప్పటి అవివేక ఫలితముగా ఇంకనూ ఎట్టి విపత్కరపరంపరను ఎదుర్కొంటున్నామో, అనుభవపూర్వకముగా అది మనందరకు తెలిసిన విషయమే.

అమ్మ ఆవేదనతో పలికిన పై వచనానికి దారితీసిన ఘటనాపరంపరను గురించి ఇపుడు ఇంచుక తెలిసికొందాము. ఈ ప్రయత్నములో మాతృశ్రీ మనః పరిచయముకూడ మనకు కొంత కలుగగలదు. అవివేకాత్మకమగు వ్యతిరేకతను ఎదుర్కొన్నపుడు అమ్మ మనస్సు ఎలా పనిచేస్తుందో మనము చవిచూడగలము.

ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామము విజృంభించి చెలరేగుతున్న సమయమది. మాతృశ్రీ, అరవిందులు వైస్రాయి యుద్ధనిధికి విరాళమిచ్చి, మిత్రమండలిని బహిరంగముగా సమర్థించుతూ ప్రకటన గావించారు.

ఆశ్రమవాసులలోనే ఎంతోమంది ఆ చర్యను ఆమోదించలేకపోయారు. భారత జనతా బాహుళ్యమునకు వలెనే వారికికూడ ఆంగ్లేయులపట్ల ఆగ్రహావేశాలు గలవు. అట్టి ఆశ్రమసులలో 'మ'–అనువారు అరవిందుని తీవ్రముగా విమర్శించారుకూడ—

"బ్రిటిషు దాస్యమునుండి భారత విమోచనోద్యమానికి శ్రీ అరవిందుడు ఉజ్వల సంకేతమని, ఆశాజ్యోతియని ఉత్సాహముతో భావించాను. కాని ఆ అరవిందుడే ఇపుడు ఆ ఆశలన్నింటినీ వమ్ముజేసి ప్రతి పక్షమును సమర్థించుతున్నారు. ఎంత విడ్డూరము ! అలా సమర్థించకపోతే తన ఆశ్రమము అపాయములో పడునని కేవలము భయపడలేదు గదా ?" ఈ విధముగానే 'మ' పవిత్రగారిమీదకూడ విరుచుకుపడ్డారు. కాని అమ్మ సమక్షములోకాదు, ఆ విమర్శలు విసిరింది.

ఆనాటినుంచి, ఏమి జరిగిందో కాని, అమ్మ 'మ'-ను ఉపేక్షించి పరిహరించడం ప్రారంభించారు. ఈ నిరాదరణను 'మ' భరించలేక, దానికి కారణము ఊహించలేక, అమ్మను సమీపించి ప్రాధేయపడి అర్థించారు. తప్పును తెలిపిన సరిదిద్దుకొందునని వేడికొన్నారు. అప్పుడు తీక్షణముగా అమ్మ ఆయనతో అన్నారు—

"నీవు జన్మించడానికి ఎంతో పూర్వమే నిర్ణయించబడిన విషయాలివి. వాటిని గురించి ఎంతోకాలముగా మేము కృషిచేస్తున్నాము. ఇపుడు నీవు అణువుకంటె అల్పమైన నీ క్షుద్రబుద్ధితో- అదంతా శూన్యప్రాయమనీ, శ్రీ అరవిందుడూ, నేనూ దారి తప్పినామనీ, నీఆలోచనా పరంపరయే సరియైనదని నమ్ముతున్నావు. చూడండి : 'అణువుకంటె అల్పమైన నీ క్షుద్రబుద్ధితో' అని అమ్మ ఎంత నిర్దాక్షిణ్యముగా పలికారో అవివేకముపట్ల అంత కఠోరముగానూ, ఉండగలరు అమ్మ.

అమ్మలోని ఆ తీక్షణతను గమనించి, 'మ'-సోదరుడుకంగారుపడి- "అమ్మా! నేనేదో యాదృచ్ఛికముగా అన్నాను. ఉద్దేశ్యపూర్వకముగా కాదు. యథాలాపముగా అన్నదానికి ఏమి విలువ ఉంటుంది ?" అని

అనునయ పూర్వకముగా నివేదించుకున్నాడు.

"యథాలాపమా ? ఇది యథాలాపము క్రిందికి వస్తుందా?" అని అమ్మ నిగ్గదీసి, "చూడు! అందరిలోనూ విశేషించి నీవే శ్రీ అరవిందుని గురించి అలా భావించావంటే, అది నమ్మశక్యము గాకుండా ఉంది. ఆయన పత్రికలకు చేసిన ప్రకటనను నీవు చదువలేదా?" అని ప్రశ్నించారు అమ్మ. "చదివాను కాని" 'మ'–బదులు చెప్పారు. "చర్చిలుమాటేమిటి ? ఆయనను మీరు, అరవిందుడు మీ అవ్యవహితోపకరణముగా ఎన్నుకున్నారు. మీరు ఎన్నుకున్న ఆ చర్చిలే ఒక వైపున తన దేశము మనుగడకు భారతముయొక్క అంగబలమూ, అర్ధబలమూ అపేక్షించుతూనే, రెండవ వైపున బ్రిటీషు సామ్రాజ్యానికి చరమగీతము పాడే తలంపు తన ప్రభుత్వానికి లేదని కచ్చితముగా చెప్పివేశాడు."

"ఆ విషయము పరమేశ్వరునికే వదిలివేయి" అని అవధరించి పలికి, ఇంకా అంటున్నారు అమ్మ – "చర్చిలు మానవమాత్రుడు. తన ప్రకృతిని మార్చివేసికోవడానికి నమకట్టిన యోగిపుంగవుడు కాదు. కాని నేడతడు అసురులతో తలపడి భీషణ సమరము సలుపుతున్న ఒక జాతి యొక్క ఆత్మకు ప్రతినిధిగా వరలుతున్నాడు. పైగా ఇప్పుడతడు సరాసరి భగవంతుని చేతనే నడుపబడుతున్నాడు. అతని ఆత్మ భగవచ్ఛక్తికి దివ్యముగా ప్రతిస్పందించుచున్నది.

"అదీ గాక, దైవ పక్షాన ఎవరు పోరాడుతున్నారో, అసుర పక్షాన ఎవరో నీకు కానరావడం లేదా? చర్చిలులో లోపాలు ఉన్నమాట నిజమే. కాని, అతడు అతని దేశము భగవత్పక్షము నవలంబించాయి. నీ పొరుగువాడి ఇల్లు తగులబడుతుంటే, అతడు తప్పుచేశాడని నీవు

ఉపేక్షించగలవా? అలాగే చర్చిలు పక్షమును మనమిపుడు ఉపేక్షించజాలము. విరోధించే మాట దూరముగా ఉంచు,'' అని అమ్మ అనేకవిధాల బోధించారు. చర్చిలు నేర్పుతో భగవత్కార్యమును నిర్వహించుతున్నాడు. అతనిలో తప్పులున్నాయి - అంటావా? ఆ విషయము చర్చిలును పట్టి నడుపుతున్న భగవానునికే విడిచిపెట్టు - ఇదే అమ్మ బోధలోని సారాంశము.

యుద్ధ నిధికి విరాళము సమర్పించడములోని సముచితత్వమును అమ్మ ఈ విధముగా నచ్చజెప్పిన పిమ్మట, 'మ'-వ్యాకులచిత్తమును ఆవరించిన భ్రాంతిమేఘాలు తొలగిపోయాయి. తదాదిగా తనవలెనే మిత్రమండలి వారికి విరుద్ధముగా వాదించేవారి చిత్తవృత్తి ఆయనకు వినోదము మాత్రమే కలిగించినదని చెప్పుకున్నారు.

సరే, ఇలా కొంతకాలము గడచిన పిమ్మట, బ్రిటిషు ప్రభుత్వము భారతదేశమునకు పనిగట్టుకుని పంపిన క్రిప్సు రాయబారవర్గము యుద్ధ విధానమును గురించి, యుద్ధానంతర స్వాతంత్ర్య ప్రదానమును గురించి కొన్ని ప్రతిపాదనలు కావించింది. అవి ప్రకటింపబడిన సాయంకాలమే ఆశ్రమములో అక్కడా ఇక్కడా తీవ్రముగా చర్చలు చెలరేగాయి. ఆ మర్నాడు పవిత్ర గారి రూములోకూడ ఈ చర్చ ఉద్ధృతముగా విజృంభించి సాగుతోంది. (పవిత్రగారి గది అమ్మ గది ప్రక్కనే) అమ్మ స్నానాగారమునుంచి తన గదికి వెళ్ళుతూ ఆ ధ్వనిని విని ఆ గదిలో అతర్కితముగా ప్రవేశించారు. లాంఛనాలు పాటించకుండానే స్వయముగా ఒక కుర్చీ లాగుకుని కూర్చుని, ఏమిటిది? అని ప్రశ్నించారు. అక్కడివారు ఆ చర్చలోని ఖండనమండనల సంగతి అమ్మకు సూచనగా అందించారు. ఆశ్చర్యం! కొలది నిమిషాలకు పూర్వం సాధారణ భావముతో ఆ గదిలో

ప్రవేశించిన అమ్మలో – అమ్మ ముఖవర్చస్సులో – స్పష్టమగు మార్పు గోచరించింది. ఆమె ఇపుడు ఏ ఊర్ధ్వభూమికకో ఎగసి వెళ్ళారు! అక్కడి నుండి భాషింప ప్రారంభించారు.

ఆసమయమునందు ఆశ్రమములో టేపురికార్డు యంత్రములేదు. అందుచేత తర్వాత తమ జ్ఞాపకమును బట్టి అక్కడ అప్పుడు ఉపస్థితులై ఉన్నముగ్గురూ నోట్సుతీసుకున్నారు. ఆ నోట్సు చూపించినపుడు, అమ్మ ఆ ముగ్గురివ్రాతలను తిరస్కరించారు. తాను చేసిన ప్రవచనానికి వారి నివేదికలు మానసికమగు సర్దుబాట్లు మాత్రమే నని వ్యాఖ్యానించారు. ఆమె ఇంకా చెప్పిన దేమంటే, తాను భాషించుతూ ఉన్నపుడే వ్రాసుకున్న యథాతథమగు షార్టుహ్యాండు ప్రతి ఉంటే, దాని సాయముతో తాను తిరిగి అదే భూమికను అధిరోహించి, అప్పటి పలుకులను కాగితముపై కెక్కించ గలనని తెలిపారు! ఈ మాట ఆశ్చర్యకరముగా లేదూ? తాను కూడ ఆ భూమికకు అన్నపుడూ వెళ్ల లేరు ! విషయ ప్రాధాన్యము, వాదనలో మునిగిన ఉద్ధతావివేకము – ఇవే అపుడు అమ్మను ఆభూమికలోనికి పంపించి ప్రవచింపజేశాయి !

ఇంతకు ఆ ప్రేరిత ప్రవచన మేమిటి? "ముప్పై సంవత్సరాల తర్వాత స్మృతినిక్షేపమునుంచి సాధ్యమైనంతలో ఆ దివ్యవాక్కును మీ కందించ ప్రయత్నించుతున్నాను,"అనిచెప్పి 'మ'–గారు ఆ అమృతమును మనకు చవిచూపించారు. అందులోని ప్రథమపేరాను 'దైవానుగ్రహము ....' అనుదానిని ఈ రచనారంభములో ఆస్వాదించాము. తక్కిన దానిని ఇక్కడ పొందుపరుస్తున్నాను –

"కొన్ని మాసములకు, కేవలము కొన్నిమాసములకు పూర్వమే

ఫ్రాన్సుదేశకవాటము కడ ప్రత్యక్షమైంది, అదే దైవానుగ్రహము. శత్రువుతో (ఇనుమడించిన శక్తితో) పోరాడేందుకు ఫ్రాన్సుతో కలిసి ఏక జాతీయతను ఏర్పరచుకోడానికి చర్చిలు ఉదాత్తముగా చేసిన ప్రతిపాదనా రూపమైన దైవానుగ్రహ మది. అది సమీచీనమగు ఆలోచన అనీ, ఫ్రాన్సు దానిని ఆమోదించి ఉంటే, తన కార్యానికది అపారముగా తోడ్పడి ఉండే దని శ్రీ అరవిందుడు పచించారు. కాని ఫ్రాన్సు సాధారణ మనస్సును మించి పైకి వెళ్ళలేక పోయింది. ఆ ప్రతిపాదనను కొట్టివేసింది. ఆ విధముగా ఆ పరమానుగ్రహము ఉపసంహరించుకున్నది. ఫ్రాన్సు జాతీయాత్మ పతనమయి పోయింది. ఫ్రాన్సు యథార్థ స్వరూపము తిరిగి ఎప్పుడు తల ఎత్తునో ఎవరికెరుక?

"కాని ఇండియా అలా ఎందుకు చేయాలి? భారతభూమి యుగ యుగాలుగా ఆధ్యాత్మికోన్నతిని సాధించుకున్నది. అందుచేత క్రిప్సు ప్రతిపాదన వెనుక తొంగిచూస్తూ ఉన్న భగవదనుగ్రహమును ఇండియా గ్రహించగలగాలి! అది వట్టి మానవ ప్రతిపాదన మాత్రమే కాదు. హాం. దాని కారూపమిచ్చినది మానవ మనస్సే. అందుచేత అందులో దోషాలున్నమాట కూడ వాస్తవమే. కాని అది ఎంతమాత్రము ప్రధానముకాదు. దైవానుగ్రహమును నమ్మి సమస్తమునూ దానికే వదిలివేయుము. అదే అంతా చూచుకుంటుంది.

"భారతావనికి నేను చేసే ప్రగాఢమగు అభ్యర్థన ఇదే: ఆమె దానిని తిరస్కరించకూడదు. ఏ తప్పుచేసి ఫ్రాన్సు పాతాళములో పడిపోయిందో, ఆ తప్పును ఇండియా చేయకూడదు." ఇదీ అమ్మ ఉద్బోధము.

కాని ఆ మార్నాడే తాను ఆ ప్రతిపాదనను త్రోసిపుచ్చానని క్రాంగెసు ప్రకటించింది. కాని తల్లిగారు చలించలేదు. "ఇప్పుడు ఇండియాను విపత్తులు ఎదుర్కొంటాయి!" అని మాత్రమే పలికారు.

అమ్మ ఎంత ధీరోదత్త! ఆమె అత్యంత ఉదాత్త చిత్తురాలు గనుకనే తన హృదయపూర్వకముగు అభ్యర్థనను త్రోసిపుచ్చిన వారిని పల్లెత్తుమాట అనలేదు, కేవలము భారత భావిని గురించి బాధపడ్డారు. నాయకమ్మన్యుల మౌఢ్యమునకు విరక్తి చెంది తన ఆగమనకార్యమునకు స్వస్తి చెప్పలేదు. ధీరయై స్వశక్తిమీదనే ఆధారపడి భగవత్కార్యానికి అవిరళకృషిని కొనసాగిస్తున్నారు.

ఇప్పట్టున ఒక సాదృశ్యము స్మృతిసీమలో కదులుతున్నది: మహా విజ్ఞాని, న్యూటను మహాశయుడు తాను చేసిన అపూర్వపరిశోధనలను పొందుపరుస్తూ 'ప్రిన్సియా' అనే గ్రంథముయొక్క వ్రాత ప్రతిని పూర్తి చేశాడు. దానికి తన ప్రధాన జీవితకాలములో పది సంవత్సరాలు పట్టింది! ఆ గ్రంథముయొక్క చరమదశలో తాను వ్రాస్తూ వ్రాస్తూ ఆపి, అవసరము చొప్పున బైటికి వెళ్ళగా, తాను పెంచే కుక్కపిల్ల వెలుగుతూ ఉన్న కొవ్వొత్తిని ఆ వ్రాతప్రతిపైన ఆడుకుంటూ పడవేసిందట; ఇంకేముంది? పది సంవత్సరాల పరిశ్రమ అగ్గిపాలైపోయింది! వచ్చి, చూచుకుని న్యూటను ఎలా వ్యవహరించాడు? 'ఆ! నీవేమి చేశావు!' అని మాత్రమే పలికి, తిరిగి ఆ గ్రంథరచనకు నిర్మల చిత్తముతో పూనుకున్నాడట. అవును, పాపం కుక్కపిల్లకు ఏమి తెలుసు?— అనుకున్నాడు. అమ్మకూడ మన అవివేకమును గురించి అలాగే అనుకొని, తన మహత్కార్యమును నిర్వర్తించుతూనే ఉన్నారు.

క్రిప్సు ప్రతిపాదనలను తిరస్కరించి నందువలన సంభవించిన దేశ విభజన ఎలా ఘోర పైశాచిక కృత్యాలకు దేశమును గురిచేసిందో, అప్పటి ప్రధాని అయిన జవహర్‌లాల్ వాక్యాలలోనే విందాము. విభజన పిమ్మట ఆహ్వానము మీద అమెరికావెళ్ళి, అక్కడ ఆయన ఉద్వేగముతో పలికిన మాటలివి : "ఇలాంటి మహోపద్రవమే సంభవించుతుంది అనుకుంటే, మేము విభజనకు అంగీకరించే వాళ్ళమేకాదు. వేయి సంవత్సరాలైనా స్వాతంత్ర్యానికి వేచిఉండే వాళ్ళము!"

అహో! తలుపు తట్టిన దైవానుగ్రహమును కానలేక, ద్రష్టలగు మాతారవిందులు కని చెప్పినా, తుదకు అభ్యర్థించినా, చెవిని పెట్టక, తిరస్కరించి ఎంతటి దౌర్భాగ్యదశను కొని తెచ్చుకున్నాము !

## ప్రశాంత సంలీనము

మాతారవిందుల మాటవిని, వారి ననుసరించి వ్యవహరించితే మన కార్యములు ఎంత సులభముగా, ఎంత ప్రశాంతముగా సిద్ధించుతాయో, దాని కొక ప్రకృష్టనిదర్శనము.

రెండవ ప్రపంచ మహాయుద్ధము తీవ్రతరమై సాగుతూన్న సమయములో బ్రిటిషు ప్రభుత్వం కొన్ని ప్రతిపాదనలతో క్రిప్సు రాయబార వర్గమును భారతదేశము పంపించింది. ద్రష్టలగు శ్రీ మాతారవిందులు ఆ ప్రతిపాదనలను ఆమోదించమని సూచించారు, అభ్యర్థించారు కూడ : అమ్మ 'మ'—అను ఆశ్రమవాసిని మందలించుతూ వెల్లడించిన విషయాలు ఇప్పట్టున మనము గమనించాలి.

"నీవు పుట్టక పూర్వమే మే మీ (ప్రపంచ) పరిణామాలను చూచి, వాటిపై నిర్ణయము తీసుకుని, భారతభవితవ్యానికి కృషిచేస్తూ వస్తు న్నాము. ఇపుడు నీవు మా విధానమును విమర్శించుతున్నావుకదూ!"

ఈ విధముగా గతమునుంచే భవిష్యత్తును పరికించి, క్రిప్సు ప్రతి పాదనలను ఆమోదించమని ఆ ద్రష్టలు చేసిన హితోపదేశమును నాయ కమ్మన్యులు పెడచెవినిబెట్టి, పాటించలేదు. తత్ఫలితముగా ఎట్టి ఘోర విపత్తులకు మనము గురి అయ్యామో! అందుచేతనే మాతృశ్రీ మరొక సందర్భములో అన్నారు: "విపత్తు విరుచుకు పడేవరకు, సత్య మేదో గుర్తించడానికి మానవులు వేచిఉండవలసిందేనా?"

వేచిఉండనవసరంలేదు అని తెలియజేయడానికి ఒక చిన్న విష యములో ఇంచుక వివేకముతో వ్యవహరించింది భారత ప్రభుత్వం. దానినే చూద్దాము ఇపుడు:

దేశ విభజన జరిగిన తర్వాత, కాలము ముందుకు నడిచింది. శ్రీ అరవిందుడు తనువు చాలించారు. అప్పటికీ పాండిచ్చేరి మున్నగు నవి ఫ్రాన్సు అధీనములోనే ఉండిపోయాయి. ఈ ఫ్రెంచి రాజ్యమును ఇండియాలో కలుపుకోవాలని భారత ప్రభుత్వం, నాయకులు, సంప్ర దింపులు జరిపారు, యథాశక్తి ప్రయత్నించారు. కాని ఆ ప్రయత్నం ఫలించలేదు. దేశవిభజనవలన తగిలిన దెబ్బ, ఇప్పటి ప్రయత్నము లోని వైఫల్యం ప్రభుత్వ దృష్టిని మరొక వైపునకు త్రిప్పింది: ప్రభుత్వం సి. రాజగోపాలాచారి ద్వారా అమ్మదగ్గరకు దూతనుపంపి, తమ పలుకు బడిని ఈ విషయములో ఉపయోగించవలసిందని అర్థించింది. దానికి అమ్మ—

"నేను రాజకీయాలలో జోక్యం కలిగించుకోనుగా" అని సమాధానం చెప్పారు. అప్పుడు తెలివిగల ఆ దూత—

"ఇది శ్రీ అరవిందుడు ఆశించి, ప్రయత్నించిన కార్యము గదా!" అని విన్నవించుకున్నాడు. 'శ్రీ అరవిందుడు' అనే మాట అమ్మలో ఆలోచన రేకెత్తించింది ! (అరవిందుడు అమ్మకు ప్రభువు, అమ్మ అరవిందునికి దివ్యజనని !) ఒక క్షణమాగి అమ్మ, "కొన్ని రోజుల తర్వాత రండి, చూచి చెపుతాను." అని ఆ దూతను పంపివేశారు. ఈ 'చూచి చెపుతాను' లోని ఆంతర్య మేమిటి ? తన శక్తిద్వారా అంతకుముందు అంగీకరించని ఫ్రెంచి ప్రభుత్వమును సుముఖము చేయాలి !

అలాగే ఆ దూత తిరిగి వచ్చాడు. అప్పుడు అమ్మ—

"సరే ఫ్రెంచి ప్రభుత్వమునుంచి ఇక్కడకు ఒక ప్రతినిధి వస్తారు. వారితో రాయబారం నడపండి" అని చల్లటివార్త చెప్పారు. ఈ విధముగా గోవా సందర్భములోవలే యుద్ధము లేకుండా, ఫ్రాన్సు అధీనములోని భూభాగాల ప్రశాంత సంలీనము జరిగిపోయింది. భారత భూమిలో !

దేశవిభజనకు పూర్వంకూడ మాతారవిందుల మాటవింటే, భారత మాత ఇపుడు ఎంత భవ్యస్థితిలో ఉండునో !

—:o:—

# మాతృశ్రీ మహానుభూతులు

మాతారవిందులు సాధించ దలచిన కార్యంలో భౌతిక పరివర్తనం అతి ప్రధాన విషయం. ఆ పరివర్తన ద్వారా దివ్య జీవితమునకు సముచితాధారమగు శరీరామరత్వము కూడ మనకు లభించవలసి యున్నది. ఈ పరివర్తన విషయంలో ఏ విజ్ఞానమూ ఊహించలేని మహా ప్రయోగాలు అమ్మ యెలా చేస్తున్నారో దిఙ్మాత్రంగా ఇక్కడ దాని పరిచయమును పొంది "అహో అద్భుతం" అని అప్రయత్నం గానే మనం అనుకుంటాము. ఆ ప్రయోగాలను చూచిన మనకు యుగ ప్రవర్తకులంటే ఇలాంటివారే కావాలని అనిపించక మానదు.

## అమ్మ మంత్రములు

జూను 9, 1971 న అమ్మ ప్రతిపక్షశక్తుల విజృంభణమును గురించి తన సాక్షాదనుభవమును ఇలా వివరించారు.

"ప్రతిపక్షశక్తులు విరుచుకు పడుతున్నాయి. అది ఒక ఉన్మత్త తాండవము! ప్రతివానియందు ఒక తుఫానే చెలరేగుతోంది. ఆ తుఫాను భీబత్సము ఉపశమింపలేదు. ఏది పరాజితమయి, పరాస్తమయింది అను కున్నామో, అదే తిరిగి దూసుకుని మీద పడుతూ వుంది. మనము ఊహించనుకూడ ఊహించని వ్యక్తులలో ఆ శక్తులు దాడిచేస్తున్నాయి. అన్ని రూపాలలోనూ దాడి చేస్తున్నాయి, ముఖ్యముగా సందేహాలు, విద్రోహాల రూపములో. ఈ రూపమే అసురశక్తుల ముఖ్యస్వభావము.

హాం, అయితే, ఈ అసుర విజృంభణకు ప్రతిగా దైవ శక్తులుకూడ స్పందించ నారంభించాయి."

ఇదిగో, ఇదీ ఆనాటి పరిస్థితి. ఈ పరిస్థితిలో ఏమి చేయాలి? హనుమాన్ మంత్రమును పెక్కుమంది ఎందుకు జపించుతారు? పీడించే దుష్టశక్తులను దూరము చేసి, రక్షణవలయము కల్పించేందుకు. అలాగే అమ్మకూడ అనృతముయొక్క విజృంభణమునకు విరుగుడుగా సత్య మంత్రమును మనకు ప్రసాదించారు. ఆ సందర్భములో అఖిలభారతానికి మేలు కలిగించే సందేశము నిమ్మని అర్థించగా, అమ్మ ప్రసాదించిన మంత్రమిది –

Supreme Lord, Eternal Truth !
Let us obey Thee alone
and live according to
Truth.

సర్వేశ్వరా, సనాతన సత్యమా
మేము నీకు మాత్రమే విధేయులమై ఉండి,
పరమసత్యము ననుసరించి జీవింతుము గాక !

ఇది సందేశమా? మంత్రమా? మంత్రాత్మకమగు సందేశము, లేక సందేశాత్మకమగు మంత్రము! ఎందుచేత? మంత్రశక్తిని అందులో నిక్షేపించి, అమ్మ అందించారు. ఇది నిజమేనా? (ఈ ప్రశ్న కూడా అసురశక్తుల వంచనా ప్రేరణయే నేమో?) అలా శక్తిని తమ వ్రాతలలో నిక్షేపించడం మాతారవిందులకు ఉగ్గుతో బెట్టిన విద్య. శ్రీ అరవిందుడు సాధకులకు తాను వ్రాసిన లేఖలు కేవలమూ అక్షర సముదాయము

మాత్రమే కావనీ, మంత్రశక్తితో వాటిని పంపుతానని ఆ మహాత్ముడే స్వయముగా చెప్పారు.

ఈ మంత్రము నందించి, ఈ మంత్రముయొక్క సత్యమహిమతో ఎదుర్కొన వలసిన భయానకావస్థను మరికొంత వివరముగా వర్ణించు తున్నారు మాతృశ్రీ—

"ఇది అనృత కందము యొక్క భయంకర కల్లోలము. సకల ప్రపంచములోని ప్రతిమానవుడు – ఏ మాత్రము ఊహించని ప్రజలు కూడా – అబద్ధమాడుతున్నారు, సర్వత్ర అబద్ధమాడుతున్నారు. ఏదో మెలికలేని వ్యవహారమే లేదు, ఋజువర్తనము కన్పించనే కన్పించదు".

ఈ విధముగా అనృతభూతము సర్వమునూ వదిలేసి, వక్రింప జేస్తున్నది గదా, అయినప్పుడు మాతృశ్రీ దేహము మాటేమిటి? ఆ దేహము తనను తానే ప్రశ్నించుకొన్నది. "మంచిది, నీ అనృత మెట్టిది?" తనను పరికించి చూడగా, ఆ దేహముకూడ పాత కథనే పసికట్టింది తనలో: "ముఖ్యవిషయాల్లోనే భగవంతుని పిలవాలి."– ఇదీ దేహము వేసికొన్న ప్రశ్నకు వచ్చిన సమాధానం: అమ్మ నవ్వి, తన దేహమును అడిగారు : "అయితే అనుక్షణము భగవంతునితో ఉండా లని నీవు ఆశించవన్నమాట!" ఈ మాట తన దేహానికి చిన్న చెంపపెట్టు అయింది. కాని శరీరము ఎదురుతిరిగి వాదించలేదు, నమ్రతయే ఆ రూపము ధరించినట్లు అమ్మవైపుకు చూచింది. దానితో అంతదనుక చెలరేగిన – శరీర చేతనయందు చెలరేగిన – అనృతవ్యాపారము అడు గంటింది. ఆ నూతనావగాహన శరీరముయొక్క ప్రతి జీవాణువును ఆవేశించింది: దానితో ప్రతి విభాగమూ, సమస్తమూ కూడ నూతనావ గాహనయొక్క వెలుగుతో దీపించింది. ఇదే ఆ అవగాహన —

"నేను భగవంతుని (Divine) ద్వారానే జీవించుతున్నాను. భగవంతుని ద్వారా తప్ప నాకు జీవనాధారమే లేదు .... నేను భగవంతుడనై ఉన్నపుడే, నేను నేనుగా ఉండగలను. నాకై నేను లేను,మనజాలను". అటుపిమ్మట తన శరీరస్థితి మెరుగు పడింది. అవగాహన శరీరానికి లభించింది. అని అమ్మ సంతృప్తిని వెల్లడించారు. అవగాహన రాక పూర్వము శరీరములోని దుఃస్థితి ఎంత మిన్నుముట్టిందంటే, అమ్మకు ముద్దకూడ మ్రింగుడు పడలేదు.

దీని నుంచి, ఈ ఉజ్వల ఉదంతమునుంచి, మనము నేర్చుకోవలసిన గుణపాఠం? సత్యము ననుసరించి జీవించుతూ, కనీసం జీవింపగోరుతూ, "నీలోని అనృతమేది?" అని స్వయముగా ప్రశ్నించుకుని, ఆ అనృతమును పట్టి బైటకు నెట్టాలి. అవగాహన పొందాలి. భగవంతుడే ఆధారమూ, ప్రాణమూ అని అర్థము గావించుకోవాలి. అనుభవములో ఈ విధముగా చిత్తశుద్ధితో చేయ నమకట్టినపుడు అమ్మ మంత్రము, అమ్మ మనకు సాయపడి ఉద్ధరిస్తారు.

ఇక్కడ మనము అతి ముఖ్యముగా గమనించవలసిన ఒక మాయామర్మ మున్నది. 'ముఖ్య విషయాల్లోనే భగవంతుడు' – ఈ దృష్టి కొనసాగినంతకాలం అహం మిగిలే ఉంటుంది. దివ్యజీవనము దీనిలోనే ఉండిపోతుంది. అమ్మ శరీరంవలే మనము మన అహంను వెంటనే తుడిచివేయలేకపోవచ్చు. కాని అలా తుడిచి వేయడం మన సజీవ లక్ష్యము కావాలి. ఆ దెసకే అహరహము ప్రయాణము కొనసాగించాలి. అవుడే అహం నిర్ముక్తులమై అమ్మతో తాదాత్మ్యము నొందగలము.

అమ్మ శరీరానికి తాను భగవంతుని ద్వారానే జీవించుతున్నది –

అనే భవ్యానుభవము ప్రాప్తించింది – అని అమ్మ వెల్లడించి, "నీకు అడుగవలసినదేమైనా ఉందా?" అని శిష్యుని ప్రశ్నించినపుడు, ఆయన ఈ సందేహమును వెలిబుచ్చారు –

"భవితవ్యం (Destiny) బాగుండలేదని నా కనిపించుతోంది." దాని మీద మాతృశ్రీ —

"కాదు, ఆ సంశయము సత్యదూరము. ఈ సంశయముకూడ అనృతములో అంతర్భాగమే. అసలది అనృత స్వరూపమే. నీకు పొడమిన సందేహము ఒక ఉదాహరణము మాత్రమే. నిజానికి ఏదో ఇట్టి అనృతమే అందరి అంతరంగములను వేధించుతున్నది.

"నేను పైన చెప్పినదే, అంటే, నా దేహమునకు కలిగిన అనుభూతే సత్యం, పరమసత్యం! అంతేగాదు, అది మానవాళి భవితవ్యం కూడాను. దానినే ఇపుడు మరొక విధముగా సూత్రీకరించుతున్నాను :

"భగవంతుని కొరకు తప్పితే నేను లేను,
భగవంతుని ద్వారా తప్పితే నేను లేను,
భగవంతుని సేవలో తప్పితే నేను లేను,
భగవంతుడను కావడం రీత్యా తప్పితే నేను లేను."

అని అమ్మ మరొక సందేశమును, మరొక మంత్రమును ఇచ్చారు. ఇది ద్వితీయమంత్రం. ప్రథమమంత్రము సిద్ధాంత మంత్రమయితే, ఇది అనుష్ఠాన మంత్రము. అది ఉపదేశమంత్రమయితే, ఇది అనుభూతి మంత్రము. అది సత్యమును అవలంబించుము—అని ఉద్బోధించుతూ ఉంటే, సత్యరూపుడగు భగవంతుడను నేను కానప్పుడు, నేను

లేనే లేను—అని ఇది సత్యోపలబ్ధిని తెలియజేస్తోంది. ఇదే మానవజాతి పరమ భవితవ్యం. ఇదే అమ్మ తనువులో ప్రప్రథమముగా రూపుదాల్చింది.

ఇక్కడ ఒక రహస్యమున్నది. మంత్రశక్తితో అమ్మ సత్య మంత్రము నిచ్చారని చెప్పుకున్నాము గదా. అసురశక్తి విజృంభణమును తలదన్నగల దైవశక్తి రంగములో ప్రవేశించింది. మంత్రశక్తితో పాటు, ఈ మహాశక్తికూడ మనకండగా నిలిచింది, కాదు, మనపై దాడివెడలిన అసుర కూటమిని దూదిపింజలవలే ఎగురగొట్టి వేయడానికి ఉంకించుతున్నది! అందుచేతనే అమ్మ ఉద్ఘాటించుతున్నారు:

"అదే, అదే, ఆదైవమే (Divine) భయంకర ఖడ్గధారగా (తల్లిగారు బిగించిన పిడికిటిని క్రిందికి లాగుతూ) దర్శన మిస్తోంది. ఆసురశక్తుల విద్వేషము, విద్రోహము — ఈ చెత్త దానిముందు ఎగిరిపోతుంది. ఏది ఎదురొడ్డినా, ఆఖడ్గధార ముందు తుత్తునియలే!

"భవితవ్యం బాగుండలేదు, వినాశము పైకొంటోంది—అని భయపడుతున్నారే: దేనికి వినాశం? కాలం చెల్లిపోయిన అహంఅయ్యగారికే వినాశం, తానే సత్యసత్తనని మరపించడానికి ప్రయాత్నించుతూ ఉన్న ఈ అయ్యగారికే అవసానకాలం!

"ఇపుడు శరీరచేతనకు స్పష్టముగా బోధపడింది: అహం లేకపోయినా, శరీరము తాను తానుగానే ఉంటుంది. ఏలన, తాను తానుగా ఉండడానికి భగవదిచ్ఛ కారణంగాని, అహంమహాశయుడు కాదు. ఈ అహం మహాశయుడు కొంతకాలం — కొన్ని శతాబ్దులు— శరీరధారణకు సాధనగా ఉన్నమాట వాస్తవమే. కాని ఇపుడు దాని అవసరము లేనే లేదు. దానికి కాలదోషము పట్టింది;

ఇక ఇప్పుడు."

చేతన : అది భగవంతుడే,

శక్తి : అది భగవంతుడే,

క్రియ : అది భగవంతుడే,

వ్యక్తిత్వం : అది భగవంతుడే,"

అని అమ్మ తన దివ్యానుభవ కథనమును ముగించారు. ముఖ్యవిషయాల యందే భగవంతుడు కాదు, అన్నింటియందూ భగవంతుడు, అన్నీ భగవంతుడు. ఇదీ మన భవితవ్యం. ఇది భాగవత జీవనానికి భవ్య ప్రాతిపదిక.

శ్రీ అరవిందుడు రాజకీయరంగములో నున్నప్పుడు కాబోలు, మానవుని కొరకే తన యోగమని ప్రతిపాదించారు. తర్వాత దానిని మార్చి, భగవంతుని కొరకే తన యోగమని చెప్పి ఆశయమును పైకెత్తారు. ఏలన, భగవంతునికొరకే మానవుడు జీవించినపుడు, భగవంతునిలో మానవుడు పరిపూర్ణతను ప్రాప్తించుతాడు. మానవుడే మన యోగమున కాశయ మయినపుడు, మనము మానవపరిధిలోనే మిగిలిపోతాము. అమ్మ తన అనుష్ఠాన మంత్రములో మరొక అడుగు పైకి వెళ్లి — దైవము కొరకు నేను కాదు, దైవముకొరకు తప్పితే నేను లేనే లేను—అని అనుభూతిదీప్తిని దశదిశల ప్రసరింపజేస్తున్నారు.

మరొకసారి అమ్మ భగవద్గీతలోని పరమార్థమును ప్రస్తావించి అన్నారు :

"గీత నిపుడు సన్యాసపరముగా వ్యాఖ్యానించడం మూర్ఖతయే (stupidity) అవుతుంది. ఒక వేయి సంవత్సరాలకు పూర్వం- 500 ల సంవత్సరాలకు పూర్వముకూడ- అలాంటి వ్యాఖ్యానానికి కొంత అర్థం ఉంటే ఉండవచ్చు. ఇప్పుడు మాత్రం అది మూర్ఖత అంటే మూర్ఖత. కారణం. నూతనశక్తులు దిగి ఇపుడు పరివర్తనానికి ప్రబలముగా పనిసలుపుతున్నాయి. అన్నింటి కంటే ముఖ్యం, అది దైవసంకల్పము కాదు." ఆ సంకల్పమును తెలిపి నూతన మార్గములో నడిపించడానికే మహామహుల ఆగమనం. నూతనశక్తులు అవతరించాయి—— అని చెప్పిన వారెవరున్నారు ? చెప్పి వర్ణించిన వారెవరున్నారు ? వర్ణించి ఉపయోగించుచున్న వారెవరున్నారు ? ఈ విషయమున ఎంత అపూర్వం మాతారవిందుల మహనీయ చరిత్ర! గీతకు ఎన్ని వ్యాఖ్యానాలున్నాయో ! కాని భగవదిచ్ఛ అది అని వక్కాణించి, చేసిన వ్యాఖ్యాన మెక్కడుంది ?

ఈ విధముగా అమ్మ అందించిన మంత్రద్వయము తరణోపాయమును చూపుతూ, ఆ ఉపాయమును అనుసంధించడానికి మంత్రశక్తినీ, దైవశక్తినీ జోడించుతూ, ఆ అనుసంధానమువలన కలిగే 'మన సర్వమూ భగవంతుడే' అనే ఫలితమును వివరించుతూ, అదే మన పరమ భవితవ్యమని చాటుతున్నాయి.

## భౌతిక సాక్షాత్కారము

"ఇపుడు మన జీవితవిధానమే మారిపోవడానికి సిద్ధముగా ఉంది. అది మౌలికమైన మార్పు, మహత్వపూర్ణమైన మార్పు అని ఉద్ఘాటించి అమ్మ ఇంకా అంటున్నారు :

‘‘అయితే ఎంతో విచారకరము. ఈ మార్పును ఎవరూ, ఏదీ పసిగట్టనుకూడా పసిగట్ట లేదు. అయితే ఈ పసిగట్టని వారిలోకూడ రెండు తరగతులవారున్నారు. ఒకరికి ఆకాంక్షఉన్నది. ఇచ్ఛ ఉన్నది, తెలుసుకోవాలనేది వారికి ఒక అభిలాష మాత్రమేగాక, అవసరమై కూర్చుంది. ఆ ఆవసరము వారిని ఆకర్షించుతూ వుందికూడ. వారు తెలుసుకుని అదికావాలని ఆరాటపడు తున్నారు. ఇక రెండవతెగ వారున్నారు; వారునూతన జీవితమును ఆశించనే ఆశించరు. నూతన జీవితానికి గడ్డిపరక విలువకూడ ఇవ్వరు. వారు పొట్టపోసుకోడానికే సదా పరుగులిడుతూ ఉంటారు. అలాంటివారు రాజ్యాధికారులైనా, పాచిఊడ్చేవారైనా ఒకటే. వారందరి మనస్సు ఒకేవిధముగా స్పందించుతుంది. ఇలా వివరించి సమస్త సృష్టిలో మరొక జాడ్యముకూడ ప్రబలిపోయిందని మాత విస్మయము వెలిబుచ్చారు. అది ఏమిటంటే–

## మిథ్యాభిమానము

రామరామ ! రవంత అర్థముచేసుకోగలిగితే, అర్థముచేసుకోడానికి రవంత ప్రయత్నించితే, మానవులు తమనుతాము అసాధారణవ్యక్తులమని భావించుకుంటూ, ఆత్మాభిమానముతో విర్రవీగుతున్నారు. నిజానికి ఇప్పటి మానవుడెంత, అతని అవగాహనా సామర్థ్యమెంత ? శ్రీ అరవిందుడు నుడివినట్లు, నీవు ఒక్కసారి దివ్యచేతనను స్పృశించితే ఒకేసారి కళ్లెదుట కన్పించేదేమంటే – అహో ! సమస్త ప్రపంచము మిథ్యాభిమానముతో ఎంత హాస్యాస్పదంగా తయారయింది అని ఆశ్చర్య

పోతావు. మానవులనేగాదు, ఈ జాడ్యము పశువులను కూడ పట్టి పీడి స్తోంది. నాకు (అమ్మకు, ఇది స్పష్టంగా తెలుసు. పూర్వము వివిధ పశుగణాలతో సంపర్కముండేది. ఎంతటివంచన, ఎంతటి ఆత్మవంచన భయంకరమైన ఆత్మవంచన! పరవంచకులను గురించి ప్రత్యేకించి చెప్పుకోనవసరములేదు. ఆత్మవంచకులే అసాధారణ వ్యక్తులు. ఇందులోనే మానవులు ఆధిక్యమును సాధించారు, సత్యావగాహనలోకాదు!

ఈ ఆత్మ వంచన కారణంగా మనము దేనినీ ఉన్నది ఉన్నట్లుగా చూడడంలేదు. అయితే దీనికి మందేమిటి?—అని శ్రీఅమ్మ ప్రశ్నించి, ఇలా సమాధానించుతున్నారు :

## జాడ్యానికి మందు

దీనికి ఒకే ఒక రక్షణఉంది. భగవంతుని అంటిపెట్టుకొని, గట్టిగా ఆశ్రయించు. అంటిపెట్టుకొని ఉండిపో – ఇలా (చేతుల వ్రేళ్ళను కలిపి గట్టిగా పట్టుకొని అమ్మ అంటిపెట్టుకోవడమును అభినయించు తున్నారు).

## నూతన సాధన

ఈ విధముగా నా శరీరచేతన ఎంతో వికాసము పొందుతోంది. అధికాధికముగా శరీరము చేతనాస్ఫురిత మవుతోంది. అది రాబోవు సంగతులను ముందుగానే తెలుసుకుంటోంది. ప్రజలు తనకేమి చెప్ప బోతున్నారో, అవి దానికి ముందే తెలిసి పోతున్నాయి. అయితే మనస్సు

వలే అది ఆలోచించి తెలుసుకోవడంలేదు, ప్రాణమువలెస్పృశించి తెలుసుకోవడంలేదు. భావి సంఘటనలయొక్క తత్త్వము (Spirit) దానికి పొడకడుతోంది.

భగవంతుని ఒడిలో నేను ఒదిగి ఉంటాను. కేవలము స్వచ్ఛముగా భగవంతునికే చెంది ఉంటాను. అప్పుడు నాకన్ని విషయాలు తెలుస్తాయి, తెరమీద బొమ్మలవలే స్ఫురిస్తాయి. (శరీర చేతనతో ఏకమైన అమ్మ అంటున్నారు.)

శరీర మక్కడ ఆలోచించదు. లోన భగవంతుడు రూపొందించిన జ్ఞానము దానికి సహజముగానే అందుతుంది. అది ఆలోచనతో నిమిత్తములేని సాక్షాదింద్రియ జ్ఞానము (Sensation). అది మనస్సు ద్వారా వెలువడేసరికి వికృతమై వికారమొంది ఊరుకుంటుంది. దృష్టాంతమివ్వాలంటే, మనస్సును ఉపయోగించాలి. అందుచేతనే దృష్టాంతము జోలికి పోవడంలేదు. అది అజ్ఞానము, చాలా సరళము, సహజము. అయితేనేమి ? మనమెంత కృత్రిమ మయ్యామంటే మనకు వికృత మనోజ్ఞానము రుచించుతోందిగాని సరళ శరీరజ్ఞానముకాదు.

## సాధన కీలకము

ప్రపంచమును పైనుంచి, క్రిందినుంచి, అటునుంచి, ఇటునుంచి— ఎన్నోవిధాల చూడవచ్చు. ఆ విధముగా పిల్లల రూప దర్శిణి (Kaleido-scope) లోవలే ప్రపంచానికి అనేక రూపాలు కన్పిస్తాయి. అయితే

అసలు పరమ సత్యము మాటేమిటి ? ఆ సత్యము ఏ చూపుకు అంద దంలేదు.

"అందుచేత నాశరీరము చేసుకున్న చరమ నిర్ణయమిది (మాటలలో నేను చెప్పగలిగినంతవరకు): భగవంతునియందు సుఖముగా పొందుగు కొని వ్యాపించి ఉండడం, అర్థముచేసుకోడానికి ప్రయత్నంలేదు, తెలిసి కోవడానికి ప్రయత్నంలేదు అక్కడ. తద్రూపముగా (నివసించుట) ఉండడానికి మాత్రమే ప్రయత్నం.... .... అలా పొందుగుకొని ఉండడం: నేనిపుడు అలానే కాలము గడుపుతున్నాను." .... ...మాతృశ్రీ వ్రాసుకునే శిష్యునితో ఇలా అన్నారు తర్వాత:

"నేనలా ఉన్నపుడు అక్కడ ఏమి ఉంటుందని ఆరోజున అడిగినావుగాదూ ? ........అది ఒక ప్రయత్నము, ప్రయత్నముమాత్రమే (అది ఆకాంక్ష అనిగానీ, కృషి అనిగానీ చెప్పజాలను. అది చోదనకు దగ్గరగా ఉంటుంది). అక్కడ సత్యము యథాతథముగా ఉంటుంది. సత్యమును తెలుసుకోవాలనిగానీ, అర్థము చేసుకోవాలనిగానీ ఉండ దక్కడ. తెలుసుకోవడం, అర్థం చేసుకోవడం అక్కడ అప్రస్తుత మనిపిస్తుంది. ఉండడమే— ఉండడమే— ఉండడమే.... .... .... (To Be— To Be— To Be... ... ...)"

[అంటే, సత్యమును తెలుసుకోవాలంటే, సత్యముగా ఉండి తెలుసుకోవాలిగాని, సత్యమును ఆలోచించికాదు. మనసుతో ఆలోచించి నపుడు, అది వికృతమైపోతుంది].

## ఉభయ జీవితాలకు వ్యత్యాసము

శరీర చేతన అలా భగవంతునియందు నెలకొన్న సాయుజ్య జీవితానికీ, అది సంసారములో (భార్య బిడ్డలతో) పరిభ్రమించే సాధారణ జీవితానికీ హస్తిమశకాంతరముంది, కాదు, అమృత హాలాహలాంతర ముంది. (ఒకటి అద్భుతమైతే, ఒకటి అతిభీకరము; ఒకటి మనోహ రమైన పరబ్రహ్మ ప్రకాశము, ఒకటి సముద్ర మధనకాలమున బుట్టిన భయంకర విషవిజృంభణము.) ఇప్పటి జీవితము, సాధారణ చేతనలో మనము గడపే జీవితము, మానవదశలోని జీవితము — అది ఎలా కన్పించుతుందంటే.... .... .... ఓహో ! దారుణము, భయంకరము ! అందులో ఒక్క క్షణముకూడా ఎవడైనా ఎలా జీవించగలడని నీకు అడుగ బుద్ధిపుడుతుంది. ఇక అదే సమయములో నాకు అనుభూత మయ్యే రెండవది అగు భాగవత జీవితము. (అమ్మ ఇక్కడ తన కుడిచేతి వ్రేళ్ళను ఎడమచేతి వ్రేళ్ళలోనికి పోనిచ్చి భాగవత జీవితము యొక్క అన్యోన్య సమావేశమును సూచించుతున్నారు). ఒహో ! ఎట్టి శక్తి ! ఏమిశక్తి ! అది భౌతిక శరీరానికి సంబంధించిన శక్తికాదు (అమ్మ తన శరీరమును గిల్లి చూపించి, దాని శక్తి కాదని తెలియ పరుస్తున్నారు). సమస్తము తానే అయినట్టి ఒకానొక అనిర్వచనీయ మగు శక్తి అది.

"అందుచేత మిక్కిలి సహజముగానే దానిని అన్వేషించాలనే ఆసక్తి మనకు కలుగుతుంది. కడు సహజముగా, నా పని ముగిసినపుడు.... (అమ్మ తనలోపలికి వెళ్ళి భగవంతుని యందు విశ్రమించే అభినయము)" మళ్ళీ దీర్ఘ మౌనము తర్వాత,

"నీవే, నీ వాక్కుడవే" అని భగవంతుని ఉద్దేశించి అమ్మ ఉచ్చరించి, "ఆ అద్భుతమగు ఆహ్లాదము—అదే సృష్టి కంతటికీ ధ్యేయమని సుస్పష్టమే !" అని అమ్మ చిరునవ్వుతో సరిపుచ్చారు.

(సెప్టెంబరు 1, 1971 నాటి అమ్మ సంభాషణ.)

## భౌతిక సాక్షాత్కారము ఘనిష్టము

భౌతిక సాక్షాత్కారము శ్రీమాతారవిందుల ప్రత్యేకత, అపూర్వత. ఈ అపూర్వ పరిణామమే భూవాతావరణమును మార్చివేయగలదు. భాగవత జీవితానికి పరమాధారమది. దీనిని గూర్చి అమ్మ వినూత్న సాధనానుభూతులను గురించి ఇపుడు విందాము :

"శరీరానికి సంబంధించినంతవరకు ప్రతి విషయములోనూ భగవంతుని మీదనే ఆధారపడి, భగవంతుని ద్వారానే జీవించేందుకు దానికి శిక్షణ ఇవ్వబడుతోంది – ప్రతి విషయములోనూ, మినహాయింపు లేకుండా ప్రతివిషయములోనూ. చేతనను సాధ్యమైనంత వరకు భగవచ్చేతనతో సంయుక్తము గావించినపుడే అస్తిత్వభావము మనకు స్ఫురించుతోంది. ఈ భావనకిపుడు అసాధారణ సాంద్రత లభించింది. ఒకసారి శరీరము పడిమారినపుడు – తెలుసునా – దాని సాక్షాత్కారము చలించని పాషాణమువలె నిలిచిపోతుంది. అది అపుడు సంపూర్ణము. ఎంత గాఢము, ఎంత ఘనిష్టము! భగవంతుని యందుండి, భగవంతుని లోనే, భగవంతుని ద్వారానే జీవించే భాగవత జీవితానికీ, మానవ

చేతనలో జీవించే బాహ్యజీవితానికీ మధ్య ఎంత పెద్ద అఖాతము
ఒకదాని ముందు రెండవది మృత్యువే అనిపించును. శూన్యప్రాయము
లేక ఛాయా మాత్రముగా స్ఫురించును. వేరొక విధముగా చెప్పాలంటే
భౌతిక సాక్షాత్కారమే నిజముగా ఘనిష్టమగు సాక్షాత్కారము."

## భౌతిక సాక్షాత్కారము నందలి ప్రభూతశక్తి

"ఈ సాక్షాత్కారము నందలి ఓజోబలాలు ఎలా పరిణమిం
నున్నాయో, సూచనా ప్రాయంగాచూస్తున్నాను. అది, అవును ......
అది నిజముగా అద్భుతావహము, అది శక్తితో పొంగులు వారుతోంది
ఆచేతన యందు శక్తీ, సత్యతా ఎంత నిర్భరమై ఉన్నాయంటే, దేని
దానితో పోల్చలేము, ఈవిషయములో, ప్రాణమయమూ, మన
మయమూ, ఇతర సమస్తమూ దానిముందు నీడవలే, అదృఢము
అగుపిస్తాయి. కాని అది ఎంత దృఢతరము, బలవత్తరము!

"నేనాస్థితియందు ఉన్నపుడు ఎంతటి మహత్తర శక్త్యనుభవము
ఉదాహరణకు నాసన్నిధిలో రోగగ్రస్తులైనవారికి విచిత్రముగ స్వస్త
ప్రాప్తించుతోంది. నిజానికి నే నేమీచేయడంలేదు, బాహ్యముగా, వారిత
మాటాపలుకూ కూడ లేదు."

## మాతృశ్రీ సన్నిధిలో

మాతృశ్రీ అంతర్ముఖముగా గంభీరమగు అనుశీలనమున ( Con
templation)ప్రవేశించి, తిరిగి వెలికివచ్చి ఇలా అన్నారు :

"ఆస్థితి నిరవధికముగా కొనసాగే అవకాశము గలదు — ఆస్థితి అంటే, ఒక అపూర్వతత్వమును స్పృశించినస్థితి (బాహ్యమునుండి తప్పించుకు పోయినట్లు అభినయము)" — ఇలా సూచించి తన ముందున్న శిష్యుని అడిగారు అమ్మ :

నీకెలా అనిపించింది (అమ్మసమాధిలోనికి వెళ్లినవుడు)?

"మీదగ్గర, అమ్మా ! నేనుపొందే అనుభూతిని 'జ'–అను నామె నాకిలా అర్థమయ్యేలాగున వివరించి చెప్పారు : ఒకరు మీదగ్గర ఉన్న పుడు, మీసన్నిధి వారి శరీరముచేత ప్రార్థన చేయించి నట్లుండును. అవును, అది అంతే, ఏదో ఒక శక్తి శరీరము యొక్క ప్రతి అవ యవమును ఆవేశించి ........ ఎలా చెప్పాలి, వానిని తీవ్ర ఆకాంక్షతో అంచువరకు నింపినట్లనిపించును" దానిమీద అమ్మ —

"అవును, కాని నా శరీరానుభూతి కూడ అదే."

అమ్మ సన్నిధిలో అందరికీ కాకపోయినా, కొందరు అర్హులకైనా ఇట్టి అనుభూతి కలగడం ఎంత విశేషం! అమ్మనుండి, శక్తి కేంద్రము నుండివలె, ఆధ్యాత్మిక శక్తి ఎలా ప్రసరిస్తుందో! అంతట ప్రసరించి, ప్రకాశించి, తమోభూయిష్ఠమయిన దేహము మీదకూడ ఎలా పని చేస్తుందో!

## ప్రస్తుత సమస్య

మరొసారి అమ్మ సమాధి నుండి వెలికి వచ్చి —

"అసలు సమస్య ఇది : తనను తాను అభివ్యక్తము చేసుకోగోరు తున్న దివ్యశక్తిని భరించగల భౌతిక కాయమును రూపొందించడం.

సామాన్య శరీర చేతనకు ఇది సాధ్యము కాదు. అది మిక్కిలి పేలవము క్షణభంగురమూ. అందుచేత శరీరము తనకుతాను శిక్షణ గరపుకొ ప్రక్రియలో నిమగ్నమై ఉన్నదిపుడు .... అనురూప పరివర్త ప్రక్రియలో ముందుకు సాగుతోంది. ఇది సంధి సమయము.... శరీ మిపుడు సంధి సమయములో నున్నది.

"అది రూపాంతరీకరణమునకు తగినంత మృదుత్వము కలి ఉంటుందా? ఏమో, తెలియదు."

'ఏమో తెలియదు' అని అమ్మ వెలిబుచ్చిన సందేహము మనక ఆందోళనకరము, భయావహము కూడ, దానిమీదనే అమ్మ శరీ అమరత్వము ఆధారపడి ఉంటుందని అనుకోవచ్చును.

"శ్రీ అరవిందునికి మానవాళినుండి సహయోగ సహకారాల లభించక పోబట్టే, ఆ మహనీయుడు తన శరీర త్యాగము చేయవల వచ్చింది" అని చెప్పి వేరొకప్పుడు అమ్మ ఆరహస్యమును వెల్లడించారు మరొకసారి "మా ఉభయుల శరీరాల అతిమానసీకరణము మాత్రమే అయితే, ఆ పరిణామానికి ఇంతకాలము పట్టదు! మాతో మేము లోక మును కూడ గొనిపోవాలని చూస్తున్నాము కాబట్టి కాలయాపన జరుగ తోంది" అని కూడ అమ్మ స్పష్టపరిచారు. మనను వారు తీసుకువెళ్ళాలి మనము వారి వెంట వెళ్ళము! ఇదే ఇప్పటి విషమస్థితి, వైపరీత్యము అందుచేతనే అమ్మ 'ఏమో తెలియదని' చెప్పవలసి వచ్చిందన కుంటాను.

## మార్దవము - కాఠిన్యము

శరీర కఠినత్వము దేనిని బోలి ఉంటుందో, అది మృదుత్వము లోనికి ఎలా మారుతుందో, అమ్మ చేసిన ఈ విశదీకరణను చూద్దాము:

"నాకొక విచిత్రమైన అనుభూతి కలుగుతోంది: చెట్టు బోదెను పట్టి ఉన్నపట్ట కరగిపోతూ ఉన్నట్లు,తాబేటినికప్పిఉన్న పెంకుపొర ప్రిదిలి పోతూ ఉన్నట్లు నా కన్పించుతోంది. కాగా శరీరము ఇలా(మామూలుగా) ఉన్నట్లు తోచడంలేదు (శరీరము సూర్యాభిముఖముగా విస్తరించి, విస్ఫుటిత మవుతూఉన్నట్లు అమ్మ తెరచుకొనుటను సూచించే అభినయము చేశారు). మానవునికి ద్రవ్యముగా (Matter) గోచరించేది ఏది ఉన్నదో, చిట్టెము కట్టుకుపోయినట్లు ఏది కన్పించుతోందో, అది పడిమారాలి. కారణం, దానికి స్వీకరించే సామర్ధ్యము పూజ్యము. ఇక ఇక్కడ, ఈ శరీరములో (అమ్మ తనచేతి చర్మమును స్పృశించి చూపుతున్నారు) అది ప్రయత్నించుతోంది.... .... పూర్తిగా తెరచుకోవడానికి ప్రయత్నించు తోంది. ఓహో ! అది ఒక అపూర్వానుభవము. అది కరగిపోయే వరకు అస్థితిలో నిలబడగలిగితే — అది యథార్థమగు నాందీగీతము (శుభారంభము) అవుతుంది."

శ్రీమాత, శ్రీ అరవిందులు ఆధ్యాత్మిక ప్రయోగశాలలో ఎలాంటి అపూర్వ ప్రయోగాలు చేశారో, చేస్తున్నారో పైన అమ్మ ఉజ్జాత్రముగా సూచించిన ప్రయోగములనుబట్టి విదితము కాగలదు. ఆ ప్రయోగాలు అదృశ్యమే అయినా అంత విశదపరచి చెప్పగలవారుకూడ ఉండరను కుంటాను. వారు ఏదైనా ఒక సందర్భములో చెప్పిన సంగతిని వారే అన్యత్ర నుడివిన పూర్వోత్తరాలతో సరిపోల్చి చూచుకున్నపుడు, ఆసంగతి

మనకు మరింత స్పష్టపడడమేకాక, దాని లోతుపాతులుకూడ మనకు అధికముగా అనుతాయి.

ఉదాహరణకు 'To Be— To Be— To Be' (177 వ పేజీ) అని ఇక్కడ అమ్మ వక్కాణించిన దానిని 1960 సంవత్సరానికి అమ్మ సందేశముగా ఇచ్చిన ఈ క్రింది స్వర్ణసూత్రముతో పోల్చిచూద్దాము :

(సత్యమును) తెలిసికోవడం మంచిదే (To know is good).

(సత్యమును) జీవించడం అంతకంటేమంచిది (To live is better).

(సత్యమై) ఉండడం – ఇదే పరిపూర్ణము (To be, that is perfect).

భగవంతునియందు భగవంతునిగా ఉన్నపుడే, భగవచ్ఛక్తికి పరిపూర్ణ వాహినులము కాగలము. అపుడా భగవచ్ఛక్తి శరీరములోని మాలిన్యములను పరిమార్చి దానిని దివ్య శరీరముగా మార్చివేస్తుంది. సత్యమును తెలిసికోవడం సరే, సత్యమును అనుష్ఠించుతూ జీవించినప్పటికీ – అదికూడ పరిపూర్ణము కాజాలదు. ఏలనంటే, దానికి కూడ శరీరమును రూపాంతరీకరించే సామర్థ్యము లేదు. మరొక విశేషమేమంటే, ప్రస్తుత ప్రయోగములో శరీరచేతనే భగవంతునితో ఏకమై ఉండడానికి ప్రయత్నించుతోంది: తానుతానుగా ఉండి సత్యమును అనుష్ఠించడం వేరు. తాను సత్యము గావడం వేరు. ఇది అపూర్వము. పైగా ఈ ప్రయోగము పరిపూర్ణమైనపుడు భౌతిక సాక్షాత్కారానికి గల బలము మరి దేనికి ఉండదని, అది మహామేరువు వలే, భాగవత జీవితానికి అచలమూ, అవిచాల్యమూ (Immovable) అయిన పునాదిగా ఉండగలదని అమ్మ ఉద్ఘాటించుతున్నారు.

1960—సందేశమును అమ్మ ప్రస్తుత ప్రయోగముతో జోడించి అర్థము గావించుకోడానికి ప్రయత్నించినపుడు, మన సాధనను కూడ తీర్చి దిద్దగల అనేక విషయాలు మనకు అవగతమవుతాయి –

ఏతత్ ప్రయోగ ఫలితముగా ఏనూతన జీవితోదయం కాబోతోందో ఇంచుక దాని ప్రస్తావన –

## నూతన జీవితము

ఇపుడు మనమున్న స్థితిలో, ఆస్తి, అర్హత అధికారము – ఇవి లేని జీవితమును గురించి భాషించితే, అది జీవితమే కాదనుకుంటాము: కాని ఈ జీవితమును విడిచివేసి, రెండవ జీవితములో అడుగిడినపుడు, అహో! అక్కడ ఊహాగానము అడుగంటా ఆగిపోతుంది ; వివరించాలనే ఇచ్ఛాప్రవృత్తి సమసిపోతుంది; తర్కించి సిద్ధాంతీకరించి, క్రమ బద్ధముచేయాలనే అభీష్టమునకుస్వస్తి చెప్పబడుతుంది.సాధకుడు ఉండ జాలినచో – అలా ఉండజాలినచో; అదే కావలసినది.అక్కడ మౌనము రాజ్య మేలుతుంది. కాని మాటలు మానివేసినందువలన లభించే మనకు పరిచిత మైన మౌనము కాదది. అది గంభీర విచారణకు సంబంధించినమౌనము, అది క్రియాత్మకము. ఆమౌనము సక్రియసమాధి, అవును, అది అంతే.

"నిశ్చయముగా సన్నాహ దశలో ఇపుడు రూపొందుతున్న నూతన జీవిత విధానమది. కనుకనే ఇప్పటి జీవితము దానికి స్థానమిచ్చి వైదొలగాలి: "

అక్కడ తెలిసికోడానికి ఆలోచించవలసిన అవసరముండదు భావించ వలసిన పని ఉండదు. మరి ఎలా తెలుస్తుంది? తాదాత్మ్యః చేత. ఇప్పట్టున ఈక్రింది అనుభవ వాక్యములను గమనించండి:

"ఏది జరుగ నున్నదో, ఏది ప్రజలు నాకు చెప్పనున్నారో అది ముందుగానే నాకు తెలియ నారంభించింది—అది అంతాకూడ...... ఎలా ఇది జరుగుతోందని వివరించను! ........ పరిస్థితులూ, ప్రజలు మాటలూ,........అన్నీ నేనే అయ్యాననిపిస్తోంది !"

ఇది పూర్ణజీవిత లక్షణమూ, స్వరూపమూకూడాను. తమ ఈపూర్ణ జీవితమును మాతృశ్రీ తన బిడ్డలమైన మనకు అందించించుగాక ఆవిధముగా మనము చరితార్థులమై, మాతృశ్రీ కార్యము సఫలమగుగాక!

## అటో – ఇటో

ఆధ్యాత్మిక చరిత్రలో ఇది ఒక అపూర్వమైన సమయం. అట్టడ గున నున్న భౌతిక పరివర్తనానికి – భౌతికపరివర్తనానికికూడ – నిర్దేశిం బడిన సమయమిది.ఈ దైహిక పరివర్తనము అతిమానస శక్తికి తప్ప తద తరానికి సాధ్యముకాదు.ఇకఅతిమానసము కూడి భౌతిక జగత్తులో స్థిరపడితే నేతప్ప తన కార్యకలాపమును అక్కడ కొనసాగించ జాలదు. అలా నిల ద్రొక్కుకుని స్థిరపడాలంటే—

"దైహిక మనస్సులో అతిమానసము అభివ్యక్త మైనపుడే, దాని సన్నిధి (బాహ్యజగత్తులో) స్థిరపడగలదు".

(29–2–72 న మాతృశ్రీ ఇచ్చిన సందేశము).

మానసిక మనస్సు (మనోమయ పురుషుని మనస్సు) ప్రాణిక మనస్సు – వీనిలో అతిమానసము ఆవిర్భవించడమే ఎంతో కష్టము. అయినపుడు ఈ శరీరగత మనో విషయములో అది మరెంత కష్టమో!

శిష్యుడు : ఈ దైహిక మనస్సును (దేహముతోనున్న మనస్సును) ఏ కొనను పట్టుకొని అదుపులోనికి తీసుకురావాలో? నాకది దుస్సాధ్య మనిపిస్తుంది, తల్లీ!

మాతృశ్రీ :– మిక్కిలి దుస్సాధ్యము, అది నిజమే.

ఇచ్ఛానుసారముగా భౌతిక మనస్సు నీరవతను నెలకొల్ప నేర్చుకోవాలి అనుకున్న వెంటనే అక్కడ మౌనస్థితిని పొందగలగాలి. ఇదే దైహిక మనః శిక్షణకు సరియైన ప్రారంభం.

శిష్యుడు :– ఏకాగ్రపరచి ఉంచినంతవరకు అది నీరవముగానే ఉంటుంది. ఆ ఏకాగ్రత సడలించగానే అది మళ్ళీ ఇటు నటు పరుగులు పెడుతుంది!

మాతృశ్రీ :– ఆ పరుగులు తీసే అలవాటును మనసు పోగొట్టుకోవాలి. ఆ అభ్యాసము నది విడనాడుకోవాలి!

శిష్యుడు :– ఎలా ?

మాతృశ్రీ :– ఎలాగో – నాకూ తెలియదు. ఏలనంటే, నా కది అనాయాసముగానే లభించింది .... ....

(అయితే మనగతి ఏమికావాలి ? మనకిపుడు సాధ్యముకాదు. సాదించడానికి మార్గములేదు గదా : పైన మాతృశ్రీ అలా అన్నప్పటికీ.

మళ్లీ స్వయముగానే మార్గము చూపుతున్నారు :) "........ ఎవరైనా మాటాడించినపుడు, లేదా ఏదో ఒక కారణము నన్ను కదిలించి, పట్టి బైటకులాగినపుడు, దైహికమనస్సు తనలో తాను ఉన్నపుడు, అతి స్వాభావికముగానే ఊర్ధ్వాభిముఖమైన నిశ్చల స్థితిలో ఇలా ఉంటుంది. (ఊర్ధ్వాభి ముఖమైన నిశ్చల సంకేతము)." ఈవిధముగా మన దైహిక నస్సు ఊర్ధ్వాభిముఖమై ఉన్మీలితులము గావడమే అది తన వెనుకటి అల వాటులను విడనాడడానికి అమ్మ చూపిన మార్గమనుకోవాలి.

ఇక్కడ సూచితమైన ఈమార్గముకూడ మనకు ఆదిలో అందు బాటులో ఉండదనే చెప్పాలి. కారణం, దైహిక మనస్సు భగవదున్ముఖమై ఉండడము మన విషయములో స్వాభావికముకాదు. దానిని స్వాభావికము చేసుకోవాలి. ఎలా? మన వ్యక్తిత్వములో ఏ భాగానికి అదిస్వాభావిక మో, దానితో దైహికమనస్సును అనుసంధించాలి, తదనుగతము కావాలి ఆమనస్సు. కావుననే 21–2–72 నాటి సందేశములో దానికి సంబంధించిన ప్రక్రియను ఇలా వివరించుతున్నారు:

"సత్తలోని ప్రతిభాగమును అంతరాత్మ కేంద్రము చుట్టును అను సంధించి, దానితో ఏకముచేయాలి. పూర్తిగా, పూర్ణమగు చిత్తశుద్ధిని పొందేందుకు ఇదేప్రధాన నిబంధము."

ఈవిధముగా అంతరాత్మకు సహజమైన ఊర్ధ్వాభిముఖతను పుణికి పుచ్చుకుని, దైహికమనస్సు సదా భగవదున్మీలనము కాగలుగుతుంది.

**శిష్యుడు:**— సుస్థిరమగు ఒకేరీతి చేతనావస్థను కలిగి ఉండడము చాలా కష్టము తల్లీ!

మాతృశ్రీ : అవును గాని, దైహిక మనస్సు అంతరాత్మతో ఏకీకృతము కానంత వరకే ఆకష్టము, నాయనా!

"ఇక నాకు సంబంధించినంతవరకు, ఏకీకరణ ఫలితముగా, అంతరాత్మ దైహిక మనస్సులో ఏనాడో ప్రవేశించింది!— కనీసము 30 సంవత్సరాలకు పూర్వమే! నేనిక్కడకురాక పూర్వమే. అలా అంతరాత్మానుగతము కావడముచేత భౌతికముకూడ సదా భగవదాదేశమును వింటూ ఉన్నదోఅన్నట్లు ప్రవర్తించుతూ వచ్చింది."

ఇపుడు అమ్మ చూపిన మార్గమును ఈ విధముగా మనము సూచించుకోవచ్చు.

1. అతిమానసము ద్వారానే దేహపరివర్తన సాధ్యము.

2. అతిమానసము దేహములో పనిజేయడానికి ముందు అది దేహములో, భౌతిక జగత్తులో స్థిరపడాలి.

3. అలా స్థిరపడాలంటే, దైహిక మనస్సునందు అది అభివ్యక్తము కావాలి.

4. దీనికి దైహిక మనస్సు సదా భగవదభిముఖమై మనగలగాలి.

5. ఇది స్వాభావికముగా జరగాలంటే, దైహిక మనస్సును అంతరాత్మతో ఏకీకరించాలి.

ఇదికూడ మనము చేయలేకపోవచ్చు, మనశక్తితో. కాని త్రికరణశుద్ధిగా మనము కృషిచేస్తే, తాను సాయపడతానని అమ్మ ఆశ్వాస (assurance) మిస్తున్నారుగా!

ఇక, ఇప్పుడు అసలు విషయానికి వద్దాము. ఈ రచనకు 'అటో—ఇటో' అనిపేరు పెట్టుకున్నాముగదా।ఆశీర్షిక వెనుక ఏమున్నదో చూద్దాము. మాతృశ్రీ శరీరపరివర్తనానికిఒక క్రొత్తమలుపునిచ్చిన ఏదివ్య సంఘటన తమజన్మదినము 21-2-72 నాడు సంభవించిందో దానినిగురించి తెలుసుకుందాము. ఆ అనుభూతిని అమ్మ ఇలావ్రాసి పెట్టారు :

"21 ఫిబ్రవరినాడు దినమంతా, అది ప్రతి ఒకరి జన్మదినమూననే బలీయమగు అనుభవము నాలో రాజ్యమేలింది. తత్ప్రేరితనై ప్రతి వారికి 'మీకు జన్మదిన శుభాకాంక్షలు' అని చెప్పడం కూడ జరిగింది.

"ఏదో ఒక వినూత్న వస్తువు ప్రపంచమునందు అభివ్యక్త మయినది – అనే మిక్కిలి బలీయమగు అనుభవమది. ఎవరు సంసిద్ధులై ఉన్నారో, ఎవరు గ్రహణశీలురు కూడనై ఉన్నారో, వారు దీనిని తమ యందు మూర్తీభవింప జేసుకోగలరు.

"సందేహములేదు. కొద్దిరోజులలోనే దాని స్వరూప స్వభావాలు తెలిసిపోతాయి."

అవును! దాని స్వరూప స్వభావాలెట్టివి ? ఎవరు నిర్ణయిస్తారు ? ఎలా నిర్ణయిస్తారు ? తనయందు పనిచేసిన తీరునుబట్టి అమ్మే నిర్ణ యిస్తారు. ఈ సంభాషణ జరిగిన 8-3-72 నాటికే ఈ శక్తివలన కలిగిన అనుభవమును అమ్మ ఇలా అభివర్ణించారు :

ఒక "దుర్ఘటన"ను గురించి అని ప్రారంభించారు. నిజానికి అది దుర్ఘటనా ? కాదు. అది ప్రబలము, తత్ఫలితము సుతీవ్రము గావడంచేత అలా అనిపించుతుంది. అల్పసత్త్వులు దానిని తట్టు

కోలేరు కూడ. తర్వాత దాని వ్యాపారమును ఇలా వివరించుచున్నారు శ్రీమాత :

"అది ఒక ఉద్దండ ఆదేశమువలే ఉంది. (దాని ననుసరించి) సూటిగా ముందుకువెళ్ళు. లేకపోతే అంతా తప్పిపోతుంది !

"అది భయంకరము, మరింత భయంకర మవుతోంది. అది ఒక పీడనము (వత్తిడి), భయానక, పీడన సదృశ్యము. మనము అపేక్షించిన పురోగతిని సాధించడానికే ఈ పీడనము. అది నాయందే నా దేహము నిమిత్తం ప్రవర్తించుతున్నదనే అనుభవము కలుగుతున్నది. అయితే ఈ భయానక పీడనానికి శరీరం భయపడడంలేదు. అది చెప్పున దేమంటే (అమ్మ తన హస్తములను తెరచి చూపుతున్నారు) :

'నేను అంతమొందవలసి ఉంటే, అలాగే కానిమ్ము !' అని.

"ప్రతి క్షణము ఇలాగే చెప్పుతున్నది : అయితే సత్యవస్తువు, లేకపోతే చరమశ్వాస"? అమ్మ ఇంకా చెప్పుకుపోతున్నారు.

"అది ఒక విధమగు....దానికి సగము సగము చర్యలు పనికిరావు. అక్కడ రాజీమాట తలపెట్టగూడదు, 'దాదాపు' అనేమాటకు దానియందు తావులేదు.

"శరీర విషయములోకూడ అలాగే జరుగుతోంది, అనుక్షణము దానికి ఒక ఆదేశమువస్తోంది: 'జీవనమో, మరణమో' దీర్ఘకాలము అనిశ్చితముగా సాగిన, అటూ, ఇటూగాని స్థితిగా మాత్రము అదికాదు. శతాబ్దముల పర్యంతము అదిపూర్తిగాచెడూకాదు, పూర్తిగామంచీకాదు— ఇపుడు మాత్రము అది అలాకాదు.

"అతిమానస శరీరముయొక్క నిర్మాణము ఈ విధముగా జరుగవలసి ఉంటుందని శరీరము తెలుసుకున్నది. అది పూర్తిగా భగవత్ ప్రభావము క్రిందనే ఉండాలి— రాజీమాట రాగూడదు, 'దాదాపు' మాట రాగూడదు, 'జరుగుతుందిలే' అనుకోరాదు. అది ఇలా ఉంటుంది (అమ్మ దృఢతాసూచకముగా తన పిడికిటిని క్రిందికి లాగుతున్నారు). మహోద్ధృతమైన సంకల్పమది !

"సత్వరపురోగతికి అది ఒక్కటే మార్గము" అని దైహిక మనస్సులోని తన నూతనానుభవమును వర్ణించి ముగించారు అమ్మ.

నూతనముగా అవతరించిన శక్తి ప్రభావముయొక్క స్వభావమట్టిది. అది కాళికాశక్తి గావాలి. కాళికాశక్తికి— విజయమో, వీర స్వర్గమో— తప్ప మధ్యేమార్గము పనికిరాదు. అటో—ఇటో తేల్చివేసే ఉద్దండ బల విశేషమది; పురోగతిని సాధించడానికే కావచ్చునుగాని, అది భయానక పీడనము. అమ్మ మళ్ళీ ఇలా అందుకున్నారు.

"దినములో ఎన్నిసార్లో, ఏనూరుసార్లో శరీరమునందు ఈ స్ఫూర్తి పునరావృత్తమవుతున్నది: శరీర కణాలకు జీవనమో, విఘటనమో **(disintegration)** : (అంతేగాని మధ్యేమార్గమగు సామాన్య జీవనానికి చోటు లేదు.) ఈ అనుభవము స్ఫురించినపుడు తమ పాత అలవాటు చొప్పున శక్తివత్తిడికి శరీరకణాలు సంకోచించి ముడుచుకొనకపోతే, అంతా బాగుగానే జరుగుతుంది. ఇపుడు దానినే అవికూడ నేర్చుకుంటున్నాయి.... .... (అమ్మ తన హస్తములను తెరచిపైకెత్తి కణముల సమర్పణను అభినయించి చూపుతున్నారు).

ోదయము

నిర్మాణము ఈ విధముగా జరుగ
ు్నది. అది పూర్తిగా భగవత్
ాట రాగూడదు, 'దాదాపు' మాట
ాదు. అది ఇలా ఉంటుంది
డికిటిని క్రిందికి లాగుతున్నారు).

–ే మార్గము" అని దైహిక
వర్ణించి ముగించారు అమ్మ.

్తి ప్రభావముయొక్క స్వభావ
కాశికాశక్తికి— విజయమో, వీర
కిరాదు. అటో—ఇటో తేల్చివేసే
ాధించడానికే కావచ్చునుగాని, అది
లా అందుకున్నారు.

ుసార్లో శరీరమునందు ఈ స్ఫూర్తి
ాలకు జీవనమో, విఘటనమో
ధ్యేమార్గమగు సామాన్య జీవనానికి
ించినపుడు తమ పాత అలవాటు
సంకోచించి ముడుచుకొనకపోతే,
ుడు దానినే అవికూడ నేర్చుకుం
స్తములను తెరచిపైకెత్తి కణముల
రు).



"ఒక విధమగు బలాత్కారము చేత శరీరానికి శాశ్వతత్వములో శిక్షణ ఇవ్వబడుతున్నదా ? – అనిపిస్తోంది – ఈ వ్యవహారము చాల ఆసక్తిదాయకముగా ఉందిలే!"

శిష్యుడు తన కష్టమును మళ్ళీ విన్నవించుకుంటున్నాడు. అది మనందరి కష్టము కూడాను.

శిష్యుడు :– ఊర్ధ్వదృష్టిని ఎక్కువ సేపు నిలుపుకోలేని అక్షమత (బలహీనత) దైహిక మనస్సుకు తన స్వభావములోనే ఉన్నట్లు తోస్తుంది ?

మాతృశ్రీ :– అది అక్షమతకాదు, వైముఖ్యము, మరియు అహంకారము. ఈ అహంకారము జడద్రవ్యమును అభిమానించే అహంకారము.

శిష్యుడు :– జడసత్త యొక్కా ? (శిష్యునియొక్క ఆశ్చర్యానికి కారణం– జడమునకు అహంకారమేమిటని. జడప్రాయముగా నున్న పదార్థానికి మార్పును ప్రతిఘటించే నిలీన (Hidden) చేతన ఉన్నది.)

మాతృశ్రీ:– అధీనము గావడానికి ఇచ్ఛగించని తన అహంకారము.

"ఈ విషయము నాకు స్పష్టమే. అత్యంత సాధారణమైన తన పూర్వపు తప్పటడుగుల మార్గములోనే శరీరము అటూ ఇటూ తిరుగుతూ ఉంటుంది. కాని మారనొల్లదు.

శిష్యుడు :– ఆకాంక్ష, ఉత్సాహములయొక్క ఒక విధమగు శిథిలీకరణ మనుకుంటాను, దానికి కారణం.

మాతృశ్రీ :– అవును అది అంతే.

శిష్యుడు :– అయితే ఏమి చేయాలి ?

మాతృశ్రీ :– భగవదనుసంధానం. భగవంతుని నిజమగు రూపముతో దానికి అనుసంధానం లభించితేనే తప్ప అది ఎప్పటికీ ఆకాంక్షా సముత్సాహముల విషయములో స్థిరముగా నుండజాలదు.

వ్యాఖ్య :– అవతరించిన భగవంతుని శక్తిని భరించగలగడానికి భగవంతుని తోనే అనుసంధానం : ముందు మనలోని దైవాంశముతో ఏకమై, పిమ్మట దైవముతో ఏకమైనపుడు, అల్పమగు దైహిక మనస్సుకూడ స్థిరతను, బలమును సంతరించు కుంటుంది.

శరీర కణములుకూడ పాఠాలు నేర్చుకొంటున్నాయి. ఏమిటీ పాఠము? 'అది చావుగానీ బ్రతుకుగానీ' భగవచ్ఛక్తికి ఉన్మీలనమే గాని నిమీలనములేదు; అనుభవముతో గుర్తించి, సాధించవలసిన విషయమిది. శక్తి ఉద్ధృతముగా పనిచేస్తున్నపుడు, ఒకొకప్పుడు తదాఘాతానికి ముడుచు కోవడంకద్దు. లోతుకు దిగిచూచినపుడు, చివరి విశ్లేషణములో (Analysis) ఈసంకోచము అహంకారము యొక్క స్వరూపమేనని మనము తెలుసుకోగలము — భౌతికాహంకారము భగవంతుని నుండి వేరుపడి, తమలో తాము శరీరకణములు ముడుచుకు పోవడమే అహంకారము. అందు చేతనే భరించలేని అక్షమత వాటికి.

వ్యాసుని తేజమును భరించలేక అంబిక, అంబాలిక కండ్లు మూసుకున్నారట. అందుచేత ధృతరాష్ట్రుడు అంధుడుగాను, పాండురాజు పాండువుగాను జన్మించారని మనము భారతములో చదువుకున్నాము. వ్యాసదేవుడు ముందే హెచ్చరించాడట, అంబికాంబాలికలు ఒక సంవత్సరము ముందుగా వ్రతము చేయవలసి ఉంటుందని. కాని వ్యాసునితల్లి, సత్యవతి తొందరపెట్టింది. కాని మన తల్లి (జగన్మాత) అలాగాదు. 21-2-72 నాడు అభివ్యక్తము కాబోయేతీవ్రతర శక్తిని ముందే గుర్తించారో అన్నట్లు, అంతకుముందు అనేక పర్యాయాలు, అంతరాత్మతో సమస్త సత్తను ముందు ఏకీకృతము చేయడం అవసరమని హెచ్చరించారు. చివరకు ఆనాటి సందేశములోకూడ ఇదే అంశమును వక్కాణించారు.

మాతృశ్రీ ఆంతరంగిక సందేశము చూడండి ; అందులో 'నీకాలము చెల్లిపోయింది' అని అహంకారానికి నిర్దాక్షిణ్యముగా చెప్పమన్నారు. ఈ సందేశము తేది 14-4-72. అంతకుముందు 8-3-72 న శిష్యునితోజరిపిన పై సంభాషణలో అహంకారమే మన దౌర్బల్యమని,అదే మూలానర్థమని స్పష్టీకరించారు. ఈ రెండింటిని సరసను పరికించినపుడు ఆంతరంగిక సందేశములో అపుడు చెప్పడానికి కారణమేమిటో మనకు తెలిసిపోతుంది. అంటే అహంకారానికి ఒక మాసం గడువు ఇచ్చినట్లయింది !

పైగా, భౌతికాహంకారము అవచేతనలో పాదుకొనిపోయి, భౌతికామరత్వము సాధ్యమనేమాటే విశ్వసింపలేక పోతోంది. కావుననే దాని కాలము చెల్లిపోయినదని అమ్మ చెప్పివేయమన్నారు.

# న వ్య శ రీ ర ము

"మొట్టమొదటిసారి నేడు (24–3–72) ప్రాతఃకాలమున — బ్రహ్మముహూర్తమున – నన్ను నేను చూచుకొంటిని; నా నూతన శరీరమును గాంచితిని. అది అతిమానస శరీరమో లేక ....(ఎటుల చెప్పవగునో) సంధి సమయము నందలి శరీరమో తెలియదు. కాని అది పూర్తిగా నవ్యశరీరము. దానియందు లింగభేదములేదు – అది స్త్రీ శరీరముగాదు, పురుష శరీరమునుగాదు : ఈ అర్థములో అదిపూర్తిగా నూతనము, విలక్షణము.

"అది మిక్కిలి శ్వేతవర్ణము. నా ఈ శరీరము కూడ శ్వేతవర్ణమే గాన, అది అట్లుండవచ్చును. కాని ఆ విషయము ఇతమిత్థముగా తెలియదు.

"అది సన్నగా, నాజూకుగా (సన్నదనమును సూచించు సంకేతము) నుండెను – అది చక్కగా నుండెను. అది నిజముగా ఒక సామరస్యపూర్వమైన రూపవిశేషము.

"ఈ విధముగా దానిని చూచుట అదే మొదటిసారి. అతః పూర్వము అది ఎట్లుండగలదో – ఆ విషయమున నాకొక అభిప్రాయము కూడలేదు, ఆజాడే తెలియదు – కాని అది అట్లు ఉండెను, నేనటైతిని"– అని అమ్మ తన అపూర్వానుభవమును అందించారు.

ఇంతకాలమునుంచి వేయి కండ్లతో ఇలాంటి దివ్యపరిణామము కొరకు ఎదురు చూచాము. దానిమీద మన భవిష్యత్తు, ప్రపంచము భవిష్యత్తు కూడ ఆధారపడి ఉన్నాయి. కాని ఈ విషయమున ఇంకా కొన్ని చిక్కులు విడిపోవాలి. ఆ చిక్కులేవి ?

శిష్యుడు : కాని అది సూక్ష్మభౌతికములోని శరీరముగదా?

శ్రీమాత : అవును, సూక్ష్మభౌతికములోనిదే అయి ఉండవలెను.

శిష్యుడు : అయితే, అది భౌతికములోనికెట్లువచ్చును ?

శ్రీమాత : అదే తెలియదు. ఏ మాత్రము తెలియదు!....చింపాంజీ శరీరమునుండి మానవ శరీరమునకు ఏర్పడిన మార్గము (ఇప్పటికిని) ఎట్లు నిగూఢమో, ఇప్పటి విషయములు కూడ అట్టి గుహ్యమేకావచ్చు.

ఇది ఒకచిక్కు, ముఖ్యమగు చిక్కు. ఆ శరీరముయొక్క జీర్ణాశయము, శ్వాసావయవము కూడ అత్యంత విలక్షణము. అది ఎట్లు ఏ ఆహారము జీర్ణించుకొనునో, అది ఎట్లు శ్వాసించునో కూడ తెలియదు. ఆహారము దాదాపు అవసరములేకుండా, అది సరాసరి శక్తులను పీల్చుకొనగలదేమో! ఇవి మరికొన్ని చిక్కులు.

శ్రీఅరవిందుడు కూడ ఇప్పటికే సూక్ష్మభౌతికములోనికి అవతరించారని, అంటే సూక్ష్మభౌతిక శరీరమును ఇప్పటికే నిర్మించుకొన్నారని ఒక అభిప్రాయము కలదు. ఆ అభిప్రాయము నిరాధారముకాదు. మాతృశ్రీ సహాయముతో ఆయన స్థూలభౌతికములో కూడ తన శరీరమును ఏర్పరచుకొనగలరని ఒకదృష్టి గలదు.

వ్యక్తిగతముగా అమ్మ విషయములో హఠాత్తుగా ఏమి సంభవించిందో చూచాము. ఇక ప్రపంచ పరిధిలో ఏమి జరుగుతున్నదో గమనించుదాము.

ఇపుడొక అపూర్వము, దుర్జ్ఞేయము నగు మహాశక్తి ఉద్ధృతముగా పనిజేస్తున్నది. ఆ ఉద్ధృతి మానవుల సాధారణ చేతనలో ఒక విధమగు భీతిని పుట్టించింది. ఈ శక్తి ప్రభావము అమ్మ తనువును సైతము కలత పెట్టింది. అమ్మ అన్నారు.

"అనేక పర్యాయాలు నా శరీరము ఒక విధమగు నూతన అసుఖమును ఆందోళనను పొందిన క్షణాలున్నాయి. అప్పుడు వాక్కు-అన్నట్లున్నదేదో నా చేతనయందు వాగ్రూపములోనికి మారి ఇట్లు విన వచ్చెను. 'నీకెందుకు భయము ? ఇది నూతన చేతనా' అట్లు పలు పర్యాయాలు విన్న తర్వాత నా కర్థమయ్యెను."

ఇక ఈ శక్తి స్వరూపాదు లెట్టివి ? ఈ సంవత్సరము మాతృశ్రీ జన్మదినమగు ఫిబ్రవరి 21న దిగిన అవతరణమిది. "అపేక్షించిన ప్రగతిని పొందుటకు దిగిన మహాపీడన (వత్తిడి)మిది", అని అమ్మ ఆనాడే అభివర్ణించారు. "అవచేతన వైపుకు నానాటికి మరింత లోతుగా ఈ శక్తి ఇట్లు (చలించని అవతరణను సూచించు సంకేతము) దిగుచున్నట్లు ఇపుడు కన్పించుచున్నది", అని అమ్మ ఏప్రిల్ 12, 72,న తెలియ పర్చారు. అందుచేతనే అవర ప్రపంచములో కలకలము!

"ఈ శక్తికి స్థూలపదార్థసంహతి (గట్టిదనము) లేదు. కాని దానికి మనలను నలగద్రొక్కివేసే మహాభారమున్నట్లు మనకు అనుభూత మగును. అది ద్రవ్యాత్మకము కాదు. అట్లు కన్పించదు కూడ. కాని ద్రవ్యముపై ద్రవ్యాత్మక వస్తువులకంటె అది అధిక ప్రభావమును బర పును. దాని ప్రభావము దినదినము, గంటగంటకు ఎక్కువ విశదమగు చున్నది. అది "భగవంతునిచేత" నిర్దేశింపబడినపుడు నిజముగా అది పదార్థమును కదిలించగల – అర్థమగుచున్నదా – సత్తమ కలిగియున్నది.

అని మనకు స్ఫురించును. అది ద్రవ్య సంబంధియగు విప్లవమును సృష్టించగలదు. అది .... ద్రవ్యముకంటె బలీయమైనది. అవును అది అంతే.

"ఇపుడీ ప్రపంచము గతములోని ప్రపంచమెంత మాత్రము గాదు, ఏదో నూతనమైనది. అందులో ఏర్పడి ఉన్నది. నిజముగా ఏర్పడి ఉన్నది.

"ఇపుడు మన లోకజ్ఞానమంతయు మన తర్కమంతయు, మన వ్యవహార జ్ఞానమంతయు మట్టిపాలై పోయినది! అంతరించినది! దాని కిపుడు ఏ బలము లేదు. అది ఇంకెంత మాత్రము యథార్థము కాదు. అది ఈ నవ్యసత్యానికి ఏమాత్రము సంబంధించదు. ఇపుడున్న దొక నూతన ప్రపంచము! నవ్య ప్రపంచము ఈ స్థూల జగత్తులో శరీరము దాల్చ గోరుతున్నది."

కావున వ్యక్తిగతముగా అమ్మకు 1972 మార్చి 24 న కానవచ్చిన తన నవ్యశరీరము ఎట్లు బహిర్గతము కాగోరుతున్నదో, అట్లే, సమష్టి గతముగా ఒక నవ్య ప్రపంచము రూపొంది బహిర్గతము కాగోరుతున్నది.

ఈ నూతన సృష్టి విషయమున మనలోకజ్ఞానము చెప్పునదేమన, "అది అసంభవము, అట్లు మున్నెన్నడును జరుగలేదు. దీనికి అమ్మ ఉద్ఘాటించి చెప్పు సమాధానమేమన, "మున్నెన్నడును జరుగలేదు గనుకనే, సరిగా అందుచేతనే అది ఇపుడు జరిగితీరును."

ఈ నూతన సృష్టికీ మనకూ ఒక సన్నని పొరమాత్రమే అడ్డ మున్నదనిపించును. ఆ పొరవెనుకనున్నదానిని అమ్మ సాక్షాత్తుచూస్తు న్నారుగాన, ఆమెకు దాని ఆవిర్భావము అనివార్యమని తెలియును.

ఇప్పటి లోకముపోకడ పరికించే పెక్కుమందికి ప్రళయము తప్పదేమోననే భయము కలుగుతోంది. కారణం, అవినీతి, అవ్యవస్థ అంతగా పెచ్చు పెరిగిపోయాయి. దీనికి కారణముఅమ్మ వెల్లడించారు. వినండి :

"ద్రవ్యము (Matter) పై భీషణమైన ఒత్తిడిని ప్రయోగించుచున్న ఇప్పటి దివ్యశక్తివలన తటస్థముగానున్న వస్తువులు ఏదో పక్షమును చేరుచున్నవి. కొంచెము పొరపాటు దాని ఫలితములందు తీవ్రరూపము ధరించుచున్నది. ఇక కొంచెము చిత్తశుద్ధి నిజమగు ఇంచుక ఆకాంక్ష తమ ఫలితములలో అద్భుతావహములగుచున్నవి ! అవధులు మరింత దూరానికి జరుగుచున్నవి." దివ్యశక్తికి తట్టుకొనలేక చెడు మరింత పెచ్చు పెరిగి పోవడంచేత ప్రళయము తప్పదనే భయము మనకు కలగడం సహజం. కాని అదే సమయములో—

"(సత్పక్షమునకూడ) అసాధారణ మహిమలు—అసాధారణము ! క్షణములో మృత్యువాత బడనున్న జనులు రక్షింపబడుచున్నారు. విడదీయరాని చిక్కుసమస్యలు ఇట్టే విడిపోవుచున్నవి."

సత్పక్షముకూడ మహోన్నతిని ప్రాపించుచున్నది గనుక, ద్రవ్యమును పడి మార్చివేయగల ప్రభావము ఆ దివ్యశక్తికున్నది గనుక, ప్రళయమును గురించి మనమంత భయపడ నవసరములేదు.

భగవద్గీతయందలి విశ్వరూప సందర్శనములో— "సిద్ధసంఘములు నమస్కరించుచుండగా, రాక్షసానీకములు భీతిల్లి పారిపోవుచున్నవి !" అని అర్జునుడు వర్ణించుతాడు. అలాగే ఈ దివ్య శక్తిని వీక్షించి విముఖులు కలతజెందిన జెందవచ్చు. మనకు మాత్రము నమస్కార

యోగ్యము. దానిని వలన "మన ఆకాంక్షలో అణు మాత్రము చిత్తశుద్ధి ఉన్నను, అది అద్భుత ఫలితములనిచ్చును." ఎంతటి మహనీయ సమయమిది ! దీనినే శ్రీ అరవిందుడు భగవంతుని ఘడియ (The Hour of God) అని అభివర్ణించారు.

—'బుల్లెటిన్' సౌజన్యముతో.

ఆ ఉత్తరములో వారు నాకు సూచించిన ఒక విషయము ఏమనగా అన్నికంటె ముఖ్యము 'నవ్యశరీరము'ను పంపుతున్నాను. అది అమ్మ సాధనలో చరమానుభవము. అది మీకును హత్తుకొనగలదని ఆశించుతున్నాను.

## అసత్యము అశనిసదృశము !

నాబిడ్డలలో ప్రతి ఒక్కరిని ఉద్దేశించి పలుకుతున్నాను : అసత్య ప్రేరణకులోనై, వారు ఎపుడెపుడు ఏది చింతించినా, ఏది చెప్పినా, ఏపని చేసినా, అది నాశరీరమును పిడుగు పాటువలె పీడించుతుంది !

16—7—1972 —మాతృశ్రీ

పరిశీలన : ఇది చదివినపుడు నాపై ఒక పిడుగు పడినట్లయింది ! అహో! అనుదినము, కాదు అనుక్షణము మనము మనబంగారు తల్లికి ఎంత బాధ కల్గించు తున్నామో ! మన చర్యలు మేకులు, బాకులునై ఆ భాగవత తనువును ఎంత వేధించుతున్నాయో! అమ్మబిడ్డల మనుకునే మనపై ఎంత బాధ్యత పడుతున్నది !

ఇక రెండవ విషయము:— ఎవరీతల్లి? మనతో, విశ్వముతో ఈదివ్య జననికి ఎంత తాదాత్మ్యము! నామనసులో, ఎవరికీ తెలియని చీకటిలో, ఒకమూల ఒక అసత్య ప్రేరణవస్తే, అది అమ్మపై ఒక ఉద్దండ ప్రహారమై పడుతుందట! మనప్రతిచర్యను అమ్మనిర్నిద్రగా గమనించడమే కాదు; అది అయోగ్యమైన దయితే అమ్మను శూలము వలె వేధించుతుంది కూడాను! మన తప్పులు ఆ విధంగా బాధించేవ్యక్తి మనము ఎక్కడైనా విన్నామా?

భాగవతములో బ్రహ్మదేవుడు తన అపరాధమును మన్నించమని కృష్ణ పరమాత్మను ఆవేదనతో ఇలావేడుకుంటాడు: "స్వామీ! తల్లి తనగర్భములోని శిశువు తన్నేతన్నులను మన్నించినట్లే, నీవు నన్నుకూడ మన్నించాలి!" మనము జగన్మాతయగు ఆతల్లి విశ్వగర్భములో ఉన్నాము గావుననే, మన అసత్యరూపపు తన్నులు ఆమె కోమలగర్భానికి ప్రహారములవలె వ్యథ కల్గించు తున్నాయి.

ఆభాగవతములోనే— "ఎట్టిదుష్కర్ముని నే భరింతునుగాని, సత్య హీనుని మోయజాలననుచు భూదేవి విష్ణుదేవునితో మొరపెట్టుకున్నది! మనకు కన్పించని భూదేవిని మన అసత్యచేష్టను అంతగా వేధించుతాయి. అమ్మకు భూదేవికి ఎంత సాదృశ్యము!

## నిశ్చలతా స్థితి

నవంబరు 72 బుల్లెటిన్‌లో శ్రీ జనని వెల్లడించిన తన ప్రస్తుత దివ్యానుభవాలను ఇంచుక చవి చూద్దాము: శ్రీ జనని అంటున్నారు—

"నాకీ విషయము ఇపుడు మిక్కిలి విస్పష్టం: ఇపుడు నన్ను నడుపుతున్నది చేతన గాని, ఆలోచన కాదు.

"అయితే ఈ రెండింటికి ఉన్న భేదము? ఎలా చెప్పను ? అయినా చెపుతాను : గిరగిర తిరుగుతూ భ్రమించేది ఆలోచన, ఊర్ధ్వముఖముగా ఆత్మార్పణ గావించుకునేది చేతన.

"అహం రహితమై, 'నేను లేను' – అను విచిత్రానుభూతితో ఈ చేతన నిశ్చలముగా నుండి తనను ఊర్ధ్వముగా భగవానున కర్పించుకుంటుంది. ఈ అవస్థను పారదర్శకత అనాలో, లేక నిశ్చలత అనాలో చెప్పలేను: కాని ఆ చేతన కదలడం ప్రారంభించగానే, అంటే, ఏ రూపములోనైనా 'నేను' పొడసూపగానే అంతా అసహ్య మవుతుంది. ఆత్మార్పణ భావములో నిశ్చలత కొనసాగినంత కాలము మాత్రము ఆ స్థితి అత్యంత ఆనందమయము !

"కాని భౌతిక దేహానికి గల సహస్రానుభవాలు ఏమి చెప్పునో నీకు తెలుసా? ఈ ఆనందమయ స్థితి కేవలము అసంభవావస్థ మాత్రమే– అని వక్కాణిస్తాయి. ఇట్టి మూర్ఖతే ప్రతి పరిణామమును ఆలస్యము చేస్తోంది. శరీర కణములు–పోరాడుతూ బాధలు పడడానికి అలవాటు పడిన శరీరకణములు – నిశ్చలముగా ఆత్మార్పణము గావించుకుని పరమానందము ననుభవించే భవ్యస్థితిని సాధ్యమని ఆమోదించ జాలనట్లు కన్పించుతాయి. శరీరము యొక్క గత సంచితానుభవమే సమస్తమును చెడగొడుతోంది !

"అయితే నా శరీరము తెలుసుకుంటోంది, ఇపుడే తెలుసుకోవడం ఆరంభించింది– దైవపక్షము వహించడానికి అర్థమే జీవితము – ప్రగతిశీల, ప్రకాశమయ జీవితము అని.

"కాని (ఏ శరీరమైనా) ఈ దైవ వైఖరిని విడనాడిన వెంటనే, అది బాధాకరమవుతుంది; ప్రతిదీ అపుడు గాయపరచి, స్వయముగా గాయపడుతుంది. అట్టి సమయములో సర్వత్ర మృత్యు విలయముల స్ఫురణ కలుగుతుంది. ఈ స్ఫురణ జడపదార్థము యొక్క అవశ్యతను (Helplessness) మరింత ఇనుమడింప జేస్తుంది:

"స్వవిషయము చెప్పాలంటే, కర్మాచరణానికి ఇంతదనుక వేటి మీద నమ్మకముంచానో, అవి అన్నీ కావాలనే విచ్ఛిన్నమై పోయినట్లు కన్పించుతున్నాయి. అప్పుడేగదా, "నీవు ఇచ్ఛించినట్లే" అని ప్రతి చిన్న విషయములోను కూడ నేను అనవలసి వస్తుంది. అది....అదే – నాఏకైక ఆశ్రయమయింది."

ఇలా నిశ్చలతావస్థయందు తన అశేష సమర్పణా భావమును అభివర్ణించి సారాంశము చెపుతున్నారు :

"ఇపుడు నేను స్పష్టముగా చూడలేక పోతున్నాను, స్పష్టముగా మాటాడలేక పోతున్నాను. ఈ విషయమున నేను నిస్సహాయురాలను : ఏలనంటే, నీవే తండ్రీ! ఈ స్థితిని నాకొరకు కల్పించావు. అది ఒక విలక్షణావస్థ....ఈ అవస్థలో శరీరము క్షీణించినట్లు అనుభవముపొందదు. శరీరములో శక్తి ఉన్నది. (శ్రీమాత తన చేతుల కండరములను స్పృశించి చూపును). ప్రభువు కోరితే, అది తన కార్యకలాపాలను రేపే తిరిగి యథాపూర్వం నిర్వర్తించగలదు.

"అయితే ఈ దశలో నున్న నేను ఈ విషయము నెరుగని సాధారణుల దృష్టికి శుద్ధమొద్దుగా కన్పించగలను. దానికి సిద్ధపడే ఇలా ఉన్నాను." అపుడు అమ్మతో శిష్యుడిలా అంటున్నాడు—

"కాని, అమ్మా, ఇది భగవంతుడు మీ కొరకు నిశ్చయముగా ఇచ్చించిన అవస్థ యని మీకు తెలియనే తెలుసు. ఏలనగా, నా చిన్న బుద్ధి చూడగలిగినంతలోనే, మీరు మీ నిశ్చలతా భావములో శక్తియొక్క— మహత్తర ఉత్పాదక కేంద్రముగా నాకు అనుభవమవుతోంది."

దానిమీద శ్రీతల్లిగారు చివరి మాటగా అంటున్నారు —

"అవును. అది నాకుతెలుసు, స్పష్టముగా తెలుసు. మహత్తరం! అవును ఒక మహత్తరశక్తి !"

30-8-1972 — మాతృశ్రీ

గమనిక : శ్రీఅరవిందుడు అతిమానస పరివర్తనమును సత్వర పరచ డానికి 5-12-50న ఆత్మాహుతి గావించారంటే, మనకు సరిగా అర్థముకాలేదు. ఇపుడు అమ్మలో ఆ ఆహుతి కృత నిశ్చయముగా సాగుతూ ఉన్నట్లుకన్పించుతోంది.

చూడండి : అమ్మకు ఇప్పటివరకు ఉన్న క్రియాధారలన్నీ తునాతునకలై పోయాయి. అమ్మ ఇపుడు తన క్రియాకలాపము నంతను మానుకొని "నీఇచ్ఛనడిపినట్లే" అని అచలముగా కూర్చుంది. పరమేశ్వరుడామెకు స్తబ్ధతగా కన్పించే ఒకానొక స్థితిని కల్పించాడు - ఆస్థితిలో ఆమె దృష్టి మందగించుతోంది, మాట హీనమవుతోంది! అయినా ఆ స్థితికే ఆహుతి అయి పోతోంది అమ్మ! ఇది మనలను ఎంత కదిలించి వేస్తుంది!

అమ్మకు ఇంకా శరీరసత్వముంది. కాని ఆ సత్వమును కూడ అమ్మ పరమేశ్వరేచ్ఛకే బలిపెడుతోంది!

అయితే ఈ బలి నిష్ఫలము కాదు. లోలోపల అది స్తబ్ధత కాదు. చలించని చేతనయొక్క పారదర్శక ప్రకాశమయ స్థితి. ఈ స్థితి శక్త్యవతరణకు అత్యంతానుకూలము. ఆ స్థితి నుండే ఒక బ్రహ్మాండమైన శక్తి దశదిశల ప్రసరించి వ్యాపించుతోంది. ఈ విధముగా తన నేనును నిర్మూలించుకొని అతిమానస పరివర్తనానికి శ్రీ అరవిందునివలె ఆత్మాహుతిని సజీవముగానే గావించుకుంటోంది ఈ జగన్మాత !

## మాతృశ్రీలో జరుగుతున్న మహాసమరము

మహాసమర మనగానే ఈ శతాబ్దములోనే జరిగిన రెండు ప్రపంచ యుద్ధాలు మనకు జ్ఞాపకము వస్తాయి. ఈ రెండింటిలోను అత్యంత ఆధునికమైన మారణ ఆయుధాలు ప్రయోగించబడినాయి. అయితే ఇవి భౌతిక విజ్ఞానము వెలువరించిన ఆయుధాలు. ఇక వీటికి విలక్షణముగా గుప్త విద్యాప్రాప్తములైన దారుణాయుధాలు వినియోగించిన మరొక మహా యుద్ధమున్నది. చరిత్రలో వెనుకకు జరిగితే, మనకు కానవచ్చే భారత మహా యుద్ధమది ! ఈ మూడు సంక్షోభాలలోను రాజ్యాలన్నీ పాల్గొన్నాయి ! కావుననే వీటికి మహా సంగ్రామ నామధేయము.

వీటిని గురించి పలువివరాలతోకూడ మనకు తెలుసు. కాని ఈ యుద్ధాలకు నిగూఢమూలమైన యుద్ధమును గురించి మనకు తెలుసా ? తెలిస్తే ఎందుకు, చెప్పుకోము ? పైగా తెలిస్తే మూలమునందే అరికట్టడానికి ప్రయత్నించి ఉండేవాళ్ళము గదా ! సరే, ఇపుడు తెలుసుకుందాము—

"నా చేతనయందు అంతర్గతముగా ప్రపంచ మహా సంగ్రామము విజృంభించి సాగుతూ ఉన్నట్లున్నది."— ఇది ఎవరు చెప్పినమాట, ఈ రహస్యమును వెల్లడించిన దెవరు ? మాతృశ్రీ స్వయముగా తన అంతరమును వెలికి విప్పుతూ అక్టోబరు 25, 1972 న చెప్పిన మాటఇది.

"నేనేమి చేస్తున్నానో పరులకు అంతుబట్టదు ! కారణం, అవి బాహ్యమున జరగడములేదు" అనే అర్థముతో ఒకసారి శ్రీ అరవిందుడు తననుగురించి అన్నారు. అలాగే అమ్మ చేతనకు అంతర్గతముగా జరుగు తున్నది గాన, ఆమె స్వయముగా వెల్లడించేవరకూ మనకీ విషయము అంతుబట్టలేదు. ఒకమూల ఏకాంతములో గడుపుతున్న అమ్మలో ప్రపంచ మహా సంగ్రామము !

శ్రీ అమ్మ నిజానికి ఒక మూల కూర్చోలేదు. అమ్మలోనే ఒక మూల ప్రపంచము కూర్చున్నది! అదీ అమ్మ నిజతత్వం! అయినప్పటికీ అమ్మకుకూడ ఈ సమరము ఎంత కఠోర దారుణమో ఇపుడు గమనించుదాము.

"ఈసమర సంక్షోభము ఇపుడు ఎంత ఉద్ధృత స్థితికి వచ్చివేసిందంటే నిమిష మాత్రం భగవంతుని విస్మరించితే – ఆ విస్మరణం మహావిపత్తును గొని వస్తుంది!" శ్రీ అమ్మ ఒకమూల ఉన్నదనే మనము అను కుంటున్నాము గాని, రెప్పవేయకుండా అహోరాత్రాలు ఈ సమరమును సాగిస్తున్నారని మనకేమి తెలుసు! మళ్ళీ, మాతృశ్రీ వచించిన పై వాక్య మును బట్టే ఆ భయానక స్థితిని గుర్తించ వలసి ఉంటుంది మనము.

ఇంతకూ ఈ సమర స్వరూపమేమిటి? అమ్మమాటలలో (అడుగున ఉన్న) అవచేతనలో సమస్త విరోధాలు పేరుకొని ఉన్నాయి. ఆ రాశి

అనుక్షణము విజృంభించి పైకి ప్రవాహముగా తన్నుతున్నది! ఈ అవచేతన పైకొన్నపుడు నీవు బుద్ధిహీనుడవు, జడుడవు, దుష్టసంకల్పుడవు అయిపోతావు! ఒక వైపున ఈ చేతన, రెండవవైపున —

"(మెడచుట్టు చేతిని త్రిప్పి చూపుతూ) ఈ భవ్యచేతన! ఎంత ప్రశాంతమిది, ఎంత అద్భుతముగా ప్రశాంత గంభీరమిది! అపుడు నేను ఈశ్వరునికి విజ్ఞప్తి చేస్తాను. 'నీ ఇచ్ఛే ఓ పరమేశ్వరా! నీ ఇచ్ఛే ఘటిల్లుగాక!' ఇక ఇపుడు ఈ దివ్య చేతన పైకి విజృంభించుతూ ఉన్న ఆవచేతనను అరికట్ట నారంభించుతుంది."

ఇలా అవచేతనకూ, ఈశ్వర చేతనకూ మధ్య పొసగి విజృంభించుతూ ఉన్న మహా సంగ్రామమిది. ఎందుచేత ఇది మహా సంగ్రామము!

"ఇచ్చట యుద్ధము సలుపుతూ ఉన్నది కేవలమూ ఒక వ్యక్తి యొక్క అవచేతనకాదు, అది సమస్త పృథివీ తత్వము యొక్క అవచేతన! ఈఅశేషమగు అవచేతన ఒక్కుమ్మడి పైకెగసి పోరాడుతోంది!" అని శ్రీతల్లిగారు ఈఆంతర సమరము యొక్క అత్యంత మహత్వమును వెల్లడించుతున్నారు. హిట్లరు అసురశక్తుల ప్రతినిధి అని శ్రీఅరవిందుడు అనేకపర్యాయాలు స్పష్టపరిచాడు. అలాగే దుర్యోధనుడు కలిపురుషుని యొక్క అంశమని వేద వ్యాసుడు వెల్లడించాడు. ఈవిధముగా మనకు తెలిసిన మహాయుద్ధాలలో అవచేతన యొక్క ప్రతినిధులో, అంశాలో మాత్రమే పాల్గొన్నాయి. కాని మాతృశ్రీ సమరములో అసురశక్తుల మూల విరాట్టే రణరంగములోడిగి నీవోనేనో తేల్చుకోవాలనే పట్టుదలతో పోరాడుతున్నది. అందుచేతనే మనకు తెలిసినవి సాపేక్ష మహాయుద్ధాలుకాగా, శ్రీ అమ్మలోని సమరము నిరపేక్ష మహాసంగ్రామముగా ఉగ్గడించాలి!

ఇది మహాసంగ్రామ మనడానికి మరొక విశిష్ట కారణముంది! శ్రీ అమ్మ ఈ సమరములో పాల్గొనే విధానమును బట్టి అది మనకు విశదము కాగలదు. ఆ విధానమును శ్రీ తల్లిగారు ఇలా వివరించారు—

"ఈ ఆంతర సమరము ఎంతకాలము సాగినా నేను దాని నాపలేను. విరమించలేను! విరమించితే చేపట్టిన కార్యమే వితథ మవుతుంది. నేనిపుడు చేయవలసిన దిదే: ప్రశాంతముగా, ప్రశాంతముగా, ప్రశాంతముగా ఉండడమే .... నా వలన ఏమీ కాదు, ఏమీకాదు, ఏమీ కాదు – అని అనుభవములో గ్రహించడమే. అపుడే భగవంతుని దివ్య దీప్తులు నాలో నుంచి ప్రసరించగలవు. ఇది ఒక్కటే ఈ భీషణ సమస్యను పరిష్కరించగలదు. ఈ పరమ సమరమును సలుపవలసినది ఆ పరమేశ్వరుడే!" ఈ సమరము మానవ శక్తికి సాధ్యముకాదు; భగవంతుడే ఇక్కడ పరమయోద్ధ. ఇందుచేత కూడ శ్రీ అమ్మలోని యుద్ధముఅపూర్వమగు మనకు తెలియని మహాయుద్ధం!

ఈ ఆంతర సమరము అనాదిగా సాగుతూనే ఉన్నదిగదా! అయితే ఎందుకు ఇంత విశేషముగా దీని నిపుడు ప్రస్తుతించాలి? జడము చేతనముల మధ్యనున్న అవరోధమును పూర్తిగా తొలగించి, శ్రీ అమ్మ తన చేతనలో దివ్యశక్తులు క్రిందికి దిగడానికి ద్వారమును తెరచి పెట్టారు. ఆ అవతరించుతూన్న దైవశక్తులు అవచేతనయొక్క పాదునే పెల్లగించి వేయడానికి పూనుకున్నాయి గనుకనే, ఈ సమరములో ఇపుడు మహోద్ధృతి పెచ్చుపెరిగింది! శ్రీ అమ్మద్వారానే ఈ ఉద్ధృతి వర్ణన కొంత విందాము—

"(శ్రీ అమ్మ తన కంఠమును చూపుతూ) ఇక్కడనున్న నాచేతనలో ఊర్ధ్వావర శక్తులు తారసిల్లి పోరాడే సంగ్రామకేంద్ర మున్నట్లు కాన్పించును. నేను చలించక ఈ చేతనలో ప్రవేశించినపుడు కాలము భీషణవేగముతో పరుగుపెట్టును- కాని ఒక ప్రకాశమయ నిర్మల వాతావరణములో ! అది రణరంగమే కాని, పరమ ప్రశాంతిచేత అనుగతమైన రణరంగము. అణుమాత్రము ఆస్థితినుండి బయటికి లాగబడుదునేని, నన్ను నరకములోనికి ఈడ్చినట్లుండును ! ఆ శాంతి ఎంత అవర్ణనీయమో, దానినుండి చ్యుతికూడ అంత భయానకము ! ఆ చ్యుతి స్థితిలో నీవు అల్లాడి పోదువు. ఒక్క నిముషముకూడ 'ఇక్కడ గడప జాలను' అని నీ కనిపించును ! భరించలేక భగవంతుని పిలుతువు. దానితో భగవంతుని వడిలో కుదురుకుందువు. ఇక అపుడు అంతా తిరిగి సరియగును "

ఈ సమరములో కాలము భయంకర వేగముతో పరుగు పెడుతున్నది. యుగములలో జరుగవలసింది, సంవత్సరాలలో జరిగిపోతున్నది! ఇది ఇప్పటి దశలోని అద్భుత విశేషము! ఈ మహా వేగమును భరించడం శ్రీఅమ్మ చేతనలోని పరమ శాంతికి మాత్రమే సాధ్యం! ఇదీ ఇప్పటి అపూర్వత్వం! నవంబరు 4,19'2 నాడు శ్రీఅమ్మ అందించిన వివరాలను బట్టి మనకీ పై విశేషాలు అవగతమవుతున్నాయి.

"మీచేతనవంటి చేతనలో ప్రవేశించడానికి అమ్మా! సులభోపాయమేది?" అని భక్తుడు అడుగగా -

"నాకు తెలియదు. ఏలన, శరీర చేతనతోసహా నా యావచ్చేతనా సర్వదా, స్థిరముగా తాను భగవంతుడనుకున్న దానికి అభిముఖమై

ఉంటుంది. విలసిల్లుతుంది, అదికూడ ఏ మాత్రము నే ప్రయత్నము చేయకుండానే, తెలుసునా?" అని అమ్మ బదులు చెప్పింది. అలాంటి శ్రీఅమ్మ ఆవిర్భవించడమే ఇప్పటి కాలములోని విశేషము. అందు చేతనే శ్రీఅమ్మలో ఈమహాసంగ్రామము అనితర సాధ్యముగా జరుగుతూ వుంది.

"సాధనలోని పరమరహస్య మేమిటంటే, మనోయత్నము చేత గాక, ఆంతరమున లేక ఊర్ధ్వమున విలసిల్లుతూన్న మహాశక్తిచేత మన పనులను చేయించుకోవడం నేర్చుకోవాలి!" – ఇది శ్రీ అరవిందుని అను భవవచనము – ఈ నేర్పు శ్రీ అమ్మలో పరాకాష్ఠ నందుకొన్నది ; కావుననే ఈ అపూర్వ సంగ్రామమునకు శ్రీఅమ్మలో ఆశ్రయము లభించింది.

ఒక వ్యక్తికి విశ్వసముద్ధరణము సాధ్యమా ? ఈ శంకకుసంబం ధించి శ్రీఅరవిందుడు 'సావిత్రి'లో ఏమి వ్రాశారో చూద్దాము :

"No helper had she save the strength within". Sa.1-2
(ఆమెకు సహాయకుడే లేడు, ఆంతర పరబలము తప్ప)

"One soul's ambition lifted up the race". Sa. 1-3.
(ఒక వ్యక్తి మహాకాంక్ష ఒక జాతినే ఉద్ధరించింది).

ఆమె విశ్వచేతన పొందిన వ్యక్తి అయితే, లేక వ్యక్తిచేతన స్వీకరించిన విశ్వచేతనయే అయితే ఎందుకు సాధ్యము కాదు ?

డిశంబరు 30,1972 నాడు మాత్రశ్రీ ఇప్పటి నూతన సంవత్సర

మును లక్షించి చెప్పిన మాటలో ఇప్పటి పరిస్థితి ఎంత విషమమయినా, అదే సమయములో అది ఎంత దివ్యముగా కూడా ఉన్నదో ఇపుడు చూద్దాము –

"పరిస్థితులు చరమదశను అందుకున్నాయి! ఒక వైపున అచింత్యతేజో వైభవమునకు అభిముఖముగా ఉద్ధరించబడిన భవ్య వాతావరణము; రెండవ వైపున ఏక్షణములోనైనా చావు సంభవమనే అనుభవము! అయితే అది 'చావు' కాదు. శరీర విశ్లేషణము మాత్రమే అవుతుంది. అందుచేత, ఈ అనుభవద్వయము కలిసి ఒక అద్భుత మహా చేతనను ఏర్పరచుతున్నాయి....(శ్రీఅమ్మ తనతలను పంకించుతూ) ఈ మహాచేతనలో గత విషయములన్నీ పసితనమునకు సంబంధించినవిగా వ్యర్థమై వెలవెలబోతాయి. అందుచేత వాటియందు మోహమును విడిచిన శరీరానికి, అవును శరీరానికే ఒకేఒక ప్రార్థన పెల్లుబుకుతోంది.

"నిన్ను గ్రహించే యోగ్యతను నా కిమ్ము,
నిన్ను సేవించే యోగ్యతను నా కిమ్ము,
నీవుగా ఉండిపోయే యోగ్యతను నాకిమ్ము."

ఈ ప్రార్థనా రాజము నందించి, శ్రీ అమ్మ తన అడుగు జాడలలో పురోగమించేందుకు మనకు దారి చూపుతున్నారు.

ఈ పార్థనయొక్క ప్రాధాన్యం శ్రీఅమ్మ నుడివిన మరొక వాక్యములో మనము కనుగొనగలము.

"అమరత్వ ప్రాప్తికి ఆయత్తమయ్యేందుకు శరీర చేతన మున్ముందుగా నిత్యమగు పరచేతనతో తాదాత్మ్యము పొందాలి!" అందుచేతనే

పైన 'నీవుగా ఉండిపోయే యోగ్యతను నాకిమ్ము' అని శ్రీఅమ్మశరీరము ఆర్తితో అడుగుతున్నది. ఈ ప్రార్థించే శ్రీఅమ్మ తన విశ్వచేతనలో మన అందరి శరీరాలను ఇముడ్చుకున్న శ్రీఅమ్మ! ఇది మరువరాదు, కావున శ్రీఅమ్మ ప్రార్థనా, శ్రీఅమ్మ సాధనా మనకొరకే! ఇప్పట్టున మనము గ్రహించుకోగలము – శ్రీఅమ్మను మనము ఎంతగా అనుగమించాలో, అనువర్తించాలో !

యుద్ధాలను శాశ్వతముగా తుదముట్టించడానికే 'ఈ రెండవ ప్రపంచ మహాయుద్ధ' మన్నారు. ఆ ఆశయము పగటికల మాత్రమే అయింది. నిజానికి శ్రీఅమ్మలో ఇపుడు ఉద్ధృతముగా విజృంభించుతూ ఉన్న మహా సంగ్రామముపైననే శాశ్వతశాంతి, శరీరామరత్వము, దివ్య జీవనము ఆధారపడి ఉన్నాయి.

—→: O :←—

# మాతారవిందుల మహనీయత

ఎక్కడో ఫ్రాన్సులో పుట్టిన మాతృశ్రీ సహయోగము శ్రీ అరవిందునికి లభించటంలో అంతర్యమేమిటి? మాతృశ్రీ శక్తిస్వరూపిణి. శ్రీఅరవిందుడు ప్రధానముగా శివస్వరూపుడు. ఈ శివ, శక్తుల సంయోగము ఉంటేనేగాని యే ఘనకార్యమూ సాధించటం సాధ్యంకాదు. అలాంటప్పుడు అతిమానస పరివర్తనం అసలే సాధ్యంకాదు. కేవలం ప్రేమతోను, కేవలం శక్తితోను వచ్చిన మహా పురుషులు తమ ఆశయ విషయంలో ఏ విధంగా వైఫల్యం పొందారో మనకు తెలుసు. కావుననే మాతారవిందుల సహయోగం ఇప్పటి అపూర్వ విశేషము. మహనీయమగు వారి అన్యోన్యత, పరస్పర సమర్పణము, ఈ ప్రకరణంలో చదివి నప్పుడు మనలను చకితులను చేయగలవు. వారి దివ్యత్వము కూడా కొంతలో కొంత మనకిక్కడ అందగలదు. ఇట్టి మహనీయులను స్మరించుతూ లోలోపల తలవంచి చేతులు జోడించగలము.

## పరస్పర దైవభావము

నాస్వీయ సంకల్పమును, స్వీయ వాదమును (Self assertion) కడిగివేసి నన్ను విశుద్ధుని జేయ ప్రార్థింతును. అట్టి విశుద్ధితో మాతృశ్రీకి విధేయుడనై, వినేయుడనై ఆమె కర్మయందు యోగ్యమగు ఉపకరణమగుదునుగాక! నేజేసే ప్రతిపనియందు ఆమె అనుగ్రహముచేతనే నడుపబడుతూ ఆమెకే సమర్పితుడనై మనుదునుగాక!

—శ్రీ అరవిందుడు

పాపబలమును మించిన ప్రకృష్టబలము మాత్రమే విజయమును సాధించగలదు. శిలువకెక్కిన దేహము కాదు, తేజోమహితమగు శరీరమే జగత్తును రక్షించును.

వ్యాఖ్య : మాతారవిందులు ఏ బలముతో వచ్చారో, ఆ బలమును ఈ సందేశము సూచించును.

ప్రభూ ! నేటి ఉదయము నీవు నాకు ఆశ్వాసమిచ్చావు (ధైర్యము చెప్పావు)—నీ కార్యమును సాధించేదనుక నీవు మాతో స్థిరముగా నుందువని, దారి చూపించుతూ వెలుగునిచ్చే చేతనా మాత్రముగానే గాక, కర్మయందు సన్నిధిగా కూడ దీపించుతూ నుందువని ఆశ్వాస మిచ్చావు. పృథివీ తత్త్వము పరివర్తనము చెందేవరకు పృథివీ వాతావరణమును విడిచివేయక నీ సమస్త సత్తతోనూ ఇక్కడే నిలిచియుందువని అసందిగ్ధ పదములతో వాగ్దానము చేశావు. నీ ఈ అద్భుత సన్నిధికి (Presence) యోగ్యులమగునట్లుగా అనుగ్రహింపుము; నేటినుండి మాలోని ప్రత్యంశము, నీ సమున్నత కార్య సాఫల్యములకు అధికాధిక సంపూర్ణముగా అంకితమైపోవాలనే ఏకైక సంకల్పముపైననే ఏకాగ్రత జెందున్నట్లుకూడ అనుగ్రహింపుము ప్రభూ !

7-12-1950 —మాతృశ్రీ

గమనిక : ఇలాఆశ్వాస మిచ్చినది శరీరత్యాగానంతరము సూక్ష్మరూపము నందున్న శ్రీ అరవిందుడే.

నీకు – మా అధినాథునియొక్క స్థూలరూపముగా ఉండిన నీకు – ఇదే మా అనంత కృతజ్ఞతాపూరమును అర్పించుకొంటున్నాము. మాకు నీవు

ఎంత కష్టపెట్టావో, ఎంత కృషి గావించావో మా కొరకు, మా నిమిత్తం ఎంత పోరాడి, ఎట్టి తీవ్రవేదనకు గురి అయ్యావో, ఎంత ఆశించి ఎంత సహించావో! అట్టి నీకు ప్రణమిల్లు తున్నాము. మా కొరకు సమస్తమును సంకల్పించి, సమస్తమునకు ప్రయత్నించి, సమస్తమును సిద్ధపరచి సాధించిన నీ ముందు నతమస్తకులమై నమస్కరించుతూ, నీ కెంత ఋణపడి ఉన్నామో – దానిని ఒక లిప్తమాత్రము కూడ మరచి పోకుందుముగాక! అని ప్రాధేయపడి ప్రార్థించుతున్నాము.

డిశంబరు 9–1950 – మాతృశ్రీ

గమనిక : సమాధి చేసిన శ్రీ అరవిందుని భౌతిక కాయము నుద్దేశించిన మాతృశ్రీ ప్రార్థన యిది.

## ఆగమన కార్యము

ఒక నూతన జాతియొక్క మరియు ఒక నూతన ప్రపంచము యొక్క అభివ్యక్తిని ప్రకటించడానికే శ్రీ అరవిందుడు పరమేశ్వరునిచేత పృథివి పైకి పంపబడ్డారు. ఆ నూతన ప్రపంచమే అతిమానస ప్రపంచము. కావున సంపూర్ణ హృదయముతో, సర్వోత్సాహముతో మనము దానికి సంసిద్ధులమగుదుము గాక!

– మాతృశ్రీ

వ్యాఖ్య :– శ్రీ అరవిందుని అపూర్వత భవిష్యత్ ప్రకటన మాత్రము లోనే లేదు. ఆ భవిష్యసాధనకు అతిమానస చేతనను కూడ

తన ద్వారా అవతరింప జేశారు. అంటే భగవంతుడు శ్రీ అరవిందుని పంపి, శ్రీ అరవిందుని ద్వారా ఆ చేతనను కూడ పంపించాడు.

అత్యంత కఠినమూ, ఘోరమూ, సంకుచితమూ, కావడం చేత ఊపిరికూడ ఆడని నిశ్చేతనము యొక్క అట్టడుగు మట్టమున, ఒక మహా బలీయమగు 'స్ప్రింగుపైన' గట్టిగా ఒక వ్రేలు వేసితిని. అంతే! తక్షణమే అది నిరాకారమూ నిస్సీమమూ అయిన మహత్తులోనికి నన్ను విసిరి ఎగురవేసెను. నూతన ప్రపంచము యొక్క బీజాణువులతో స్పందించుతూన్న మహత్తత్వమే అది!

## "అవును"

నాకు పరమాశ్చర్యమును కలిగించిన ఒక అద్భుత విషయము. ఆ అద్భుతమంతా ఒక చిన్నమాట "అవును"లో ఉన్నది. అదేమిటనే కౌతుకము మీ మనస్సులో అపుడే రెపరెపలాడుతోంది గదూ! అయితే వినండి: అమ్మ శ్రీఅరవిందునిపై వ్రాసిన ఒక చిన్న వ్యాసము (ఆగష్టు 1972) 'మదర్ ఇండియా'లో ముందుగా మనకు దర్శనమిస్తుంది. అందులోని చివరి పేరాలో అమ్మ —

"నేను ప్రప్రథమముగా శ్రీఅరవిందుని పాండిచ్చేరిలో కలసికొన్నపుడు ప్రగాఢమగు ఏకాగ్రతలో నుంటిని. అపుడు అతిమనస్సులోని సత్యములు నాకు కానవచ్చుచుండెను. అయితే ఈ సత్యములు

అభివ్యక్తము కావలసియుండియు, ఏలనో కావడములేదు. అపుడు నేను గాంచినది శ్రీ అరవిందునికి నివేదించి, ఆ సత్యములు అభివ్యక్తము లగునా? – అని అడిగితిని. దానికి సమాధానముగా, ఆయన కేవలము – "అవును" అని మాత్రమే అనెను. ఆశ్చర్యము ! అంతలోనే అతి మనోభూమిక పృథివీతలమును స్పృశించి ఇక్కడ యథార్థము కాజొచ్చెను, రూపొంద నారంభించెను ! (అక్కడ) సత్యమగు దానిని (ఇక్కడ) యథార్థము చేయగల అద్భుత శక్తిని ఇదే మొదటిసారిగా నేను వీక్షించితిని."

పరిశీలన : అధిమనస్సును అధిగమించి, దానిపైనున్న అతి మనస్సును ప్రకాశమయ చేతనలో అందుకొన్న వారే ఇప్పటి వరకు లేరని అమ్మ అదే వ్యాసములో పైన చెప్పారు. అయినప్పుడు అమ్మవలే అతి మనస్సులోని సత్యములను స్పష్టముగా చూడడం ఎంత ఆశ్చర్యం ! తరువాత శ్రీఅరవిందుడు "అవును" అనగానే ఆసత్యభూమిక భూమికి దిగివచ్చి స్పృశించడం మరెంత పరమాశ్చర్యం ! శ్రీతల్లి గారు కూడ – ఇలాంటి అద్వితీయశక్తిని కనులార గాంచడం ఇదే తనకు ప్రథమ పర్యాయమని విస్మయము వెలిబుచ్చారు.

ఈ సందర్భములో 'దిమదర్'లోని ఈ వాక్యము గమనార్హము. అది అమ్మ చెప్పినదే—

"అతిమానస లోకము శాశ్వతముగా నుండునది, అందులో నేనొక అతిమానస శరీరముతో శాశ్వతముగా నున్నాను."

ఇట్లు అతిమానస ప్రపంచము అమ్మకు అపరిచితముగాదు. అది ఆమెకు పుట్టిల్లే. కావుననే ఈ శరీరములోకూడ ఏకాగ్రతాస్థితియందు అక్కడి సత్యములు అద్దములోవలె అమ్మకు గాన్పించును. కాని అసలు సమస్య— ఆ లోకానికి, ఈలోకానికి మధ్య ఒక సేతువును నిర్మించాలి. ఆనాడు అమ్మకు అది శ్రీ అరవిందునిద్వారా ఎలా జరుగనుండెనో, శ్రీ అరవిందుని "అవును" ప్రభావమే దాని పరిచయము కలిగించెను.

## సాధకులకు సూచనలు

'గత సమీక్ష' అనే వ్యాసములో 'మ' అను ఆశ్రమవాసి, అమ్మకు సన్నిహితుడు తన అనుభవాలను వ్రాశారు. అవి సాధకులకు ఎంతో తోడ్పడును— అందునుంచి ఒకటి, రెండు. ఒకప్పుడు అమ్మ తనతో వ్యవహరించే తీరులో ఆర్ద్రత తగ్గి సంకోచము గోచరింపనారంభించగా, ఆ బిగువును భరించలేక—

మ :— అమ్మా ! కారణమేమిటి ? చెప్పరూ ? మీకు అసంతుష్టిగలిగించి, మీ ఆర్ద్రతను కోల్పోయినందుకు మిక్కిలి విచారం !

అమ్మ :— నానుంచి విషయము నెందుకు దాయుచున్నావు ?

విషయమేమంటే, ఆ 'మ' — కు లోకాభిరామాయణము చాలా ఇష్టము. అమ్మకు చెప్పకుండా, తెలియనీయకుండా ఆయన అవకాశము లభించినపుడు బాతాఖానీలో నాలుక తీటను తీర్చుకొనేవారు. పైగా

అంతరాత్మ గ్రుచ్చుకొన్నపుడు, దానిని ఏదో తర్కముతో సమర్థించు కొనేవారు.... .... తరువాత మోమోటమినికూడ పాటించకుండా—

మ :— అది అంత నింద్యమే అయితే, నా లాలసను మీరెందుకు నాశనము చేయలేదు ? (అప్పుడు అమ్మ మృదువుగా)—

అమ్మ :— నీవు అలాచేసే అవకాశ మివ్వడంలేదు. ఆ వ్యాధిని తొలగించేందుకు ఎపుడెపుడు గట్టి వత్తిడిని ప్రయోగించుతున్నానో, అపుడపుడు తెలివిగా ఆ ప్రభావమును తప్పించుకొంటున్నావు. అరమరికలు లేకుండా నీ దౌర్బల్యమును నాకు చెప్పి ఉంటే, దానిని ఎంతకాలము ఏ పరిమాణములో కొనసాగనివ్వాలో నిర్ణయించి, నీకు బాధ లేకుండానే నీ సహకారముతో ఈ పాటికి దానిని పోగొట్టి యుండే దానను. నీవు మరొక అడుగు ముందుకు వేసేవాడవు.

మరొక విషయం — 'మ' ఆశ్రమములో దిగిననాడే, ప్రక్క గదిలోని సహవాసి కొంత మొరటుగా కూడ ఇలా సలహా ఇచ్చాడట : "మీ రాష్ట్రము నుంచి వచ్చినవారు ఎందుకూ కొరగారు, వారు ఇంతంత పుస్తకాలు పఠిస్తారు. కబుర్లతో కాలక్షేపం చేస్తారు. సముద్రతీరాన సాయం సమయములో పచారు చేస్తారు. అంతే. పైగా వారు మమ్ములను 'దాస్' (శ్రామిక వర్గము) అని అపహసిస్తారు. అయితే, సోదరా! నేను మీకు చెప్పే హితవేమిటంటే, మీరు శ్రమించి పనిచేయాలి. అపుడే అమ్మ తత్త్వం మీకు తెలియవస్తుంది. అపుడే భౌతికముగా కూడ ఆమె శక్తి స్పర్శను మీరు పొందగలరు."

కొంత కాలము కర్మనిమగ్నుడై గడపిన పమ్మట, ఒక హితైషి

ప్రబోధము చేత అదే 'మ' సగము కాలము లైబ్రరీలో గడపాలని తల పెట్టాడట. అది విని అమ్మ "అవును, అవును మరెట్లు నిరుపయోగి కాగలడు!" అని అప్రయత్నముగా చమత్కరించారట. అక్కడితో ఆ 'మ' తన సంకల్పమును విరమించుకొన్నాడట. దానితో పాటు చదువును కూడ !

## శ్రీ అరవిందుని జన్మము నిత్యజన్మము

భౌతికముగా ఈ నిత్యత్వమునకు అర్థము: ఈ జన్మ ప్రభావము భూలోకమున్నంత వరకు కొనసాగుచునే ఉండును. అనగా, శ్రీ అరవిందుని జన్మఫలితములు నిరవధికముగా అనుభమునకు వచ్చుచునే ఉండునని చెప్పవచ్చును. కావుననే కవిత్వ భాషలో దానిని నిత్యమని పేర్కొంటిని.

మానసికముగా చూచినపుడు, ఈ జన్మమెట్టిదనిన, దాని స్మృతి చిరకాలము నిలిచిపోవును. యుగయుగాల పర్యంతము జనులు శ్రీ అరవిందుని జన్మమును, తత్పరిణామములను స్మరించుకొనగలరు.

అంతరాత్మపరముగా, జగచ్చరిత్రలో ప్రతియుగమునందు పునరావృత్తమై వెలయగల జన్మమది. సమయ సమయమునందు (From time to time) ప్రస్ఫుటమగు అభివ్యక్తి విశేష మీ జన్మము. అనగా, అదే జన్మము నూతనముగా తిరిగి ఏర్పడును. అయితే ఆ జన్మము ప్రతి పర్యాయము మరికొంత అధికముగను, మరికొంత సమగ్రముగను మరి

కొంత పూర్ణముగను రావచ్చును. కాని అదే అవతరణ ప్రవృత్తి, అదే అభివ్యక్తి ప్రవృత్తి, అదే శరీరగత జన్మప్రవృత్తి.

ఇక చివరకు, కేవలము ఆధ్యాత్మికదృష్టితో తిలకించినపుడు, ఆ జన్మము భువిపై నిత్యుని యొక్క జన్మమని చెప్పవచ్చును. ఏలన, అవతారము స్థూలరూపమును స్వీకరించి నపుడెల్ల, అది భువిపై సాక్షాత్తు నిత్యపురుషుని యొక్క జన్మమే యగును.

—మాతృశ్రీ

వ్యాఖ్య : సృష్టియొక్క అర్థమునూ, పరమార్థమునూ గమనించి, గ్రహించి, దానితో శ్రుతికలిపి, తత్పరిపూర్తి కొరకు ఎవరు పాటుపడుదురో, వారి కృషి ఫలితము ఆచంద్రార్కము కొనసాగును. అది భగవదిచ్ఛ ననుసరించి జరుగుతున్నది గాన, భగవదిచ్ఛ ప్రభావము అనంతము గాన, వారి కృషి ఫలితముకూడ అనంతమే అగును.

ఇంతవరకు వచ్చిన అవతారములన్నీ అధి మనస్సుకు (Over mind) చెందిన దేవతలయొక్క అవతారములేనని శ్రీ మాత చెప్పి ఉన్నారు. శ్రీ అరవిందునిలో అతి మనస్సుకూడ అభివ్యక్తమైనది గావున, ఆధ్యాత్మిక దృష్టితో చూచినపుడు, దీనిని నిత్యుడగు పూర్ణ పురుషునియొక్క అవతారమని అనడం సమంజసమగునని మనము భావించుకొనవచ్చును. "కేవలము ఆధ్యాత్మికదృష్టితో...." అని అమ్మ పైన అన్నారు గాన, ఆ దృష్టితో చూచినపుడు, మీరు, నేను, అందరుకూడ ఆ పూర్ణ నిత్యుని యొక్క జన్మములే. అయినపుడు శ్రీ అరవిందుడు తప్పక అట్టి యవతారమే అగును.

## ఆత్మ శక్తి

కొన్ని దృష్టాంతాలు: 1) ఆత్మ శక్తి చేత శ్రీ అరవిందుడు, తనను గురించి అప్పటి బాలికయైన అమ్మకు ఏమీ తెలియక పోయినా, ఆమెకు ఫ్రాన్సులో కన్పించేవారు! 2) కలకత్తానుంచి తనకు సహాయార్థం వ్రాసిన లేఖ అందక పూర్వమే, అమ్మ శక్తి కలకత్తాలోని ఆ భక్తుని రోగమును రూపు మాపింది! ఇలా ఆత్మశక్తికి దూరము లేదు సరే, కాలము కూడ లేదు! 3) భారత స్వరాజ్యమును అమ్మ అనేక సంవత్సరాలకు పూర్వమే దర్శించారు.

వ్యాఖ్య : 'ఆత్మయోగాత్' నేనీ విశ్వరూపమును నీకుచూపించానని శ్రీకృష్ణుడు అర్జునునికి ప్రసన్నుడై చెప్పిన దానిని బట్టి అక్కడ కూడా ఆత్మశక్తే ద్యోతక మవుతున్నది.

విషయ జ్ఞానము, తాదాత్మ్య జ్ఞానము అని రెండు ఉన్నాయి. మనస్సు వస్తువును విషయముగానే తెలిసికోగలదు. ఆత్మ వస్తువును, దానితో తాదాత్మ్యము పొంది తెలుసుకుంటుంది. అపుడు లక్షణాలేగాక, వస్తు స్వరూపము కూడ తెలుస్తుంది. పైగా ఆత్మనుంచే అన్నీ వచ్చాయి గనుక, ఆత్మ అన్నింటిని వ్యాపించి ఉంటుంది. కనుక ఆత్మకు దగ్గర దూరాలు ఉండవు.

## శక్తి ఆవశ్యకత

శ్రీ అరవిందుడు తన 'సూత్రాల'లో ఇలా అంటారు –

"క్రీస్తు ప్రేమతో మాత్రమే వచ్చాడు. ఆయనను అసుర శక్తులు

శిలువ వేశాయి. తిరిగి ఖడ్గముతో వస్తాను – అనిచెప్పి ఆయన నిష్క్రమించాడు. ఇక మహమ్మదు శక్తితో మాత్రమే వచ్చాడు. పైగా ఆయన కార్యసాఫల్యానికి అది సరియైన సమయము కూడ కాదు.

"శక్తిప్రేమలు కలిసినపుడే అప్రతిహతముగా దివ్యకార్యము నిర్వహింపబడుతుంది. దానిని హిందూమతము చేయవలసి ఉన్నది."

కావున శక్తిప్రేమల సమన్వయసంపత్తితో అరుదెంచిన శ్రీమాత, శ్రీఅరవిందుల విశిష్టతను మనము మనసున పట్టించుకోవాలి !

శ్రీఅరవిందుడే కాదు, ఈశక్తి విషయమున అమ్మ పరిశీలనగా సూచించిన క్రమమును కూడ చూద్దాము –

"అవతరణక్రమములో ముందు శాంతి దిగవచ్చు, లేక తేజము, లేక ఆనందము, లేక ప్రేమ. కాని నా దృష్టిలో ముందు శక్తి అవతరించడం అవసరం. అది లేకపోతే ఇక్కడ దివ్యత్వానికి రక్షణ ఉండదు."

సాధకునికి ప్రథమావతరణం శాంతిగావడం మంచిది. కాని అమ్మ వంటి అవతారపురుషులకు ప్రథమావతరణం దుర్దమమైన శక్తిగావడం అవసరం. ఏలనంటే, మనలను రక్షించడానికి అమ్మ ఉన్నది. కాని అమ్మను రక్షించడానికో? తనశక్తే తనను పరివేష్టించి ఉండడం ఆవశ్యకం. అయితే ఈ పరివేష్టనం ఎలా ఉంటుందో మనము ఊహించగలమా? ఊహించలేము సరిగదా, చెప్పితే చాలామందిమి నమ్మలేము కూడ. ఆ మధ్య 'మదర్ ఇండియా'లో వెలువడిన తన ప్రసంగ వ్యాసములో శ్రీ అమల్ కిరణ్ ఆవిష్కరించిన రహస్యమిది –

"అమ్మను చుట్టి 10,12 సింహరాజములు పారాఇస్తూ ఉంటాయి : అయితే ఇది ప్రాణమయభూమికలోని సత్యం". ఈ సింహరాజములు దివ్యశక్తికి సంకేతములు. చెప్పేదనుక మనము ఊహించను కూడ లేని ఈ సింహేంద్ర రూపములో తన దివ్యశక్తియే అమ్మను పరివేష్టించి రక్షించుతూ ఉంటుంది. ఇవిగాక ఇంకా ఎన్నో అసాధారణశక్తులు శ్రీమాతారవిందుల కృతముగా పృథివీవాతావరణములో అవతరించి విప్లవాత్మక సంచలనమును గలిగించుతున్నాయి. ఈ ఉత్కృష్ట శక్తి విశేషములలో బహుశః కట్టకడపటిది అమ్మ జన్మదినమగు 21-2-72 న అవతరించి, పాదార్థిక సంబంధియగు విప్లవమును సృష్టించుతున్నది. దీని వివరణము 'నవ్యశరీర'మను ఈ గ్రంథములోని వ్యాసములోనే గనవచ్చును.

ఒకొకప్పుడు మాతృశ్రీ రక్షణకు శ్రీఅరవిందుడు ఎలా పూనుకుంటారో, దానినిపుడు ఆసక్తితో విందాము : 23-11-1938 వ తేదీన శ్రీఅరవిందునికి అకస్మాత్తుగా, తెల్లవారుజామున పులిచర్మము కాలికి చుట్టుకోవడంవలన, కాలుజారి ఎముక విరిగింది. అది యాదృచ్ఛిక సంఘటనకాదు. అది అరవిందునికి కూడ సహించడానికి అలవి కాని యమబాధను ప్రకోపింపజేసింది. దీనిని గురించి వారిలా తెలియపర్చారు: "ఇంతవరకు నేను అనుభవించిన శారీరకబాధ సాధరణమైనందున దానిని నేను ఆనందముగా మార్చుకొన్నాను. ఈనాటి బాధ దుస్సహతీవ్రమయినది; కాని తీవ్రత తగ్గిన పిమ్మట ఆ బాధనుకూడ ఆనందముగా మార్చుకొన్నాను."

ఈ ఉపద్రవానికి గల ఆంతర్యము వారే ఇలా వ్యక్తముచేశారు :

"నేను కావించవలసిన పోరాటములో దీనిని ఒక భాగముగా అంగీకరింతును. నవంబరు 24 వ తేదీ దర్శనానికి అంతరాయము కల్గించేందుకు అహితశక్తులు పలుసార్లు ప్రయత్నించాయి. శ్రీమాతను రక్షించే కార్యమునందు తత్పరుడనై అసురశక్తుల దండయాత్రలను నేను విజయవంతముగా నెదుర్కొన్నాను. కాని ఆ సమయములో నన్ను నే మరచాను (దాని ఫలితమే ఈ దుర్ఘటన)".

శక్తియొక్క ఆవశ్యకతను తెలియపర్చే ఒక అద్వితీయ ఘట్టమును విస్మయముతో ఇపుడు విందాము: గత మహాయుద్ధములో తనశక్తిని ప్రయోగించానని శ్రీ అరవిందుడే స్వయముగా చెప్పారు. ఒక మహాయుద్ధములో తన అలౌకిశక్తిని ప్రయోగించి, ఆ యుద్ధగతినే దైవకార్యమున కనుగుణముగా మార్చివేసిన మహాయోగి మరెవ్వరైనా ఉన్నారేమో తెలియదు—యోగేశ్వరుడగు ఆ కృష్ణ పరమాత్మతప్ప !

ఈ విషయమున ప్రత్యేకించి భారతావని వారికెంత ఋణపడి ఉన్నదో కనీసం తెలిసికొని కృతజ్ఞులము గావడం మన కనీసధర్మం. వారి మాటలలోనే— "దురదృష్టవశాత్తు నేను అతిమానసశక్తిని ఆ తరుణమున ప్రయోగించలేకపోయాను ! (అతిమానస భూమికలో సామరస్య సమ్మేళనాలకే గాని, విభజన విరోధాలకు తావులేదు.) అధి మానస శక్తిని మాత్రమే ఉపయోగించాను. అందుచేత భారతాంబకు స్వాతంత్ర్యము లభించినా, సత్యదూరమైన విభజన వచ్చిపడింది." ఒక వ్యక్తి, ఒక దివ్యపురుషుడు ఏమి చేయగలడో మనకు నిస్సందేహముగా పై సంఘటన నచ్చచెపుతుంది. అరవిందుడు అలాంటి శక్తిసంపన్నుడై ఉండకపోతే, మనమూ ప్రపంచమూ ఏమి కావాలి ?

సరే, బాగుంది. కాని అరవిందుడు ఎక్కువా, అమ్మ ఎక్కువా? ఇది అనేకులను పీడించే ప్రశ్న! ఈ ప్రశ్న మూలకముగా, కొందరు ప్రముఖులుకూడ ఆశ్రమము విడిచిపోయారు. దీనికిపుడు సమాధానము కనుగొందాము—

*

1939 ప్రాంతములో ఒక భక్తునికీ భవ్యదృశ్యము గోచరించింది: శ్రీ అరవిందుడు దివ్యతేజోవిలాసముతో పరమేశ్వరుని రూపమున మధ్య వెలుగొందుచుండగా, సమస్త దేవతలూ, సమస్త శక్తులూ ఆ పరమ పురుషుని పరివేష్టించి సేవించుతున్నాయి! అట్టి మహోత్కృష్టదశ యందున్న శ్రీ అరవిందుని స్వల్పమగు భుజచలనము సమస్త విశ్వమును ఒక్కపెట్టున భంగించి, తిరిగి నిర్మించగలదని కూడ ఆ భక్తుని కనిపించినది. అంతవరకూ ఆ భక్తుడు శివునికంటే శక్తియే మిన్నయని భావించేవాడు. కాని ఈ దృశ్యానుభవం తర్వాత తన అభిప్రాయము మార్చుకుని, శివుడే పైన — అనే నిర్ణయానికి వచ్చాడు. ఈ విషయము శ్రీ అరవిందుని ముందు సన్నిహితవర్గములోనివారు ప్రస్తావించగా, మనకు తట్టనీ, తనకు అనుభవసిద్ధమైన ఎట్టి సమాధానమును అరవిందుడు అందించారో చూడండి : "అప్పుడు ఆ భక్తుడు ఆ చివరకు పోయాడు, ఇప్పుడు అమాంతముగా ఈ చివరకు దూకాడు!" అని శ్రీ అరవిందుడు పరిహాసింపగా—

"'ఈ చివరకు దూకాడు' ఏమున్నది? శక్తులు ఆరాధిస్తున్నట్లు దర్శించాడుగా ఆభక్తుడు. అందువల్ల అలా అనుకున్నాడు," అని సన్నిహితభక్తులు ఆ భక్తుని సమర్థించారు. అయితే అరవిందుడు ఓడి, ముడుచుకుపోయినట్లేనా? కాదు; అతి సూక్ష్మమైన సమాధానముతో వారినే—వారి పరిమిత జ్ఞానమునే—ఎలా ఓడించారో చూడండి :

"అలా పరమేశ్వరుని ఆరాధించినవి శక్తులుగాని, శక్తి కాదుగా?" అని అరవిందుడు తన జ్ఞాన సౌరభముతో గుబాళించి, వారి ఆక్షేపణను ఎగురగొట్టివేశారు. దీనిలోని భావమేమంటే, ఆది శక్తివేరు, తదుత్పన్నములైన శక్తులు వేరు. ఆదిశక్తికీ, తనకూ తారతమ్యభేదము పాటించడం భ్రమాత్మకమే ! "మే ముభయులము ఒకే చేతనాస్వరూపులము. ఏతద్భిన్నముగా భావించువారు భ్రాంతివలయమునుండి బైటపడనివారే సుమా !" అని అరవిందుడు హెచ్చరించడమే పై వచనానికి పూర్తి భావము. ఇహలోక కార్యము నిమిత్తం ద్విధా రూపొంది వచ్చిన ఒకే పూర్ణతత్వం వారు. శక్తితో అభేదము, సహయోగము తనకు కలదు గావుననే, దేశపరిధిలో, ప్రపంచపరిధిలో తన శక్తిని ప్రయోగించ గలిగారు.

శ్రీ అరవిందుడు తాను రంచిన చిన్ని పుస్తకరత్నము, 'మాతృశ్రీ' లో ఇలా మనకు ధైర్యము చెపుతున్నారు : "దివ్యమాత తన అనుగ్రహ హస్తముతో నిన్ను రక్షించుతూ ఉన్నపుడు, ఏది నిన్ను స్పృశింపనైనా స్పృశింపగలదు ? ఎవనికి నీవు భయపడాలి ?"

ఔను, శక్తి సహయోగము, లేక శక్తి అనుగ్రహము ఉంటే, ఏదీ అసాధ్యముకాదు. అదిలేకపోతే, ఏ ఘనకార్యము సాధించ జాలము. అందుచేతనే శక్తికి ప్రధానావశ్యకత, ఆ ఆవశ్యకత శ్రీ అరవిందునికి శక్తి సహయోగముద్వారా సిద్ధించగా, మనకు శక్తి అనుగ్రహముద్వారా సమకూడాలి !

## "అది అసంభవము"

పరమ చేతన,
అనన్య తత్త్వము,
దివ్య సత్యము అగు ఓ నీవు
మానవ చేతన కవ్వల
వాక్కునకు దూరముగా దీపించుతున్నావు.

24-4-1973 నాటి సందేశము — మాతృశ్రీ

ఇది మాతృశ్రీ పరమ సాక్షాత్కారము. భౌతిక విజ్ఞానములో మానవ చేతన సాధించిన మహిమా విశేషాలు మనకు అబ్బురపాటు కలిగించుతాయి. అది దేనినైనా చేయగలదు – అనే అభిప్రాయము కూడ మనకు కలగడం కద్దు. దాని వలనే మనము పరిపూర్ణతను సాధించుకోగలము – అనే నిర్ణయానికి కూడ వస్తాము. కాని అమ్మ అంటున్నారు: మానవ చేతన చరమ చేతన కాదు. అందుచేత దాని వలన పరిపూర్ణత సంభవము కాదు. మానవ చేతన కావల ఒక మహోన్నత చేతన దీపించుతున్నది: దాని యందే మానవచేతనకు పరిపూర్తి, దాని చేతనే మానవునికి పరిపూర్ణత.

ఈ పరమ చేతనయే చరమ తత్త్వమా? ఒక విధముగా కాదు; అది చరమ తత్త్వము యొక్క చేతన, అందుచేతనే పరమ చేతన. ఇక ఆ తత్త్వము చరమ తత్త్వము గావుననే అనన్యము. అనగా తనతో పోల్చ తగిన అన్యము లేనిది – అనుపమము, అద్వితీయము: ఈ తత్త్వమే మూల సత్యము; మానవ సత్యము కాదు, భగవత్సత్యము. ఈ దివ్య

కొంత పూర్ణముగను రావచ్చును. కాని అదే అవతరణ ప్రవృత్తి, అదే అభివ్యక్తి ప్రవృత్తి, అదే శరీరగత జన్మప్రవృత్తి.

ఇక చివరకు, కేవలము ఆధ్యాత్మికదృష్టితో తిలకించినపుడు, ఆ జన్మము భువిపై నిత్యుని యొక్క జన్మమని చెప్పవచ్చును. ఏలన, అవతారము స్థూలరూపమును స్వీకరించి నపుడెల్ల, అది భువిపై సాక్షాత్తు నిత్యపురుషుని యొక్క జన్మమే యగును.

—మాతృశ్రీ

వ్యాఖ్య : సృష్టియొక్క అర్థమునూ, పరమార్థమునూ గమనించి, గ్రహించి, దానితో శ్రుతికలిపి, తత్పరిపూర్తి కొరకు ఎవరు పాటుపడుదురో, వారి కృషి ఫలితము ఆచంద్రార్కము కొనసాగును. అది భగవదిచ్ఛ ననుసరించి జరుగుతున్నది గాన, భగవదిచ్ఛ ప్రభావము అనంతము గాన, వారి కృషి ఫలితముకూడ అనంతమే అగును.

ఇంతవరకు వచ్చిన అవతారములన్నీ అధి మనస్సుకు (Over mind) చెందిన దేవతలయొక్క అవతారములేనని శ్రీ మాత చెప్పి ఉన్నారు. శ్రీ అరవిందునిలో అతి మనస్సుకూడ అభివ్యక్తమైనది గావున, ఆధ్యాత్మిక దృష్టితో చూచినపుడు, దీనిని నిత్యుడగు పూర్ణ పురుషునియొక్క అవతారమని అనడం సమంజసమగునని మనము భావించుకొనవచ్చును. "కేవలము ఆధ్యాత్మికదృష్టితో...." అని అమ్మ పైన అన్నారు గాన, ఆ దృష్టితో చూచినపుడు, మీరు, నేను, అందరుకూడ ఆ పూర్ణ నిత్యుని యొక్క జన్మములే. అయినపుడు శ్రీ అరవిందుడు తప్పక అట్టి యవతారమే అగును.

## ఆత్మశక్తి

కొన్ని దృష్టాంతాలు: 1) ఆత్మ శక్తి చేత శ్రీ అరవిందుడు, తనను గురించి అప్పటి బాలికయైన అమ్మకు ఏమీ తెలియక పోయినా, ఆమెకు ఫ్రాన్సులో కన్పించేవారు! 2) కలకత్తానుంచి తనకు సహాయార్థం వ్రాసిన లేఖ అందక పూర్వమే, అమ్మ శక్తి కలకత్తాలోని ఆ భక్తుని రోగమును రూపు మాపింది! ఇలా ఆత్మశక్తికి దూరము లేదు సరే, కాలము కూడ లేదు: 3) భారత స్వరాజ్యమును అమ్మ అనేక సంవత్సరాలకు పూర్వమే దర్శించారు.

వ్యాఖ్య : 'ఆత్మయోగాత్' నేనీ విశ్వరూపమును నీకుచూపించానని శ్రీకృష్ణుడు అర్జునునికి ప్రసన్నుడై చెప్పిన దానిని బట్టి అక్కడ కూడా ఆత్మశక్తే ద్యోతక మవుతున్నది.

విషయ జ్ఞానము, తాదాత్మ్య జ్ఞానము అని రెండు ఉన్నాయి. మనస్సు వస్తువును విషయముగానే తెలిసికోగలదు. ఆత్మ వస్తువును, దానితో తాదాత్మ్యము పొంది తెలుసుకుంటుంది. అపుడు లక్షణాలేగాక, వస్తు స్వరూపము కూడ తెలుస్తుంది. పైగా ఆత్మనుంచే అన్నీ వచ్చాయి గనుక, ఆత్మ అన్నింటిని వ్యాపించి ఉంటుంది. కనుక ఆత్మకు దగ్గర దూరాలు ఉండవు.

## శక్తి ఆవశ్యకత

శ్రీ అరవిందుడు తన 'సూత్రాల'లో ఇలా అంటారు –

"క్రీస్తు ప్రేమతో మాత్రమే వచ్చాడు. ఆయనను అసుర శక్తులు

శిలువ వేశాయి. తిరిగి ఖడ్గముతో వస్తాను – అనిచెప్పి ఆయన నిష్క్రమించాడు. ఇక మహమ్మదు శక్తితో మాత్రమే వచ్చాడు. పైగా ఆయన కార్యసాఫల్యానికి అది సరియైన సమయము కూడ కాదు.

"శక్తిప్రేమలు కలిసినపుడే అప్రతిహతముగా దివ్యకార్యము నిర్వహింపబడుతుంది. దానిని హిందూమతము చేయవలసి ఉన్నది."

కావున శక్తిప్రేమల సమన్వయసంపత్తితో అరుదెంచిన శ్రీమాత, శ్రీఅరవిందుల విశిష్టతను మనము మనసున పట్టించుకోవాలి :

శ్రీఅరవిందుడే కాదు, ఈశక్తి విషయమున అమ్మ పరిశీలనగా సూచించిన క్రమమును కూడ చూద్దాము –

"అవతరణక్రమములో ముందు శాంతి దిగవచ్చు, లేక తేజము, లేక ఆనందము, లేక ప్రేమ. కాని నా దృష్టిలో ముందు శక్తి అవతరించడం అవసరం. అది లేకపోతే ఇక్కడ దివ్యత్వానికి రక్షణ ఉండదు."

సాధకునికి ప్రథమావతరణం శాంతిగావడం మంచిది. కాని అమ్మ వంటి అవతారపురుషులకు ప్రథమావతరణం దుర్దమమైన శక్తిగావడం అవసరం. ఏలనంటే, మనలను రక్షించడానికి అమ్మ ఉన్నది. కాని అమ్మను రక్షించడానికో? తనశక్తే తనను పరివేష్టించి ఉండడం ఆవశ్యకం. అయితే ఈ పరివేష్టనం ఎలా ఉంటుందో మనము ఊహించగలమా? ఊహించలేము సరిగదా, చెప్పితే చాలామందిమి నమ్మలేము కూడ. ఆ మధ్య 'మదర్ ఇండియా'లో వెలువడిన తన ప్రసంగ వ్యాసములో శ్రీ అమల్ కిరణ్ ఆవిష్కరించిన రహస్యమిది –

"అమ్మను చుట్టి 10,12 సింహరాజములు పారాడుస్తూ ఉంటాయి : అయితే ఇది ప్రాణమయభూమికలోని సత్యం". ఈ సింహరాజములు దివ్యశక్తికి సంకేతములు. చెప్పేదనుక మనము ఊహించను కూడ లేని ఈ సింహేంద్ర రూపములో తన దివ్యశక్తియే అమ్మను పరివేష్టించి రక్షించుతూ ఉంటుంది. ఇవిగాక ఇంకా ఎన్నో అసాధారణశక్తులు శ్రీమాతారవిందుల కృతముగా పృథివీవాతావరణములో అవతరించి విప్లవాత్మక సంచలనమును గలిగించుతున్నాయి. ఈ ఉత్కృష్ట శక్తి విశేషములలో బహుశః కట్టకడపటిది అమ్మ జన్మదినమగు 21-2-72 న అవతరించి, పాదార్థిక సంబంధియగు విప్లవమును సృష్టించుతున్నది. దీని వివరణము 'నవ్యశరీర'మను ఈ గ్రంథములోని వ్యాసములోనే గనవచ్చును.

ఒకొకప్పుడు మాతృశ్రీ రక్షణకు శ్రీఅరవిందుడు ఎలా పూనుకుంటారో, దానినిపుడు ఆసక్తితో విందాము : 23-11-1938 వ తేదీన శ్రీఅరవిందునికి అకస్మాత్తుగా, తెల్లవారుజామున పులిచర్మము కాలికి చుట్టుకోవడంవలన, కాలుజారి ఎముక విరిగింది. అది యాదృచ్ఛిక సంఘటనకాదు. అది అరవిందునికి కూడ సహించడానికి అలవి కాని యమబాధను ప్రకోపింపజేసింది. దీనిని గురించి వారిలా తెలియపర్చారు: "ఇంతవరకు నేను అనుభవించిన శారీరకబాధ సాధరణమైనందున దానిని నేను ఆనందముగా మార్చుకొన్నాను. ఈనాటి బాధ దుస్సహతీవ్రమయినది: కాని తీవ్రత తగ్గిన పిమ్మట ఆ బాధనుకూడ ఆనందముగా మార్చుకొన్నాను."

ఈ ఉపద్రవానికి గల ఆంతర్యము వారే ఇలా వ్యక్తముచేశారు :

"నేను కావించవలసిన పోరాటములో దీనిని ఒక భాగముగా అంగీకరింతును. నవంబరు 24 వ తేదీ దర్శనానికి అంతరాయము కల్గించేందుకు అహితశక్తులు పలుసార్లు ప్రయత్నించాయి. శ్రీమాతను రక్షించే కార్యమునందు తత్పరుడనై అసురశక్తుల దండయాత్రలను నేను విజయవంతముగా నెదుర్కొన్నాను. కాని ఆ సమయములో నన్ను నే మరచాను (దాని ఫలితమే ఈ దుర్ఘటన)".

శక్తియొక్క ఆవశ్యకతను తెలియపర్చే ఒక అద్వితీయ ఘట్టమును విస్మయముతో ఇపుడు విందాము: గత మహాయుద్ధములో తనశక్తిని ప్రయోగించానని శ్రీ అరవిందుడే స్వయముగా చెప్పారు. ఒక మహాయుద్ధములో తన అలౌకికశక్తిని ప్రయోగించి, ఆ యుద్ధగతినే దైవకార్యమున కనుగుణముగా మార్చివేసిన మహాయోగి మరెవ్వరైనా ఉన్నారేమో తెలియదు—యోగేశ్వరుడగు ఆ కృష్ణ పరమాత్మతప్ప !

ఈ విషయమున ప్రత్యేకించి భారతావని వారికెంత ఋణపడి ఉన్నదో కనీసం తెలిసికొని కృతజ్ఞులము గావడం మన కనీసధర్మం. వారి మాటలలోనే— "దురదృష్టవశాత్తు నేను అతిమానసశక్తిని ఆ తరుణమున ప్రయోగించలేకపోయాను ! (అతిమానస భూమికలో సామరస్య సమ్మేళనాలకే గాని, విభజన విరోధాలకు తావులేదు.) అధి మానస శక్తిని మాత్రమే ఉపయోగించాను. అందుచేత భారతాంబకు స్వాతంత్ర్యము లభించినా, సత్యదూరమైన విభజన వచ్చిపడింది." ఒక వ్యక్తి, ఒక దివ్యపురుషుడు ఏమి చేయగలడో మనకు నిస్సందేహముగా పై సంఘటన నచ్చచెపుతుంది. అరవిందుడు అలాంటి శక్తిసంపన్నుడై ఉండకపోతే, మనమూ ప్రపంచమూ ఏమి కావాలి ?

సరే, బాగుంది. కాని అరవిందుడు ఎక్కువా, అమ్మ ఎక్కువా? ఇది అనేకులను పీడించే ప్రశ్న! ఈ ప్రశ్న మూలకముగా, కొందరు ప్రముఖులుకూడ ఆశ్రమము విడిచిపోయారు. దీనికిపుడు సమాధానము కనుగొందాము—

*

1939 ప్రాంతములో ఒక భక్తునికి భవ్యదృశ్యము గోచరించింది: శ్రీ అరవిందుడు దివ్యతేజోవిలాసముతో పరమేశ్వరుని రూపమున మధ్య వెలుగొందుచుండగా, సమస్త దేవతలూ, సమస్త శక్తులూ ఆ పరమ పురుషుని పరివేష్టించి సేవించుతున్నాయి! అట్టి మహోత్కృష్టదశ యందున్న శ్రీ అరవిందుని స్వల్పమగు భుజచలనము సమస్త విశ్వమును ఒక్కపెట్టున భంగించి, తిరిగి నిర్మించగలదని కూడ ఆ భక్తుని కనిపించినది. అంతవరకూ ఆ భక్తుడు శివునికంటే శక్తియే మిన్నయని భావించేవాడు. కాని ఈ దృశ్యానుభవం తర్వాత తన అభిప్రాయము మార్చుకుని, శివుడే పైన — అనే నిర్ణయానికి వచ్చాడు. ఈ విషయమును శ్రీ అరవిందుని ముందు సన్నిహితవర్గములోనివారు ప్రస్తావించగా, మనకు తట్టనీ, తనకు అనుభవసిద్ధమైన ఎట్టి సమాధానమును అరవిందుడు అందించారో చూడండి: "అప్పుడు ఆ భక్తుడు ఆ చివరకు పోయాడు, ఇప్పుడు అమాంతముగా ఈ చివరకు దూకాడు!" అని శ్రీ అరవిందుడు పరిహసింపగా—

" 'ఈ చివరకు దూకాడు' ఏమున్నది? శక్తులు ఆరాధిస్తున్నట్లు దర్శించాడుగా ఆభక్తుడు. అందువల్ల అలా అనుకున్నాడు," అని సన్నిహితభక్తులు ఆ భక్తుని సమర్థించారు. అయితే అరవిందుడు ఓడి, ముడుచుకుపోయినట్లేనా? కాదు; అతి సూక్ష్మమైన సమాధానముతో వారినే—వారి పరిమిత జ్ఞానమునే—ఎలా ఓడించారో చూడండి:

"అలా పరమేశ్వరుని ఆరాధించినవి శక్తులుగాని, శక్తి కాదుగా అని అరవిందుడు తన జ్ఞాన సౌరభముతో గుబాళించి, వారి ఆక్షేపణ ఎగురగొట్టివేశారు. దీనిలోని భావమేమంటే, ఆది శక్తివేరు, తదు న్నములైన శక్తులు వేరు. ఆదిశక్తికీ, తనకూ తారతమ్యభేదము పా చడం భ్రమాత్మకమే ! "మే ముభయులము ఒకే చేతనాస్వరూపులమ ఏతద్భిన్నముగా భావించువారు భ్రాంతివలయమునుండి బైటపడని సుమా !" అని అరవిందుడు హెచ్చరించడమే పై వచనానికి పూ భావము. ఇహలోక కార్యము నిమిత్తం ద్విధా రూపొంది వచ్చిన పూర్ణతత్వం వారు. శక్తితో అభేదము, సహయోగము తనకు క గావుననే, దేశపరిధిలో, ప్రపంచపరిధిలో తన శక్తిని ప్రయోగి గలిగారు.

శ్రీ అరవిందుడు తాను రచించిన చిన్ని పుస్తకరత్నము, 'మాతృ లో ఇలా మనకు ధైర్యము చెపుతున్నారు : "దివ్యమాత తన అ గ్రహ హస్తముతో నిన్ను రక్షించుతూ ఉన్నపుడు, ఏది నిన్ను స్పృశి నైనా స్పృశింపగలదు ? ఎవనికి నీవు భయపడాలి ?"

ఔను, శక్తి సహయోగము, లేక శక్తి అనుగ్రహము ఉం ఏదీ అసాధ్యముకాదు. అదిలేకపోతే, ఏ ఘనకార్యము సాధించ జాలవ అందుచేతనే శక్తికి ప్రధానావశ్యకత, ఆ ఆవశ్యకత శ్రీ అరవిందు శక్తి సహయోగముద్వారా సిద్ధించగా, మనకు శక్తి అనుగ్రహముద్వా సమకూడాలి !

## "అది అసంభవము"

పరమ చేతన,
అనన్య తత్వము,
దివ్య సత్యము అగు ఓ నీవు
మానవ చేతన కవ్వల
వాక్కునకు దూరముగా దీపించుచున్నావు.

24-4-1973 నాటి సందేశము — మాతృశ్రీ

ఇది మాతృశ్రీ పరమ సాక్షాత్కారము. భౌతిక విజ్ఞానములో మానవ చేతన సాధించిన మహిమా విశేషాలు మనకు అబ్బురపాటు కలిగించుతాయి. అది దేనినైనా చేయగలదు — అనే అభిప్రాయము కూడ మనకు కలగడం కద్దు. దాని వలనే మనము పరిపూర్ణతను సాధించుకో గలము — అనే నిర్ణయానికి కూడ వస్తాము. కాని అమ్మ అంటున్నారు: మానవ చేతన చరమ చేతన కాదు. అందుచేత దాని వలన పరిపూర్ణత సంభవము కాదు. మానవ చేతన కావల ఒక మహోన్నత చేతన దీపించు తున్నది: దాని యందే మానవచేతనకు పరిపూర్తి, దాని చేతనే మానవునికి పరిపూర్ణత.

ఈ పరమ చేతనయే చరమ తత్వమా? ఒక విధముగా కాదు; అది చరమ తత్వము యొక్క చేతన, అందుచేతనే పరమ చేతన. ఇక ఆ తత్వము చరమ తత్వము గావుననే అనన్యము. అనగా తనతో పోల్చ తగిన అన్యము లేనిది — అనుపమము, అద్వితీయము: ఈ తత్వమే మూల సత్యము; మానవ సత్యము కాదు, భగవత్సత్యము. ఈ దివ్య

సత్యము వైపుకే సృష్టి నిరంతరము పయనించుతున్నది. సృష్టియందు అగ్రస్థానము నాక్రమించిన మానవునికి ఏది గమ్యమో, ఆ దివ్యసత్యమును అమ్మ తన సాక్షాత్కారము ద్వారా సూచించు తున్నారు. (సత్తునకు అను గుణమైనది సత్యం; విరుద్ధమైనది అనృతము. సత్తే చరమ తత్త్వము).

అది వాక్కునకు అందనిది గాన, అమ్మ సూచించుతున్నారు; అభివర్ణించి చెప్పడం లేదు, వాక్కునకు అందదు – అని మాత్రం సూచించుతున్నారు.

అయితే అందనిది మనకు గమ్యం ఎలా అవుతుంది? ఆ అనన్య తత్త్వం మనో వాక్కులకు మాత్రమే అందదని అమ్మ వచించారు గాని. అసలే అందేది కాదు అని పలుక లేదు. యోగసాధన ద్వారా అంతః సత్తకు, అంతరాత్మకు క్రమముగా అందగలదు. అంతః సత్త ద్వారా ముందు విశ్వ చేతనలో అడుగుపెట్టి, మన చేతన విశ్వచేతన కాగలిగితే ఆ విశ్వచేతన నుంచి, అతీత చేతనలో, అంటే మాతృశ్రీ దర్శించిన పరమ చేతనలో మనము ప్రవేశించగలుగుతాము. దీనినే శ్రీమాత 1973 నకు ఇచ్చిన ఉగాది సందేశములో ఇలా చెప్పారు :

"నీ చేతన ప్రపంచమంతట ఏక కాలములోనే స్ఫురింప మొదలిడి నపుడు, పరమ దైవమునుకూడ నీ ఎరుక లోనికి తెచ్చుకొన గలవు."

మనసత్తలోని ప్రతి విభాగము, దానికి సంబంధించిన విశ్వ విభాగములోని ఒక అంశమే. ఉదాహరణకు, వ్యక్తి మనస్సు విశ్వ మనస్సులో ఒక అంశమే! ఈ రెండు మనస్సులకు అనుక్షణము ఆదాన ప్రదానాలు మనకు తెలియకుండా, జరుగుతూనే ఉన్నాయి. ఎందుక

తెలియడం లేదు ? అహంకారమే అడ్డుగోడగా నిల్చింది! ఈ అహంకార నిర్మూలనముతో సంకుచితమైన ఇప్పటి మానవ చేతన క్రమముగా విశ్వ విశాలమై విలసిల్లగలదు. అపుడు పర తత్వముతో సాయుజ్యానికి అది సరియైన స్థానములో ఉంటుంది.

పరతత్వము మన తెలివికి ఆవల, దూరముగా ఎక్కడో ఉంటుందని ప్రారంభించాము ఈ ప్రసంగమును. కాని ఇపుడు ఆ తెలివి సాధనద్వారా అహం నిర్ముక్తమై పరమును అందుకొనే పరిణామమును ప్రాప్తించగలదని గ్రహించాము. నిజానికి సాధనలో ఒక దశ రాగలదు. ఆ దశలో పర తత్వము దూరముగా ఉండే మాట అటుంచి, పరతత్వపు ఛాయలు మనకు చల్లదనము కల్పించకపోతే, అడుగు ముందుకు వేయలేని అవస్థ అను భూతమవుతుంది. కారణం, మన అహం అడుగంటిన పిమ్మట, దైవశక్తియే మన సాధనను చేపట్టి సాగించుతుంది. దీనినే శ్రీమాత తన 95వ జన్మ దినమగు 21-2-1973న ఇచ్చిన సందేశములో ఇలా చెప్పారు.

"ఎంతెంత యోగమార్గమున మనము పురోగమించుతామో, దివ్య సన్నిధానము యొక్క అవసరము మనకు అంతంత ఆవశ్యకమూ, అని వార్యమూ అవుతుంది."

ఆ సన్నిధానములో శాంతి, స్వేచ్ఛ, శక్తి, చేతన, రక్షణ, భద్రత - ఇత్యాదులను సాధకుడు అనుభవిస్తూ ఉంటాడు. అందుచేతనే భగవదుపస్థితి అంత అవసరమవుతుంది. ఈ విధముగా మనము భగవదుప స్థితిని అనుభవిస్తూ, చివరకు స్థిరమగు భగవత్తాదాత్మ్యములో మునిగిపో తాము. ఇలా పరానికీ, మనకూ దూరము తొలగిపోవటమేకాదు, అదే, అతడే మనము కాగలుగుతాము, అయి దివ్యమానవులముగా మించి దీపించుతాము.

అమ్మ ప్రతి సందేశము తన అనుభవము నుంచి ఆవిర్భవించినదే! ఈ జన్మదిన సందేశానికి మూలమగు అమ్మ అనుభవము ? ఈ అనుభవము ఫిబ్రవరి, 1973 బుల్లెటిన్‌లోని 'మార్గ విషయములు' (యోగ) (Notes on the way) అనే శీర్షిక క్రింద మనము చూడగలము. అమ్మ హృదయమునుంచి పెకలించుకుని వచ్చిన అందులోని మంత్ర వచనములివి:

"నీవు (భగవంతుడు) లేనపుడు అది మరణము, నీవు ఉన్నపుడు అది జీవితము. 'మరణ' మనగా శరీరమరణమనికాదు నా భావము – కాని అదికూడ సంభవించవచ్చు; నేనిపుడు భగవత్సంపర్కమును కోల్పోదునేని, అదే అంతముకావచ్చు !"

ఇదిగో, ఇదీ అమ్మ అనుభూతి. అందుచేతనే భగవత్సన్నిధానము 'ఆవశ్యకమూ', 'అనివార్యమూ' అన్నారు. ఎంత ఆవశ్యకమంటే, ఆ సన్నిధానము క్షణము అంతరించితే ప్రాణమేపోవచ్చు !

'భగవత్సంపర్కము కోల్పోదునేని, అదే నా అంతముకావచ్చు ! అనే అమ్మ వాక్యము విని మనకు దిగులు కలుగుతున్నది కదూ ? కాని భాగ్యవశాత్తు అమ్మ ఆ వాక్యము పలికిన వెంటనే అన్నారు :

"కాని అది అసంభవం"

---

'అమ్మయ్య', అని ఈ వాక్యము విన్నతర్వాత మళ్లీ మనము ఊపిరి పీల్చుకుంటున్నాము ! అయితే ఎందుకు అది అసంభవము ? ఎందుకంటే. (అమ్మ తన తర్వాతి అనుభూతిని ఇలా తెలియజేస్తున్నారు) :

"ఇప్పటి చేతనలో ఎన్ని ప్రతిబంధకము లున్నప్పటికీ, నేను అదే – అనే అనుభూతి కలదు."

ఈ సంపర్కములో నుంచి తాదాత్మ్యానికి వెళ్లారు తల్లిగారు. తాదాత్మ్యముగా పర్యవసించి నపుడు – అపుడే– సంపర్కము(సాయుజ్యం) స్థిరమూ, రూఢమూనయి నెలకొంటుంది. కావుననే సంపర్కమును కోల్పోవడం అసంభవమన్నారు అమ్మ. అమ్మ ఆస్థితియే ప్రపంచానికి ఆశాదీపము.

కాని ఇక్కడ అమ్మ అంటేఎవరు? అమ్మ స్వరూపానికి సంపర్కము కోల్పోవడం అనే సమస్య అసలు ఎలా ఉదయించుతుంది? దీనికి సమాధానం 'ఇప్పటి చేతనలో ఎన్ని ప్రతిబంధకము లున్నప్పటికీ,' అని అమ్మ జోడించిన వాక్యభాగములో ఉన్నది. ఈ ప్రతిబంధకములు మన చేతనలోని ప్రతిబంధకములు. ఇచ్చటి అమ్మ స్వరూపగతమైన అమ్మకాదు. మనచేతన లన్నింటినీ తన విశ్వచేతనలో ఇముడ్చుకుని, సమష్టినే సముద్ధరింపజూచే అమ్మ! కావుననే సంపర్కము యొక్క స్థిరతాస్థిరతల ప్రసక్తి వచ్చింది.

దైవ సంపర్కమును క్షణము కోల్పోతే అది శరీరానికి మరణమే కావచ్చునని అమ్మ హెచ్చరించారే! ఇంత సున్నితమైన స్థితిలో అమ్మ వ్యక్తులను ఎలా కలసికొంటున్నారు? ఇప్పటివ అమ్మ అన్నారు:

"సంపర్కమునకు అడ్డువచ్చే అన్యత నిరాకరణము, సంపర్క సంరక్షణము – ఈ కృషియందే ప్రతిదినము, అనవరతము మునిగి యున్నాను – వ్యక్తులకు దర్శన మిచ్చునపుడుకూడ! అది ఒక్కటే

జీవితానికి విలువనిచ్చే కృషి........ఎవరికైనా దర్శన మిచ్చినపుడు, అతడు ఎట్టివాడైనాసరే, నేను చేసేది ఇదే (అమ్మహస్తకమలములను తెరచి, పైకెత్తి, అతనిని దివ్యతేజమునకు అర్పించుతున్న అభినయము చేస్తున్నారు.)

ఈ విధముగా తన సంపర్కమును రక్షించుకుంటూ ఆ రక్షించు కునే ఉపాయముగా మనముకూడ ఆవెలుగునకే అర్పించుతూ, ఆ కృషిలో అంతర్భాగముగా మనకుకూడ ఆ సంపర్కమును చవిచూపుతున్నారు.

# ఎవరీ మాతృశ్రీ ?

ఒకప్పుడు మాతృశ్రీ అనుమతించి, ఆమోదించిన 15, 20 మంది ఆశ్రమవాసులు వారి సన్నిధిలో ధ్యానము సల్పేవారు. వారిలో స్థిర చిత్తులు, ఇద్దరు,ముగ్గురు తప్పితే, అమ్మనుండి అవ్యాహతముగా ప్రసరించే శక్తిప్రభావమును తట్టుకోలేక యథార్థముగా ఊగిపోయేవారు తక్కిన వారు! ఆభాగ్యవంతుల బృందములో ఒకరైన శ్రీ అమల్‌కిరణ్ తన వ్యాసములో ఈ అద్భుత విషయమును మనకు అందించారు :

అంతకుమించిన మహాద్భుతమును కూడ శ్రీ అమల్‌కిరణ్ తన కన్నులారగాంచారు. ఒకనాడు ధ్యానమధ్యములో కౌతూహలముతో కనువిప్పి చూచేసరికి ఆయన కేమి గోచరించింది ? తల్లిగారి స్థానములో తల్లిగారులేరు! మరి? శ్రీ అరవిందుడు తన మాతృశ్రీ (The Mother) —అను గ్రంథములో అభివర్ణించిన మహేశ్వరీదేవి ఆ స్థాన

ములో దర్శనమిచ్చారు! ఆదేవి తనువు మన మెరిగిన అమ్మశరీరము కంటే ఎంతో పెద్దదిగా గోచరించింది! అంతేకాదు, ఆ దివ్యతనువు నుండి తేజోవిశేషము దశదిశలా ఉట్టిపడుతున్నది! మానవ భూమికకు పైన అతి విశాలమగు స్వీయ భూమికలో విరాజిల్లుతున్నట్లు విస్పష్టముగా కన్పించింది! ఈ పరమ విశాలత మహేశ్వరికి ఒక విశిష్టలక్షణము.

అవును, ఇది మహాద్భుతమే. ఈ మహాద్భుతము మాతృశ్రీ స్వరూపపరిచయము చేసింది. కాని అమ్మ ఏ మహాకార్యమును లక్షించి అరుదెంచారో, దాని పరిచయమింకా మనకు కాలేదు. అమల్ కిరణ్ సతీమణికి మహాద్భుతమును మించిన అత్యద్భుత మనదగు ఆ దృశ్యము గోచరించింది : అమ్మనుంచి అమోఘముగా ప్రభవించుతూన్న ప్రభా పూరము మనలో ప్రవేశించి, మన భౌతికమును జీర్ణించుకుని, దానికి తనతో సారూప్యతను కల్గించుతూ ఉన్నట్లు ఆ మహిళామణికి కన్పించింది! ఇదిగో, అదే అమ్మ నిజస్వరూపము, ఇదే అమ్మ కార్య స్వరూపము !

ఇపుడు ఈ కార్యపరిణామము ఏఏ దశలద్వారా సాగుతున్నదో గమనించుదాము. 1956, ఫిబ్రవరి 29న అతిమనస్సు తిరుగులేని విధముగా, స్థిరముగా పృథివీ వాతావరణమున – మనలను అన్ని వైపులా ఆవరించి ఉన్న ఈ వాతావరణమందే – అభివ్యక్తమయింది ! యుగ యుగాల ప్రకృతి పరిణామానికి పరకాష్ఠయైన ఈ అపూర్వ సంఘటనను గురించి అమ్మ యిచ్చిన రెండు సందేశాలు 1956 – బుల్లెటిన్‌లో వెలు వడినాయి. అందులో ప్రథమ సందేశము :

ప్రభూ! నీవు ఇచ్చించగా, నేను నిర్వహించుచున్నాను.
ఒక నూతనతేజము భువిపై ఉదయించుచున్నది,
ఒక నూతన ప్రపంచము జన్మ మెత్తుతున్నది,
నీ వాగ్దానములు నెరవేరుతున్నాయి.

ఇక ద్వితీయ సందేశము :

పృధివీతలముపై అతిమానసాభివ్యక్తి –
ఇపు డది ఒక వాగ్దానము మాత్రమే కాదు,
ఇపు డది సజీవసత్యము, పరమ యథార్థము,
ఇపు డది తన కృషిలో నిమగ్నమయి ఉంది;

ఇక్కడ, భువిపై అత్యంత అంధులు, అత్యంత జడులు, చివరకు అత్యంత విముఖులుసైతం దానిని అవశ్యముగా గుర్తించే ఒకానొక శుభ దినము రాగలదు.

ఒకటవ సందేశములో 'నీ వాగ్దానములు....' అని చివరి పంక్తిలో చూచాము. వాగ్దానా లేమిటి? ఎవరికి? ఎందుకు?

పరములోని ఒకానొక సత్యము ననుసరించి సృష్టి జరిగింది. దాని పర్యవసానముగా సమస్త చేతనా, అవచేతనలో కూడా గాదు— నిశ్చేతన (Inconscience) లో నిమగ్నమయి పోయింది. నిలీనమయిపోయింది! ఈ మహామూఢావస్థనే, 'తమ ఆసీత్ తమసాగూఢం', (తమస్సు తమస్సు చేతనే పొదుగబడి ఉంది) – అని వేదము వర్ణించుతోంది. ఇప్పుడు దిక్కేమిటి? దివ్యమాత, విశ్వజనని ఆత్మాహుతి పూర్వకముగా ఆ ఘోరాంధకారములో ప్రవేశించింది! ఆ అంధకారముయొక్క భయంక

రావస్థను తాను స్వీకరించింది. అలా స్వీకరించి, అందులో చేతనాస్ఫూర్తి కలిగించి, చేతనా వికాసమును సృష్టిలో సాధించుతూ, ఆ సృష్టిని తిరిగి పరమాత్మ వైపుకు నడుపుతోంది. అందుచేతనే శ్రీ అరవిందుడు ఒక సందర్భములో 'దీనిని పరమేశ్వరుని ఆత్మాహుతి అనడంకంటే, మాత యగు పరమేశ్వరి ఆత్మాహుతి అనడమే మిక్కిలి సమంజసము' అని వ్యాఖ్యానించారు. తన బిడ్డల సమస్త కష్టములను తనపైన వేసుకుని, వారి సముద్ధరణమును సాధించే మహోద్యమములో అమ్మ ఆ పరమేశ్వరునికి ఎన్నో అభ్యర్థనలు చేస్తూఉంటుంది. దానికి పరమేశ్వరుడు ఆశ్వాస పూర్వకముగా వాగ్దానములు చేస్తూ ఉంటాడు. ఇప్పుడు విదితమయింది మనకు, వాగ్దానాలేమిటో. అమ్మ మన సముద్ధరణము కొరకు ఆవేదనతో పరమేశ్వరుని నుండి పొందిన వాగ్దానాలవి. భాగవతపురాణములో భూదేవి తన బిడ్డల కొరకు విష్ణుదేవుని అర్థించడం మనకు తెలుసును గదా! (1959 సందేశమునుకూడ ఇప్పట్టున చూడనగును.)

అయితే ఇప్పుడీ వాగ్దానాలు ఏ దశలో ఉన్నాయి? ఏది ఫలించడానికైనా కాలముకూడ కలసిరావాలి. ప్రతి సాఫల్యానికీ ఒక తరుణముంటుంది. దీనినే శ్రీ అరవిందుడు తన సాధనచతుష్టయములో వివరించారు. అదృష్టవశాత్తు ఆ భగవద్వచనములు ఫలించగల తరుణమిదే. అందుచేతనే పృథివీసమస్యలను మౌళికముగా పరిష్కరించగల భగవంతుని వాగ్దాన రూపమగు అతిమానసాభివ్యక్తి ఇపుడు సాక్షాత్తు జరుగుతోంది – అని రెండవ సందేశములో–ఉద్ఘాటించుతున్నారు. నిజానికి, వాగ్దానాలు నెరవేరుతున్నాయి – అని ఆది సందేశములోనే ఉన్నప్పటికీ, దానినే మరింత వక్కాణించుతున్నారు రెండవ సందేశములో. అంధులు, జడులు, విముఖులు కూడ దానిని అంగీకరింపక తప్పని సమయము రాగలదని వక్కాణించుతున్నారు.

అయితే ఆ సమయము 'రాగలదా?' లేక 'వచ్చిందా'? మొదటి సందేశములో భువిపై ఒక భవ్యతేజము ఉదయించుతున్నదనీ, ఒక నూతన ప్రపంచము రూపుదాల్చుతున్నదనీ చెప్పారే? అతిమానసావతరణ ఫలితముగా నూతన అతిమానవజాతి ఆవిర్భవించిందా? ఆవిర్భవించితే ఎక్కడ ఉన్నది? – అని ఆశ్రమ బాలలు అమ్మను చాల కుతూహలముతో అడిగారు. దానికి అమ్మ –

"నూతన జాతియా? ఆగండి! ఏవో కొన్నివేల సంవత్సరాలు ఎదురుచూడండి. అప్పుడు ఆ జాతిని కనులార గాంచగలరు" అని తగిన జవాబిచ్చారు. నూతన ప్రకాశము దిగ్వలయముపై ఇపుడే ఉదయించుతోంది. నూతన మానవుడు పురిటి నొప్పులలో ఉన్నాడు. కావుననే అమ్మ అంధులుకూడ అవశ్యం గాంచగల సమయము 'రాగలదు' అని చెప్పారు గాని, వచ్చింది అని వక్కాణించలేదు. కాని మనకు నిరుత్సాహము అవసరములేదు. అవతరించిన అతిమనస్సు ఇపుడు సజీవముగా పనిచేస్తోంది, బలీయముగా ఉద్యమించుతోంది – అని రెండవ సందేశములో అమ్మే తెలియపర్చారు గదా.

ఏ తత్ఫలితముగా, పైన అమ్మ పిల్లలతో అన్న కొన్నివేల సంవత్సరాలలో గాక, ఒకటి రెండువందల సంవత్సరాల్లోనే శరీరము ఆహారమును అపేక్షించని (ఇపుడు మనము నమ్మనుకూడ నమ్మలేని) మౌళిక పరివర్తనమును పొందనున్నది. డిశంబరు, 1972 నాటి మాతృశ్రీ వచనము :

"అతిమానస పరివర్తనానికి మారుపేరు కఠోర పరిశ్రమము. అందువలన దానికి దృఢమగు శరీర మవసరము. కొంత కాలమువరకు,

బహుశః శతాధిక సంవత్సరాలవరకు, తన బలమును నిలుపుకోడానికి భౌతిక శరీరానికి ఆహార మవసరమవుతుంది; మన మీ అవసరమును పూరించవలసే ఉంటుంది." కొన్ని లక్షల ఏండ్లనుంచి మానవుడు ఆహారము మ్రింగుతూ వస్తున్నాడు. అది 1, 2 వందల సంవత్సరాల స్వల్పకాలములోనే అనవసరము కానున్నదంటే, ఎంత శరవేగముతో పరివర్తన గతి పరుగిడుతున్నట్లు? ACC NO. 3256

ఈ విధముగా వాగ్దానాలు ఫలోన్ముఖ మవుతున్నాయి. అమ్మ చేపట్టిన కార్యసాఫల్యములోని స్వర్ణఘట్టమిది! ఎవరీ మాతృశ్రీ? అతిమానసమును ఫలోన్ముఖముగా నడుపుతూ ఉన్న మహాశక్తి!

ఎవరీ మాతృశ్రీ? మరొక మహనీయుని అనుభవము ద్వారా అమ్మ తత్వమును చవిచూద్దాము. ఆచార్య మిత్ర (Professor Mitra) అరవిందుని పితృపితామహుల గ్రామానికి చెందినవారు. ఆయనకు అరవిందునిపట్ల ఎంతో ఆదరాతిశయము. ఆశ్రమానికి వచ్చినపుడు ఆ పరిణతచిత్తునకు రెండు భవ్యదృశ్యాలు గోచరించాయి: ఒకదానిలో సువర్ణకాంతి దిగివస్తూ, మాతృశ్రీ మూర్తిగా రూపొందడం కన్పించింది! దీనిపై శ్రీ అరవిందుడు – 181.4 ARA

"అది అర్థంకావడం సులభమే. సువర్ణకాంతి దివ్యసత్యమునకు సంకేతం. ఇక అమ్మ ఆ సత్యముయొక్క మూర్తీభావము." అమ్మ స్వరూపం దివ్యసత్యం, అమ్మరూపం దాని మూర్తీభావం, అమ్మకార్యం భువిపై ఆ దివ్యసత్య ప్రతిష్ఠాపనం! 84.2250

ఈ కార్యములో అమ్మకు సహకారులెవరు? మిత్రా గారికి కన్పించిన ద్వితీయదృశ్యం: సునీలవర్ణపు కాంతి ఆయన కంటిని గట్టిగా

